శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సుధారసమంజరీ – 3

# శ్రీభాష్యసారం

**(శ్రీ ఉ. వే. వేళుక్కుడి వరదాచార్య స్వామివారు అనుగ్రహించిన వ్యాసాలను, ఉపన్యాసాలను ఆధారంగా చేసికొని సంపాదింపబడినది)**

తమిళ గ్రంథ సంపాదకులు

ఉ. వే. కోయిల్ ఆత్తాన్ విజయ రాఘవాచార్యస్వామివారు



భగవద్రామానుజులు, తిరునారాయణపురం



ఆంధ్రానువాదం

'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పంగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



భగవద్రామానుజులు, శ్రీరంగం




భగవద్రామానుజులు, తిరుమల

# విజ్ఞాపన

దాసుడు న్యాయ వేదాంత విద్వాన్, శ్రీవైష్ణవ సింహం, ఉ. వే. శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యస్వామివారి భగవద్విషయకాలక్షేపగోష్ఠిలో అన్వయించే సమయం అది. 1994 సం. నుండి 2001 సం. వరకు ఆ గోష్ఠి జరిగింది. అది తిరుపతిలో శిరియ కేళ్వి అప్పన్ చిన్న జీయర్ స్వామివారి మఠంలో జరిగింది. ఆ గోష్ఠిలో తిరుపతి ఆంధ్రా బ్యాంకులో ఆఫీసర్ గా పని చేసే ఉ. వే. శ్రీమాన్ ఎస్. విజయ రాఘవాచార్యస్వామివారు కూడా అన్వయించేవారు. ప్రసన్న వదనంతో ఎంతో స్నేహపూర్వకంగా వ్యవహరించే వారి శైలి అందరినీ ఆకట్టుకునేది. అంతే కాదు, వారికి సంస్కృతంలో, ద్రావిడంలో, ఆళ్వార్ల శ్రీ సూక్తులలో ఉండే చక్కని చిక్కని పరిచయాన్ని చూసి శ్రీకృష్ణమాచార్య స్వామివారు కూడా చాలా ఆనందపడేవారు.

2001వ సంవత్సరంలో ఎంతో వైభవంగా నిర్వహింపబడిన శ్రీవేళుక్కుడి వరదాచార్యస్వామివారి శతాభిషేక మహోత్సవ సందర్భంగా వారి దివ్యస్మృతిగా వారి విషయంలో చాలా అభినివేశాన్ని, గౌరవాన్ని కలిగిన విజయ రాఘవన్ స్వామివారు వేళుక్కుడి స్వామివారి, వారి ఆచార్యులైన శ్రీ కార్పంగాడు వేంకటాచార్య స్వామివారి శ్రీభాష్యోపన్యాసాల ఆధారంగా శ్రీభాష్య సారం అనబడే ఒక అద్భుతమైన గ్రంథాన్ని ప్రకాశింపజేశారు. దీని ఆంధ్రానువాదం ఇప్పుడు పెద్దల సన్నిధిలో సమర్పింపబడుతున్నది. అనువాదంలోని లోటుపాట్లను సహృదయపాఠకులు మన్నిస్తారని భావిస్తాను.

**దాసుడు**

**ఈ. ఏ. శింగరాచార్యులు**

## అవతారిక

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యులై, శమదమాదిగుణపూర్ణులై, జ్ఞాన భక్తి వైరాగ్యనిధియై, పరమశ్రీవైష్ణవ భాగవతోత్తములై, కీర్తిమూర్తులైన శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్యస్వామివారి శిష్యాగ్రేసరులై, వాగమృతవర్షి అనే సాటి లేని నిరూపకాన్ని కలవారై, సమీపకాలం వరకు మనతో కలిసి మెలసి వేంచేసి ఉండి మనలను ఉజ్జీవింపజేసినవారు– కీర్తిమూర్తి శ్రీవేళుక్కుడి వరదాచార్య స్వామి. వీరు తమ మేధావిలాసం, ఆత్మ గుణాలు, తిరుమేని సౌందర్యం, గంభీరమైన కంఠం, శ్రీరంగనాథుని విషయంలో ఉండే అభినివేశం మొదలైన వాటితో "పరమాచార్యులైన శ్రీ పరాశర భట్టర్ ఈ విధంగానే వేంచేసి ఉండేవారేమో! " అనిఅందరూ ఆశ్చర్యపడేటట్లుగా వేంచేసి ఉన్నారు, శ్రీభాష్యాది వేదాంత గ్రంథాలలో ఎంగళాళ్వాన్, నడాదూర్ అమ్మాళ్ వలె, భగవద్విషయ కాలక్షేపం అనుగ్రహించడంలో నంజీయర్, నంబిళ్ళైలవలె అనితర సామర్థ్యాన్ని కలవారై వెలిగారు, మన స్వామి అంటే అది అతిశయోక్తి కానేకాదు.

మన భాగ్యవశంచేత వీరు అనుగ్రహించిన పలు ఉపన్యాసాలు కేసెట్ల రూపంలో భద్రపరచబడ్డాయి. వీటి మూలంగా స్వామి ఉపన్యాసాల నుండి, వాటిలో వారు వివరించిన అనేక అర్థవిశేషాలను అన్నిటినీ వారి వాక్కులో గోచరించే రీతిలోనే గ్రంథస్థం చేసి, వాటిని అనేక శీర్షికలలో వరుసగా కూర్చి, పలు ఉపన్యాసాల రూపంగా ప్రకాశింపజేయాలి– అనే ఉద్దేశంతో కొంచెం కాలంగా నేను ప్రయత్నిస్తున్నాను.

ఈ ప్రయత్నం ఫలించి, వీరి అవతార శతాభిషేకమహోత్సవం నిర్వహింపబడే ఈ తరుణంలో సుధా రసమంజరీ–3 అనే శీర్షికతో స్వామి అనుగ్రహించిన శ్రీ భాష్య ఉపన్యాసాల మొదటి భాగం, భగవద్విషయరసాను భవం–1 అనే శీర్షికతో స్వామి అనుగ్రహించిన వ్యాసాల మొదటి భాగం ఇపుడు ప్రకాశింపజేయబడుతున్నాయి.

“తొండర్కు అముదన్న చ్చొల్ మాలైకళ్ శొన్నేన్”అని నమ్మాళ్వారులు తమ ప్రబంధం పాడిన ప్రయోజనం ఇది అని తెలియజేశారు. ఆ విధంగానే, శ్రీభాష్యంలో గురువందనంగా పలికిన రెండవ మంగళ శ్లోకంలో “ఉపనిషత్తులు అనే పాలకడలిని చిలికి, ఉద్ధరించిన వ్యాసుల సూక్తి అనే అమృతాన్ని అనుదినం అందరూ అనుభవించనీ” అని శ్రీరామానుజులు అనుగ్రహించారు. ఈ రెండిటిని చూచి గమనించి, శ్రీభాష్యవిషయంగా, భగవద్విషయవిషయంగా రెండు పుష్పాలకు సుధా రసమంజరి అనే పేరును శ్రీ వేళుక్కుడి స్వామివారు పెట్టి, ఇంతకుముందు ప్రకాశింప జేశారు. అదే రీతిలో ఇంకా కొన్ని వారి శ్రీభాష్యోపన్యాసాలనుకలిగిన ఈ గ్రంథానికి కూడా సుధారసమంజరి అనే పేరును పెట్టి చాలా ఆనందిస్తున్నాను. స్వామి అనుగ్రహించిన శ్రీభాష్యోపన్యాసాలను అన్నిటిని ఈ రీతిలోనే ఉపన్యాసాల రూపంగా గ్రంథస్తం చేసి, స్వామిస్మృతిగా ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క సంపుటంగా ప్రకాశింపచేస్తాను అనే విషయాన్ని చాలా ఆనందంతో తెలుపుకుంటున్నాను.

శ్రీ స్వామిదివ్యస్మృతిగా ప్రకాశింపజేసే ఈ సంపుటాన్ని ఆనందంతో స్వీకరించి, అంగీకరించి, పూర్వాచార్యుల గ్రంథాలతో పాటు, స్వామి యొక్క శ్రీ భాష్య భగవద్విషయ రహస్యత్రయ వివరణ శ్రీ రామాయణ తిరుప్పావైగీతోపన్యాస వ్యాసాల గ్రంథాలను కూడా ప్రకాశింపజేసేటట్లుగా దాసుని అనుగ్రహించాలి అని భక్తులను ప్రార్థిస్తున్నాను.

**దాసన్**

**ఎస్. విజయ రాఘవన్**

**18—1—2001**

# విషయసూచిక

# శ్రీభాష్యసారం

## 1) ప్రణవం –శ్రీ భాష్యం –శ్రీరంగ విమానం

సకల వేద సంగ్రహమై ప్రకాశిస్తున్నది, అష్టాక్షరి అనే తిరుమంత్రం. ఈ తిరుమంత్రానికి కూడా మూలమై వెలుగుతున్నది, ప్రపపద్యే ప్రణవాకారం భాష్యం రంగ మివాపరమ్, పరస్య బ్రహ్మణో యత్ర శేషిత్వం స్ఫుటమీక్ష్యతే" అని అనుగ్రహించారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. వేరొక రంగ విమానం వలె ప్రణవాకారంగా ప్రకాశించే శ్రీ భాష్యాన్ని శరణంగా వరిస్తున్నాను. ఇందులో పరబ్రహ్మ యొక్క శేషిత్వం అనేది స్పష్టంగా దర్శింపబడుతున్నది అని ఈ శ్లోకంలోని భావం. ప్రణవాన్ని చూసినా, భగవంతుని శేషిత్వం తెలుస్తున్నది, శ్రీభాష్యంలో కూడా భగవంతుని శేషిత్వం ప్రకాశిస్తున్నది, ప్రణవమై ఉంటే ఏమి, శ్రీ భాష్యమై ఉంటే ఏమి, శ్రీరంగ విమానమై ఉంటే ఏమి, ఎందులో అయినా ప్రకాశించేది భగవంతుని శేషిత్వమే అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు.

ఓమ్ అనబడే ప్రణవం లోని పరమార్థమేమి? అకారంచేత చెప్పబడే భగవంతునకు మకారంచేత చెప్పబడే జీవాత్మ అనన్యార్హశేషభూతుడు అనేది ప్రణవంలోని పరమార్థం. " అకారార్థో విష్ణుః జగదుదయ రక్షా ప్రళయకృత్, మకారార్థో జీవః తదుపకరణం వైష్ణవమిదమ్" అని అనుగ్రహించారు, పరమాచార్యులైన శ్రీ పరాశర భట్టర్ స్వామివారు. "అ" అనే అక్షరం చతుర్థీవిభక్తితో కూడి ఉన్నప్పుడు శేషి అయిన పరమాత్మను తెలుపుతుంది. "మ" అనే అక్షరం భగవంతునకు శేషభూతుడైన జీవాత్మను నిర్దేశిస్తున్నది. అందువల్ల జీవాత్మకు, పరమాత్మకు మధ్య ఉండే సంబంధం శేష శేషి భావం. ఈ అర్థాన్ని తెలియజేస్తున్నదై ఉండే ప్రణవంవలెనే ఈ భాష్యం కూడా అమరి ఉన్నది అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. ప్రణవంలో అకారం,

మకారం, ఉకారం— అనే మూడు అక్షరాలు ఉన్నాయి. శ్రీ భాష్యం కూడా "అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే" అని అకారంతో ఆరంభమై, " ఇతి సర్వం సమంజసమ్" అని మకారంతో పూర్తి అవుతున్నది. మధ్యలో "ఉక్తం చ" అని అనుగ్రహించారు భగవద్రామానుజ స్వామివారు.

శేషిత్వం అనేది రెండు విధాలు, అంటే, దీనిని రెండు విధాలుగా అనుభవంలో గ్రహించవచ్చు.

1) ప్రణవంలో, శ్రీభాష్యంలో ప్రకాశించే శేషిత్వాన్ని గమనించినప్పుడు, దానికి తెలియాలంటే శాస్త్రపరిచయం ఆవశ్యకం. అయితే, శాస్త్ర పరిచయం లేనివారికి కూడా తెలుస్తున్నది. శ్రీరంగ విమానంలో ప్రకాశించే భగవంతుని శేషిత్వం. అందులో వేంచేసి ఉండేవాడు— పరమశేషి అయిన, శేషశాయి అయిన, ఆదిశేషుని పర్యంకంగా కలిగినవాడై ఉండే శ్రీరంగనాథుడు. శాస్త్రాన్ని అధ్యయనం చేసినవారు కాని, అధ్యయనం చేయనివారు కానీ, అందరూ ఆ స్వామిని సేవించి, ఆ స్వామి అనుగ్రహంతో శేషత్వ స్వరూప సిద్ధిని పొంది తరించవచ్చు.

2) ప్రణవం అనబడే ఓంకారంలోను, శ్రీభాష్యంలోనూ ప్రకాశించే పరమాత్మ యొక్క శేషిత్వం— ఇతరులచే— మిగిలిన చేతనాచేతనాలు అందరిచే కలుగజేయ బడిన అతిశయాన్ని— గొప్పతనాన్ని —ధరించి ఉండడం. శ్రీరంగంలో ప్రకాశించే శేషిత్వం శేషశాయిత్వం అనే తారతమ్యాన్ని గమనించాలి.

శ్రీ వేదవ్యాసమహర్షి అనుగ్రహించిన బ్రహ్మసూత్రాలు అనే శారీరక మీమాంసా శాస్త్రానికి వ్యాఖ్యానాన్ని అస్మదాచార్య శేఖరులైన భగవద్రామానుజులవారు అనుగ్రహించారు. ఇపుడు శ్రీ భాష్యాది గ్రంథాలలో ప్రకాశించే సారార్థాలను సంగ్రహంగా ఇక్కడ మనం అనుభవిద్దాం.

మునుముందు, బ్రహ్మ సూత్ర తాత్పర్యార్థాలను గూర్చి సూత్రకారుల అభిప్రాయాన్ని వివరించి, వేద వేదాంతాలను అనుసరించినవారైన వేదవ్యాసుల సిద్ధాంతం ఇదే– అని కరబదరికా న్యాయంగా శ్రీభాష్యాది గ్రంథాలలో శ్రీ రామానుజులవారు నిరూపించే ఆ విశేషాలను కొన్నిటిని అనేక శీర్షికలద్వారా అనుభవంలో గ్రహిద్దాం. దీనితో పాటు, అధ్యాయ పాద అధికరణ సూత్ర క్రమంలో శ్రీ భాష్య సారార్థాలను అనుభవంలో గ్రహిద్దాం. మధ్యలో అక్కడక్కడ శీభాష్య సారార్థాలను వివరిస్తూ ఉభయ వేదాంత విద్వాంసులు పలువురు అనుగ్రహించిన సూక్తులను అనుభవంలో గ్రహిద్దాం.

## 2) వేదవ్యాసావతార రహస్యం– స్కాంద పురాణ నిర్ణయం

వేదం మొదలైన శాస్త్రాలను చక్కగా విచారించి చూస్తే – 1)శ్రీమన్నారాయణడే పరతత్త్వం అని, 2) అతని కృపయే పరమహితం అని, 3) పరమపదం అనే దేశవిశేషంలో భగవంతుని సమీపించి, దర్శించి ఆనందించి, ఆ అనుభవంచేత కలిగిన ప్రీతితో ఈ జీవుడు చేసే పరార్థకైంకర్యమే పరమ పురుషార్థం అని ప్రకాశిస్తుంది.

తత్త్వ హిత పురుషార్థాలను ఈ విధంగా యథాతథంగా గ్రహించి, ఆ జ్ఞానానికి తగినట్లు అనుష్ఠానం కలిగిన వానికే మోక్షం సిద్ధిస్తుంది– అని అంటారు, వైదికులు. పురుషార్థాలలో మోక్షం (భగవంతుని కైంకర్యం) గొప్ప ఫలం. ఆ విధంగానే, సాధనాలలో జ్ఞానం గొప్ప సాధనం. ఈ జ్ఞానమార్గ స్థాపనం కోసమే భగవంతుడు ఒక్కొక్క కాల విశేషంలో ఒక్కొక్క విధమైన అవతారాన్ని ఎత్తాడు అని అంటారు, పెద్దలు. ఇదే ధర్మ సంస్థాపం. ఈ క్రమంలో శ్రీమన్నారాయణుడు జ్ఞానమార్గ ప్రవర్తనం చేసి, ధర్మాన్ని స్థాపించాడు అని పురాణాలలో చెప్పబడింది.

భగవంతుని అవతారాలు రెండు విధాలుగా ఉంటాయి. ఒకటి ముఖ్యావతారం, ఇంకొకటి గౌణావతారం. ముఖ్యావతారంలో భగవంతుడు తనకే అసాధారణమైన అప్రాకృత దివ్య మంగళ విగ్రహంతో అవతరిస్తాడు. గౌణావతారంలో ప్రాకృత శరీరంతో కూడిన జీవుని ఒక్కొక్క కార్య విశేషాన్ని నిర్వహించడం కోసం ఆవేశించి, ఆ జీవునిలో విశేషమైన సాన్నిధ్యాన్ని కలిగి ఉండి, ఆయా కార్యాలను నిర్వహిస్తాడు. అది ఆవేశావతారం అని, అంశావతారం అని చెప్పబడతుంది.

ముఖ్యావతారానికి పూర్ణావతారం అని ఇంకొక పేరు కూడా ఉన్నది. భగవంతుడు జ్ఞానం మొదలైన ఆరు గుణాలతో పరిపూర్ణుడై, తనకే ఆసాధారణమైన విగ్రహంతో అవతరించినందున దీనికి పూర్ణావతారం అనే పేరు ఏర్పడింది. ఈ క్రమంలో రామకృష్ణాది అవతారాలు పూర్ణావతారాలుగా చెప్పబడుతున్నాయి. రామకృష్ణాది అవతారాలలో భగవంతుడు తన అనుష్ఠానం ద్వారా, ఉపదేశాల ద్వారా చేసిన జ్ఞానమార్గ ప్రతిష్టాపనం చరిత్ర ప్రసిద్ధం అయినా, ఈ వేదవ్యాసావతారంలోని ఈ జ్ఞాన మార్గ ప్రతిష్ఠాపనం అనేది చాలా విశేషంగా ప్రకాశింపజేయబడింది.

శ్రీ వేదవ్యాసుల అవతారాన్ని గూర్చి ఈ విధంగా చెప్పబడుతున్నది. నారాయణునివల్ల కలిగిన జ్ఞానం కృతయుగంలో స్థిరంగా నిలచి ఉన్నది. త్రేతాయుగంలో కొంచెం మార్పు పొందింది. ద్వాపరయుగంలో చెదరిపోయింది. గౌతముని శాపంచేత జ్ఞాన మనేది అజ్ఞాన భావాన్ని పొందగా, తత్వనిశ్చయం చేయలేనందువల్ల సంకీర్ణమైన బుద్ధిని కలవారైన బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలు రక్షణలో సమర్థుడు, దోషం లేనివాడు అయిన నారాయణుని శరణంగా ఆశ్రయించారు. అప్పుడు ఆరు గుణాలను కలవాడు, మహాయోగి అయిన పురుషోత్తముడు శ్రీ పరాశరమహర్షి వల్ల సత్యవతి గర్భంలో అవతరించాడు. భగవంతుడు స్వయంగా వ్యాసరూపిగా అవతరించి, చెదరి పోయిన వేదాలను ఉద్ధరించాడు. వాటిని నాలుగుగా విభాగించాడు.

వాటి అర్థాలను నిశ్చయించడం కోసం బ్రహ్మ సూత్రాలను రచించాడు"– అని స్కాంద పురాణంలో చెప్పబడింది. దీనిని కొంచెం వివరిస్తాను.

సృష్టి ఆరంభంలో భగవానుడు జీవులకు కరణ కళేబరాలను అనుగ్రహించి, ప్రవృత్తి నివృత్తి శక్తులను ఇచ్చి, ప్రదీపం అనదగిన శాస్త్రాలను ఇచ్చి, జ్ఞానమార్గాన్ని ప్రవర్తింపచేశాడు. జ్ఞానమార్గం కృతయుగంలో నశించకుండా ఉన్నది. త్రేతాయుగంలో కొంచెం మార్పు పొందింది. ద్వాపర యుగంలో నశించడం ప్రారంభించింది. అప్పుడు బ్రహ్మాది దేవతలు భగవంతుని ప్రార్థించగా, అతడు అంగీకరించి, సత్యవతికి, పరాశరమహర్షికి కుమారుడై అవతరించాడు. ఇతడే వేదవ్యాస మహర్షి. శ్రీ వేదవ్యాసమహర్షి వేదాన్ని ఋగ్వేదం మొదలైన నాలుగు విభాగాలుగా చేసి, బ్రహ్మ భాగంలోని (వేదాంతంలోని) అర్థాలను న్యాయ మార్గాల ద్వారా వివరించి, నిర్ణయించి, బ్రహ్మ సూత్రాలతో వ్యక్తం చేశాడు.

**3)వ్యాసావతార రహస్యం– మహాచార్యుల సూక్తి**

చోళసింహపురం దొడ్డయాచార్య స్వామి అనే మహా చార్యులు బ్రహ్మసూత్ర వ్యాఖ్యాన పరంగా పారాశర్య విజయం అనే అత్యద్భుతమైన ఒక గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథం ఆరంభంలోనే వారు ఒక శ్లోకంలో ఒక వర్ణనను చేశారు. ఆ శ్లోకం ఈ విధంగా ఉన్నది.

"వేదాపహారిణం దైత్యం మగరూపీ నిరాకరోత్,

తదర్థాపహారిణః సర్వాన్ వ్యాసరూపీ మహేశ్వరః"

అనేది ఈ శ్లోకం. ఈ శ్లోకంలోని అర్థం ఏమంటే –భగవంతుడు మత్స్యావతారాన్ని ఎత్తాడు. అదే భగవంతుడు వ్యాసావతారాన్ని కూడా ఎత్తాడు. భగవంతుని ఒక అవతారం మత్స్యావతారం. ఆ భగవంతుని వేరొక అవతారం వ్యాసావతారం.

సోముకుడు అనే అసురుడు వేదాలను అపహరించాడు. అతనిని నశింపజేసి, పరమ ప్రమాణమైన వేదాన్ని తిరిగి ఉద్ధరించడం కోసం ఏర్పడినదే మత్స్యావతారం. వేదార్థాలను మార్చి విపరీతంగా పలికేవారు వేద బాహ్యులు, కుదృష్టులు. వారి మతాలను చక్కగా పూర్తిగా ఖండించి, "వేదాంతార్థం ఇదే, వైదికమైన మతం ఇదే, సద్వాదం ఇదే " అని వాస్తవమైన వేదాంతార్థాలను సిద్ధాంతీకరణం చేయడం కోసం భగవంతుడు పరిగ్రహించినదే వ్యాసావతారం.

ఈ వాస్తవాన్ని, అంటే, భగవంతుని అవతారమే వ్యాసావతారం అనే విషయాన్ని, వారి తండ్రి అయిన శ్రీ పరాశర మహర్షి "మహాభారతాన్ని అనుగ్రహించారు, శారీరక శాస్త్రమైన బ్రహ్మమీమాంసా శాస్త్రాన్ని అనుగ్రహించారు, వారు శ్రీమన్నారాయణుని అంశావతారంగా లేకపోతే ఈ కార్యాలను చేయడం సాధ్యమేనా? " అని శ్రీ వేదవ్యాసుల తండ్రి అయిన పరాశరమ మహర్షియే పలకడం మనం గమనిస్తున్నాము. కో హ్యన్యో భువి మైత్రేయ! మహాభారత కృత్ భవేత్? " అనే శ్లోకాన్ని గమనించవచ్చు.

## 4) వేద వ్యాసులు అనుగ్రహించిన మహోపకారాలు

శారీరక శాస్త్రం అనే అమృతాన్ని అనుగ్రహించడానికి ముందు వేద వ్యాసమహర్షి పలుకార్యాలను మన కోసం చేశారు. అవి ఏమిటి? అంటే, మొదట సంకీర్ణంగా ఉండే వేదాన్ని విభాగం చేశారు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అని ఈ విధంగా వేదాన్ని విభాగించి వర్గీకరించినందు వల్లనే వారికి వేదవ్యాసులు అనే తిరునామం కలిగింది. "వేదాన్ని వర్గీకరించి, అనుగ్రహించిన వేదవ్యాసులు" అని ఈ నామానికి భావం.

ఇంత మాత్రమే కాకుండా, తాము వర్గీకరించి అనుగ్రహించిన వేదాలకు శాఖా విభాగాన్ని కూడా చేశారు. 24 శాఖలుగాను, 101 శాఖలుగా యజుర్వేదం, వేయి

శాఖలుగా సామవేదం, 12 శాఖలుగా అధర్వణ వేదం –అని ఈ విధంగా శాఖావిభాగాన్ని వేదవ్యాసమహర్షి చేశారు. వేదం లో ఒక భాగాన్ని అధ్యయనం చేసిన అధికారికి బ్రహ్మ సూత్రాలలో అర్థ నిర్ణయం ఏర్పడినా, అధ్యయనం చేయని వేద భాగాలలో ఉండే అర్థాలతో అధీత వేద భాగాలలోని అర్థాలను సమన్వయం చేసికోవలసిన ఆవశ్యకత ఉన్నందున, " అనంతా వై దాః" అనే విధంగా సకల వేదాలను ఈ చేతనుడు పూర్తిగా అధికరించడం సాధ్యం కానందున, సకల వేదాలను, వాటి అర్థాలను సాక్షాత్కరించుకున్న శ్రీ వేదవ్యాసులు, అందరూ సకలార్థాలను సులభంగా తెలుసుకొనేవిధంగా ఐదవ వేదం అని కీర్తింపబడే మహాభారతాన్ని కూడా అనుగ్రహించారు. ఇవి వ్యాసమహర్షి మనకు చేసిన మహాోపకారాలు.

## 5)వ్యాస సిద్ధాంత మార్తాండం

వేదాంతలలో జగత్కారణ వస్తువే ధ్యానించదగినది, శరణు పొందదగినది అనే నియమం తెలుపబడింది. భక్తి కానీ, ప్రపత్తి కానీ, అవి జగత్కారణం విషయంలోనే అనుష్ఠింపబడాలి అనేది వేదాంత సిద్ధాంతం. బ్రహ్మకార్యమైన జీవాత్మ తనతో సమానమైన ఇంకొక సంసారి జీవుని శరణంగా ఆశ్రయించడం అనేదిఎటువంటిది? అంటే, చిల్లుబడిన ఓడతో మునిగిన ఓడ చేరడం వంటిది, అంతే. "తాపత్రయాతురైః అమృతత్వాయ స ఏవ జిజ్ఞాస్యః" (మూడు విధాలయిన తాపాలతో బాధపడేవార మోక్షాన్ని పొందడానికి కోసం ఆ జగత్కారణాన్నే తెలుసుకోవాలి) అనే శ్రీ భాష్య శ్రీ సూక్తి ప్రకారం కారణ బ్రహ్మమే ఆధ్యాత్మిక– ఆధిభౌతిక –ఆధిదైవికాలనే మూడు విధాలైన తాపాలచే బాధపడుతున్న సంసారులకు జిజ్ఞాస్యం, ఉపాస్యం, శరణ్యం –అనేది సిద్ధాంతం. "కారణం తు ధ్యేయః" (జగత్ కారణ వస్తువే ధ్యానించదగినది), " యో బ్రహ్మాణం విదధాతి పూర్వం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" (బ్రహ్మను సృష్టించిన

కారణవస్తువును మోక్షాన్ని పొందగోరిన నేను శరణు పొందుతున్నాను) అని వేదాంతాలు ఘోషిస్తున్నాయి.

ఇక ఈ సిద్ధాంతాన్ని బ్రహ్మమీమాంసా శాస్త్రం ద్వారా శ్రీ వేదవ్యాసులు తెలియజేసిన రీతిని ప్రస్తావిస్తాను.

1) శారీరకంలో శ్రీ వేదవ్యాసమహర్షి చతుఃసూత్రి అనే ఉపోద్ఘాతానికి తరువాత, ఈక్షత్యధికరణమనే శాస్త్రారంభంలో పరమాత్మ జగత్కారణభూతుడు, అచిద్విలక్షణుడు అని నిశ్చయించారు. ఆ అధికరణంలో "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ " –అతడే ఉపాయభూతుడు– అని నిశ్చయించి పలికారు. జగత్ కారణాన్ని కదా మోక్షోపాయంగా వేదాంతం నిశ్చయించి పలికింది. తరువాత కల ఆనందమయాధికరణంలో అతడేపరమ ప్రాప్యభూతుడు అనే విషయాన్ని, అతడు సంసారి జీవుని కంటే విలక్షణుడు అనే విషయాన్ని, ముక్త విలక్షణుడు అనే విషయాన్ని "ఆనందమయః అభ్యాసాత్", "కామాచ్చనానుమానాపేక్షా", " నేతరోఽనుపపత్తేః " అనే సూత్రాల ద్వారా నిశ్చయించారు. వీటి వివరణమే తరువాత ఉండే 149 అధికరణాలు. అందుచేత భగవంతుడు జగత్కారణభూతుడు, ఉపాయ ఉపేయభూతుడు, ప్రకృతి పురుష విలక్షణుడు, దివ్య మంగళ విగ్రహ విశిష్టుడు –వ్యాస సిద్ధాంతం అనే విషయం స్పష్టపడుతున్నది.

2. సకల వేద సంగ్రహమైన తిరుమంత్రంలో ఉండే మూడు పదాల ద్వారా జీవాత్మల అనన్యార్హశేషత్వ అనన్య శరణత్వఅనన్య భోగ్యత్వరూప ఆకారత్రయం శాబ్దంగా ప్రతిపాదింపబడింది. పరమాత్మకు కల శేషత్వ, శరణ్యత్వ, ప్రాప్యత్వాలు అనే ఆకార త్రయం ఆర్థంగా గోచరిస్తుంది. నాలుగు అధ్యాయాల రూపంలోని శారీరక మీమాంసా శాస్త్రంలోని మొదట రెండు అధ్యాయాలలో పరబ్రహ్మ జగదేక కారణంగానూ, చేతన

చేతన విలక్షణం గాను సర్వశేషి గానూ నిరూపించారు. ఇదే ప్రణవార్ధ నిరూపణం. మూడవ అధ్యాయంలో అటువంటి బ్రహ్మమే ఉపాస్యం అని నిశ్చయించారు. ఇదే నమః శబ్దార్ధ నిరూపణం. నాలుగవ అధ్యాయంలో బ్రహ్మం ప్రాప్యం అని నిశ్చయించారు. ఇదే తృతీయ పదార్ధ నిరూపణం. కారణత్వం అబాధ్యత్వ ఉపాయత్వ ఉపేయత్వాలు అనే నాలుగే కదా శారీరక మీమాంసలోని నాలుగు అధ్యాయాలలోని అర్థాలు.

3) శ్రీ వేదవ్యాసులు శారీరకమీమాంసా శాస్త్రంలో విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని తమ సిద్ధాంతంగా నిశ్చయించి పలికారు— అనే విషయం ఇక నిరూపింపబడుతున్నది. సూక్ష్మ చేతనా చేతన విశిష్టమైన బ్రహ్మమే కారణమై, స్థూల చేతనా చేతన విశిష్టమైన బ్రహ్మమే కార్యమై, ఆరాధన కార్యాలైన విశిష్ట బ్రహ్మకు ఐక్యం చెప్పడం విశిష్ట ద్వైత సిద్ధాంతం అనబడుతుంది. కారణకార్యాలకు మధ్య నామ భేదం, ఆకార భేదం, వ్యాపార భేదం ఉన్నప్పటికీ, వస్తు భేదం లేదు. కార్య కారణాలకు అనన్యత్వమే— అని సత్కార్యవాదాన్ని స్థాపించి, సత్కార్యవాదమైన వైశేషిక మతాన్ని ఖండించారు, "తదనన్యత్వమ్" అని ఆరంభణాధికరణంలో వేద వ్యాసులు. పర మహాత్మా నిర్వికారుడై తన శరీర భూతమైన చేతనా చేతన మాత్రంలో సంకోచ వికాసాలనే వికారాలను కలుగజేస్తున్నాడు –అనేదానికి ఉపనిషత్తు"యథోర్ణనాభిః సృజతే గృహ్ణాతే చ" అని సాలెపురుగును దృష్టాంతంగా పలికింది.

తత్వత్రయ గ్రంథంలో శ్రీ పెళ్లై లోకాచార్యులవారు కూడా "ఇవన్ తానే జగత్తాయ్ పరిణమిక్కైయాలే ఉపాదానమాయిరుక్కుమ్. అనాల్ నిర్వికారన్ ఎన్నుంబడి ఎన్? ఎన్నిల్, స్వరూపత్తుక్కు వికారమ్ ఇల్లామైయాలే. అనాల్, పరిణామమ్ ఉండాకుంబడిఎన్? ఎన్నిల్, విశిష్ట విశేషణ సద్వారకమాక. ఒరు శిలందిక్కుండాన స్వభావమ్ సర్వశక్తిక్కు క్కూడా దొ(ఘ)యాదితే" (భగవంతుడే జగత్తుగా పరిణమిస్తున్నందున అతడే ఉపాదానం కారణమై ఉన్నాడు. అయితే, భగవంతుడు

నిర్వికారుడు ఏ విధంగా అవుతున్నాడు? అని అంటే, భగవంతుని స్వరూపంలో వికారం ఏమి కలుగడం లేదు కనుక. మరి, భగవంతునిలో పరిణామం ఏ విధంగా కలుగుతుంది? అంటే, చేతనా చేతన విశిష్టుడైన భగవంతునిలో విశేషణంగా ఉండే ఆ చేతనాచేతనాలకే పరిణామం కలుగుతున్నది కనుక. ఒక సాలె పురుగుకు ఉండే స్వభావం సర్వశక్తి అయిన భగవంతునకు లేకుండా పోదు కదా! ) అని అన్నారు తిరుమழிశై ఆళ్వారులు కూడా "కడల్ తన్నుళే తిరైత్తెழுన్దు ఆడంగుకిన్ఱ"(10) (సముద్రం తన లోపల పుట్టి పైకి లేచే కెరటాలను కలిగినది అయినా, మళ్ళీ తిరిగి తనలోనే ఆ కెరటాలు అణగిపోయేటట్లు)అని సముద్రాన్ని దృష్టాంతంగా పలికారు. శ్రీ పరాశర భట్టర్ "అనుశిఖిని శిఖీవ" అని అంటూ మగ నెమలిని దృష్టాంతంగా చెప్పారు. మొదటి అధ్యాయంలో ప్రకృత్యధికరణంలో శ్రీవేదవ్యాసులు బ్రహ్మం యొక్క అభిన్న నిమిత్తోపాదనత్వాన్ని సిద్ధాంతీకరించారు కదా. ఇంతేకాక, జీవవాచి శబ్దానికి పరమాత్మ పరత్వాన్ని నిరూపించే చోట ఆశ్మరథ్యమతాన్ని, ఔడులోమి మతాన్ని పూర్వపక్షంగా చేసి, కాశకృత్స్న మతాన్ని వాక్యాన్వయాధికరణంలో శ్రీవేదవ్యాసులు తమ సిద్ధాంతంగా చూపించారు కదా.

కాశ కృత్స్న మతాన్ని ఆశ్మరథ్య ఔడులోమి మతాలకు ముందుగానే చెప్పనందువల్ల, కాశకృత్స్నమతానికి మించిన ఇంకొక మతాన్ని దేనిని చెప్పనందువల్ల, కాశకృత్స్న మతమే శ్రీ వేదవ్యాసుల సమ్మతం అవుతున్నది అనికదా శ్రీ భాష్యంలోను, శ్రుత ప్రకాశికలోను చెప్పబడింది. శరీరాత్మ భావం వల్ల జీవవాచి శబ్దం పరమాత్మపరం అని కదా కాశకృత్స్న మతం. ఇదే కదా విశిష్టాద్వైత మతం. ఇదే కదా శ్రీ వ్యాససమ్మతమైనది అవుతున్నది. మిగిలినవారి మతాలకంటే తమ మతం విలక్షణమై ఉన్నట్లయితే, శ్రీ వేదవ్యాసులు అక్కడనే "బాదరాయణః" అని తమ నామాన్ని నియతంగా నిర్దేశించి ఉంటారు. వేరొక ఋషి మతం సమ్మతం అయితే, అక్కడ తమ

నామాన్ని వేదవ్యాసులు నిర్దేశించరుకదా. ఇంకే కాక, ఏది సిద్ధాంతమో, దానినే చివరిగా చూపుతారు అనేది కూడా శారీరక మీమాంసా శాస్త్రంలో ప్రసిద్ధమైన విషయం. అందుచేత, కాశ కృత్స్న మతమే వ్యాససమ్మతం అని స్పష్టమవుతున్నది.

ఇంతే కాక, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రధాన ప్రమేయం అయిన బ్రహ్మసగుణత్వాన్ని, జీవపర పారమార్థికభేదాన్ని, ధర్మ ధర్మి భేదాన్ని, జీవాత్మకే అజ్ఞాన సంబంధం ఉన్నది అనే విషయాన్ని, జీవాత్మ జ్ఞానసంకోచవికాసాలే సంసార మోక్షాలు అనే విషయాన్ని, జీవ కర్తృక పరమాత్మోపాసనమే మోక్ష సాధనం అనే విషయాన్ని, పరమాత్మ అనుగ్రహం చేత జీవునకు మోక్షం కలుగుతుంది అనే విషయాన్ని, అది కూడా అర్చిరాది మార్గం ద్వారా దేశ విలక్షణ ప్రాప్తి పూర్వక స్వస్వరూపావిర్భావ పూర్వక పరిపూర్ణ బ్రహ్మానుభవం అనే విషయాన్ని, అక్కడనుండి పునరావృత్తి లేదు అనే విషయాన్ని శ్రీవేదవ్యాసులు శారీరక మీమాంసా శాస్త్రంలో పలుచోట్ల నిరూపించినందున, శ్రీ వేద వ్యాస సమ్మతం విశిష్టాద్వైతమే అని స్పష్టమవుతున్నది.

బ్రహ్మం నిర్గుణం, అజ్ఞానం బ్రహ్మనిష్ఠం, సంసార మోక్షాలు బ్రహ్మకే, ఐక్యజ్ఞానమేమోక్షహేతువు, ఇక్కడనే ముక్తి కలుగుతుంది, ఐక్యాపత్తి మోక్షం– అని కదా శాంకరవాది మతం. ఇది వేదవ్యాస సమ్మతం కాదు. అందుచేత, ఇది శారీరక మీమాంసా శాస్త్రమైన బ్రహ్మసూత్ర– అధ్యాయ చతుష్టయంలో అంతర్గతం కాదు. ఉత్సూత్రం అని తేలుతున్నది.

జగత్కారణమైన పరబ్రహ్మను ఉపాసించేవాడు భగవదనుభవంచేత అపునరావృత్తి లక్షణమైన మోక్షాన్ని పొంది, పరిపూర్ణ బ్రహ్మానుభవాన్ని పొంది, ఆనంద మయునితో భోగమాత్రంలో పరమసామ్యాన్ని పొందుతున్నాడు –అని శ్రీ వేదవ్యాసులు 4 అధ్యాయాలను కల శారీరక మీమాంశసాశాస్త్రంలో నిశ్చయించినందున,

భగవంతునితో జీవునకు స్వరూపైక్యాపత్తియే మోక్షం అనేవారి వాదం బ్రహ్మసూత్రాలకు భాహ్యం అని స్పష్టమవుతున్నది.

ఈ వేదాంత సిద్ధాంతాన్ని లోకంలో స్థాపించడంకోసమే కదా శ్రీవేదవ్యాసుల అవతారం సంభవించింది. శ్రీ వేదవ్యాసుల మనసులోని ఈ అభిప్రాయాన్ని అనుసరించి ఈ సిద్ధాంతాన్ని మన భగవద్రామానులు తమ శీభాష్యాది గ్రంథాలలో స్పష్టంగా తెలియజేశారు. ఇక్కడ సంగ్రహంగా నిరూపింపబడిన విషయాలనే పైన పలు శీర్షికలలో విస్తృతంగా అనుభవంలోకి తెచ్చుకుందాం.

## 6) శారీరక శాస్త్రం అంటే ఏమి? దాని గొప్పతనం ఏమి?

బ్రహ్మానందమయమైన ఉజ్జీవనాన్ని పొందడం కోసం ఆవశ్యకమైనది యథార్థజ్ఞానం, అంటే, తత్త్వజ్ఞానం. దీనిని పొందడం కోసం మనకు కారుణికుడైన సర్వేశ్వరుడు ఎన్నో శాస్త్రాలను అనుగ్రహించాడు. ఇతడు ఈ విధంగా ఇతడు పలు శాస్త్రాలను అనుగ్రహించి మహోపకారంచేసినందున ఆళ్వారులు, మన పూర్వాచార్యులు “పిరాన్” (మహోపకారకుడు) అనే పదంతో భగవంతుని కృతజ్ఞతా పూర్వకంగా కీర్తిస్తారు. భగవంతుడు అనుగ్రహించిన శాస్త్రాలలో శీర్షాయమానమైనది శారీరకం. శ్రీమన్నారాయణుడే వేదవ్యాసుల రూపంలో అవతరించి, బ్రహ్మసూత్ర ప్రబంధాన్ని అనుగ్రహించాడు అని పురాణం పలుకుతున్నది. ఇదే శారీరకం అని, బ్రహ్మ మీమాంస, అని ఉత్తర మీమాంస అని గొప్పగా చెప్పబడుతున్నది. అఖిల జగత్తును తనకు శరీరంగా కలిగినవాడు భగవంతుడు. అందుచేత అతడు శారీరుడు అనబడుతున్నాడు. శారీరుని గూర్చి పలికే శాస్త్రం శారీరకం అనబడుతున్నది. “ తస్యైష ఏవ శారీర ఆత్మా” అని, “ యస్యాత్మా శరీరం, యస్య పృథివీ శరీరం——— ఏష సర్వభూతాంతరాత్మా నారాయణః” అని వేదాంతాలలో పరమాత్మ శారీరుడు అని చెప్పబడుతున్నాడు. “ జగత్ సర్వం శరీరం తే” అని శ్రీరామాయణ వచనం. “ స ఈశ్వరః వ్యష్టి సమష్టి రూపః”

అని శ్రీపరాశరమహర్షి వచనం. "అవస్థితేరితి కాశకృత్స్నః" అని వేదవ్యాసులు కూడా పలికారు. " ఉడన్ మిశై ఉయిరెన కరందు ఎంగుమ్ పరందుళన్" అని నమ్మాళ్వార్ల వచనం. " యదండం ———పరాత్పరం బ్రహ్మ చ తే విభూతయః" అని ఆ శ్రీయామునులు పలికారు. పరమాత్మకు చేతనా చేతనాత్మకమైన జగత్తు శరీరం కనుక శారీర ప్రతి సంబంధి– ఆత్మ– అయిన పరమాత్మ శారీరుడు అనబడుతున్నాడు. అతనిని తెలియజేసే శాస్త్రం కనుక, బ్రహ్మ మీమాంసాశాస్త్రం శారీరం అని చెప్పబడుతున్నది. శ్రీ బోధాయనమహర్షి కూడా "సంహితం ఏతత్ శారీరమ్" అని అనుగ్రహించారు.

శ్రీ వేదవ్యాసులు ఉపనిషత్తులు అనే పాల సముద్రాన్ని చిలికి, శారీరకం అనే అమృతాన్ని ఉద్ధరించి, భక్తులకు ఇచ్చారు. ఇది ఆత్మక్షేమంకరమైన అమృతం. ఇదే దీనికి కల అతిశయం. మన భగవద్రామానుజులవారు "పారాశర్య వచఃసుధామ్ ఉపనిషత్ దుగ్ధాబ్ధ మధ్యోద్ధృతామ్"అని దీనిని స్పష్టంగా అనుగ్రహించారు. దీనిని గూర్చి కొంచెం వివరిస్తాను.

భగవద్రామానుజులు శ్రీభాష్యం ఆరంభంలో "అఖిల భువన జన్మస్థేమ" అని ఆరంభమయ్యే మంగళ శ్లోకాన్ని శ్రీ వేంకటేశ్వరుని విషయంగా అనుగ్రహించారు. తరువాత గురువందన రూపంగా ఆచార్యులైన శ్రీవేదవ్యాసులను గూర్చి ఈ క్రింది శ్లోకాన్ని అనుగ్రహించారు.

పారాశర్య వచఃసుధా ముపనిషద్దుగ్ధాబ్ధి మద్ధ్యోద్ధృతాం
సంసారాగ్ని విదీపన వ్యపగత ప్రాణాత్మ సంజీవనీమ్,
పూర్వాచార్య సురక్షితాం బహుమతి వ్యాఘాత దూరస్థితామ్
అనీతాం తు నిజాక్షరైః సుమనసో భౌమాః పిబంత్వన్వహమ్.

పారాశర్యవచః సుధామ్— శ్రీ వేద వ్యాసమహర్షి పరాశరులకు, సత్యవతికి కుమారుడుగా అవతరించినవారు కనుక పారాశర్యులు అని అనబడుతున్నారు. వారు అనుగ్రహించిన ఈ బ్రహ్మ మీమాంసాశాస్త్రాన్ని వర్ణించే కాలంలో భగవద్రామానుజులు పారాశర్య వచఃసుధామ్" అని పారాశర్యులు అనే తిరునామాన్ని ప్రయోగించే వర్ణిస్తున్నారు. ఈ సందర్భంగా పరాశరులకు కుమారుడై పుట్టినందున కలిగిన అతిశయాన్ని మనస్సులో పెట్టుకొని "సహోవాచ వ్యాసః పారాశర్యః" (రాసర మహా ఋషి పుత్రులైన ఆ వ్యాసులు చెప్పారు) అని వేదంలోనే శ్రీ వేదవ్యాసుల గొప్పతనం చెప్పబడి ఉండడాన్ని మనసులో పెట్టుకొని భగవద్రామానుజులు ఈ విధంగా అనుగ్రహించారు అని పెద్దల వ్యాఖ్యానం. పరాశరులను ఋషి అని పలికితే, వారి కుమారులైన వీరిని పరమర్షి అని కీర్తించాలి. అటువంటి గొప్పతనం కలిగినవారు శ్రీ వేద వ్యాసభగవానులు. ఒక చిన్న దీపంలో వెలిగింపబడిన దివిటి పెద్దగా ప్రకాశించి వెలగడం చూస్తున్నాము దీపక్ ఉత్పన్న ప్రదీప్ పోలే అని అంటారు మన పూర్వాచార్యులు ఇటువంటి తండ్రి తిరునామం ద్వారానే శ్రీ వేదవ్యాసులను నిర్దేశించి పలకడానికి వేరు రీతిలో కూడా ఒక అభిప్రాయాన్ని మన పెద్దలు అనుగ్రహించారు. అది ఏమంటే— పరాశరుల గొప్పతనాన్ని ధ్వనించినా, వారి కంటే మించిన అతిశయాన్ని పొందినవారు వేదవ్యాసులు అనే అర్థం ధ్వనించే విధంగా రామానుజులు ఈ విధంగా పలికారు— అని పెద్దల వ్యాఖ్యానం. ఇక్కడ పరాశరుల గొప్పతనం ఏది అని గమనించాలి. దీనిని కూడా మన పెద్దలు అత్యద్భుతంగా వివరించారు. పరాశరమహర్షి పరాశరులు అని పిలువబడడానికి, నమ్మాళ్వారులు పరాంకుశులు అని పిలువబడడానికి కారణం ఒకటే అని చెబుతారు. అది ఏమంటే, పరులను, అంటే, ఇతరులను హింసించేవారు —శ్రీ విష్ణు పురాణాన్ని అనుగ్రహించిన శ్రీపరాశరులు, తిరువాయ్ మొ*ళి*ప్రబంధాన్ని అనుగ్రహించిన పరాంకుశులు— అని అర్థం. వేద బాహ్యులకు కానీ, వేదకుదృష్టులకు

కానీ, ఇటువంటి పరులకు (మతాంతరస్థులకు)అంకుశంవలె బాధించేవారు. వీరిద్దరూ పరమ వైదికులు అయినందున, వేదానికి విరుద్ధంగా ఎవరైనా, ఏ అర్థాన్ని అయినా చెప్పేవారైతే పలికితే, అది వీరికి సహించడం సాధ్యం కాదు. ఇదే వీరి గొప్పతనం. అందుచేత పరులను హింసించడాన్ని సహజస్వభావంగా కలిగినవారై, వేదాన్ని, వైదిక సిద్ధాంతాలను రక్షించేవారై వీరు ఉన్నందున వీరికి ఈ పేర్లు నిరూపకాలుగా ఏర్పడ్డాయి. ఈ విధంగా ఇటువంటి గొప్పతనం కలిగిన పరాశరుల కుమారులు అనే భావం స్తుతించేటట్లు శ్రీ రామానుజులు పారాశర్యులు అని పలికారు– అని ఒక వ్యాఖ్యానం. పరాశరులకు కుమారుడై అవతరించినందున, వారి వలె వీరు కూడా తమ తండ్రిగారి మార్గాన్ని అనుసరించి, వేదవేదాంత విచారణలో ప్రవేశించి, పలు పలు వేదబాహ్య వేదకుదృష్టి మతాలను తన సూత్రప్రబంధంతో హింసించి, నశింపజేశారు– అనే గొప్పతనం కూడా పొందినవారు, శ్రీవేదవ్యాసులు.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన వీరు అనుగ్రహించిన బ్రహ్మ సూత్రగ్రంథాన్ని "పారాశర్యవచః సుధామ్" అని ఆరంభించే సూక్తితో "అమృతమ్" అని మన భగవద్రామానులు కీర్తిస్తున్నారు. ఈ అమృతానికి గొప్పతనం ఏమంటే– సంసార నివర్తకమై ఉంటుంది– అని శ్రీరామానుజుల మనసులోని అభిప్రాయాన్ని మన పెద్దలు వివరిస్తున్నారు. "వంగక్కడల్ కడైందవన్" (ఓడలతో నిండిన సముద్రాన్ని చిలికినవాడు) భగవంతుడు. అతడు సముద్రాన్ని చిలికి పరమశివునకు విషాన్ని ఇచ్చాడు దేవతలకు అమృతాన్ని ఇచ్చాడు అముదిల్ వరుమ్ పెణ్ణముదు " (అమృతం కంటే గొప్ప అమృతం అనదగిన) లక్ష్మిని తాను పొంది, మాధవుడు అయ్యాడు. భగవంతుడు సముద్రాన్ని చిలికిన కాలంలో దేవతలకు ఇచ్చిన అమృతం అయితే బంధకమైనది, సంసారవర్ధకమైనది. కానీ, ఆ భగవానుడు శ్రీవేదవ్యాసావతారాన్ని ఎత్తిన

సమయంలో ఇచ్చిన "పారాశర్యవచఃసుధ" అనబడే అమృతం అయితే, సంసార నివర్తకం అయినది– అనేదే ఈ శారీరక శాస్త్రానికి కల గొప్పతనం.

మొదట సూత్రం అంటే ఏమిటో గమనిద్దాం. ఏ సూత్రమైనా, దాని శబ్దశరీరం చిన్నదిగా ఉన్నా, అనేక అర్థాలను అది సూచిస్తున్నందున దానికి సూత్రం అని పేరు. ఈ విషయాన్ని "సూచనాత్ సూత్రమ్" అని సూక్తి ద్వారా పెద్దలు తెలియజేశారు. ద్రావిడ భాషలో చాలా చిన్నదైన వాక్యాలతో గొప్ప అర్థాన్ని తెలియజేసే గ్రంథం తిరుక్కుఱళ్. అయితే, ఆ గ్రంథంలో ఉండే వాక్యాల కంటే చాలా చిన్నదైన వాక్యాలతో బ్రహ్మసూత్రగ్రంథం ప్రకాశిస్తున్నది. ఇంత చిన్న వాక్యాలలో కూడా ఎన్నో అర్థాలు పొదగబడి ఉండడం చాలా ఆశ్చర్యకరం. సూత్ర శబ్దానికి ఇంకా ఇంకొక అందమైన అర్థాన్ని "వేదాంతార్థకుసుమ గ్రథనార్థత్వాత్ సూత్రమ్" అని పెద్దలు తెలియజేశారు. అందమైన పుష్పాలను సూత్రంతో కూర్చినట్లుగా వేదాంతార్థాలు అనే పుష్పాలను బ్రహ్మసూత్రాలు అనే దారాలతో కూర్చినందున వాటికి బ్రహ్మసూత్రాలు అనే పేరు వచ్చింది అని పైన తెలిపిన వాక్యంలోని భావం.

దీనికి ఇంకొక విధంగా కూడా అతిశయాన్ని చెబుతారు. ఇది స్కాంద పురాణంలో చెప్పబడిన విషయం. " అల్పాక్షరం అసందిగ్ధం సారవత్ విశ్వతోముఖమ్, అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః, నిర్విశేషితసూత్రత్వం బ్రహ్మసూత్రస్య చాప్యతః, సవిశేషాణి సూత్రాణి హ్యపరాణి విదో విదుః, ముఖ్యస్య నిర్విశేషేణ శబ్దోఽన్యేషాం విశేషతః" అని వచనం. అంటే– బ్రహ్మసూత్రాలకే సూత్రలక్షణాలు పొసగి ఉన్నాయని, వీటికి ఒక్కటికే ఇటువంటి లక్షణాలు ప్రత్యేకంగా పొసగి ఉన్నాయని, ఈ కారణంచేతనే వీటిని సూత్ర శబ్దంతో వ్యవహరించడం పొసగుతుంది అని, మిగిలిన సూత్రాలు సవిశేషాలే అని తెలియడం జ్ఞానులకు లక్షణం అని ఇక్కడ చెప్పబడింది. మిగిలిన శాస్త్రాలలోని సూత్రాలు న్యాయ సూత్రాలు, వ్యాకరణ సూత్రాలు అని సవిశేషంగా

వ్యవహరింపబడతాయి, కానీ, బ్రహ్మసూత్రాలు మాత్రం నిర్విశేషంగా కేవలసూత్ర శబ్దంతోనే వ్యవహరింపబడడం విశేషం.

సూత్రాలకు చెప్పబడిన లక్షణాలు ఏవి? అంటే, 1) పరిమితమైన అక్షరాలను కలిగినదై ఉండడం, 2) సందేహాన్ని తీర్చే స్వభావాన్ని కలిగినదై ఉండడం, 3) సారభూతమై ఉండడం, 4) అన్ని విధాలుగాను ప్రవర్తించే సామర్థ్యాన్ని కలిగి ఉండడం, 5) నిరర్థకమైన శబ్దాలు లేనిదై ఉండడం, 6) దోషం లేని శబ్దజాలాన్ని కలిగినదై ఉండడం– అనేవి. ఈ విధంగా ఈ లక్షణాలు అన్నీ కలిగినది సూత్రం అని చెప్పబడుతుంది. శ్రుత ప్రకాశికలో ఈ అర్థాలు అన్నీ చూపబడ్డాయి.

బ్రహ్మసూత్ర గ్రంథం స్వతంత్ర గ్రంథం కాదు, అంటే, ఏ విధంగా వేదాంతవాక్యాలను ఆధారంగా చేసుకుని భగవంతుడు గీతా శాస్త్రాన్ని అనుగ్రహించాడో, ఆ విధంగానే వేదాంతవా క్యాలే బ్రహ్మసూత్రాలకు కూడా మూలభూతమై ఉన్నాయి అనే విషయాన్ని తెలియాలి. నమ్మాళ్వార్ అనుగ్రహించిన దివ్య ప్రబంధాలు అన్నీ రహస్య త్రయాన్ని ఆధారంగా చేసుకున్నాయి. శ్రీవచనభూషణానికి మూల భూతమై ఉండేది ద్వయమంత్రం. వేదాంతదేశికులు తత్త్వటీక అనే గ్రంథంలో ఆశ్చర్యంగా ఈ విధంగా పలుకుతున్నారు –"యథా హి వేదవాక్యస్య విషయో బ్రహ్మ కథ్యతే" –వేదానికి అంతగాను, శిరస్సు గాను ఉండేది వేదాంతం. వేదాంతవాక్యాలకు విషయమై ఉండేది బ్రహ్మం. " తథైవ సూత్ర వాక్యస్య త్రయ్యంతః పరికీర్త్యతే"– బ్రహ్మసూత్ర ప్రబంధానికి విషయమైనది ఏది? అంటే, వేదాంతవాక్యాలే. అంటే, బ్రహ్మను గూర్చి వేదాంతం వివరిస్తున్న ది అని అర్థం. వేదాంతవాక్యాలను గూర్చి వ్యాసులు విశదీకరించారు, అంటే, ఈశావాస్య ఉపనిషత్ ప్రారంభంగా బృహదారణ్యక ఉపనిషత్ పర్యంతంగా ఉండే ఈ ఉపనిషత్తుల పరమార్థాలనే వేదవ్యాసులు ఆ యా ఉపనిషత్ వాక్యాలను విచారించి నిర్ణయం చేశారు.

వీటిలో చెప్పబడే అర్థవిశేషాలను యథాతథంగా గ్రహించి, యథాతథంగా స్పష్టంగా తెలుసుకొని, యథాతథంగా తెలుపడం కోసమే ఏర్పడినది, భగవద్రామానుజావతారం.

## 7) శారీరక శాస్త్రం – భగవద్రామానుజులు

"తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే,
యః శ్రుతిస్మృతిసూత్రాణాం అంతర్జ్వర మశీశమత్"

అనే వచనానుసారము జగత్కా జగదాచార్యులైన భగవంతురామానుజులు అద్వితీయమైన చైత్రమాసం ఆర్ద్ర నక్షత్రంలో ఈ భూమండలంలో అవతరించారు. తిరువనదాళ్వాన్ (ఆదిశేషుల)అవతార విశేషమైన మన స్వామి భగవద్రామానుజుల అవతారానికి ముఖ్య ప్రయోజనం ఏమంటే, వేదాంత వాక్యార్థాలను, బ్రహ్మ సూత్రార్థాలను, గీతా వాక్యార్థాలను సమంజసగా నిరూపణం చేయడం కోసమే –అని మన ఊరు పెద్దలు అనుగ్రహించిన సూక్తి.

లోకంలో చీకటిని పోగొట్టే శక్తి ఆదిత్యునకు ఉన్నది. అదే విధంగా, అంతరమైన చీకటిని అనే అజ్ఞానాన్ని పోగొట్టి, తన అనుష్టానంతో కాంతిని అనుగ్రహించే గొప్పతనం రామదివాకరునకు ఉన్నది. తరువాత, తన ఉపదేశంతో (శ్రీ గీతాశాస్త్రం ద్వారా) ఆంతరమైన అంధకారాన్ని పోగొట్టిన గొప్పతనం అచ్యుతభానువు అయిన శ్రీకృష్ణునకు ఉన్నది. ఈఇద్దరికీ మించి, మన సంప్రదాయంలో "తృష్ణాకృష్ణ తత్వమ. " కీర్తింపబడే విధంగా ఉదయించిన వకళ భూషణ బాస్కరులైన నమ్మాళ్వారులకు, లోక దివాకరులైన తిరుమంగై అళ్వార్లకు ఉండే గొప్పతనం ఇంత అని చెప్పడానికి సాధ్యం కానిది. వీరి అందరికీ మించి మన గురుపరంపరాహారంలో మధ్యమణిగా ప్రకాశించే శ్రీరామానుజుల వైభవం వాచామగోచరం.

భగవద్రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలలో– వేదార్థ సంగ్రహం వేదార్థాలను భగవద్వి భగవద్గీతాభాష్యం స్మృతి అయిన గీతలోని పరమార్థాలను వివరించేవిగా ప్రకాశిస్తున్నవి. వేదాంత సారం, వేదాంతదీపం, శ్రీ భాష్యం అనే ఈ మూడు కూడా శారీరక మీమాంసాశాస్త్రం అయిన బ్రహ్మసూత్రాలకు సంగ్రహ విస్తరభావాలతో వాఖ్యానాలుగా వెలుగుతున్నవి. వీటిలో, శ్రీ భాష్యం అతి విస్తృతంగాను, వేదాంత దీపం అనతివిస్తారంగాము, వేదాంత సారం సంగ్రహంగాను రచింపబడ్డాయి.

చాలా విపులంగా, అత్యద్భుతంగా, అందరూ తెలుసుకునే విధంగా, పరమ సుగ్రహంగా బ్రహ్మసూత్రాల సకలార్థాలను ప్రత్యేక ప్రత్యేకంగాను, కలిపి శ్రీభాష్యాన్ని అనుగ్రహించడం ద్వారా వివరించి, రక్షించారు –మన స్వామి భగవత్రామానుజులు అనే విషయం చాలా సారమైన విషయం. మూల గ్రంథమైన శారీరక శాస్త్రం వలనే శ్రీ భాష్యం కూడా నాలుగు అధ్యాయాలుగా అమరి ఉన్నది.

శ్రీ భాష్యంలో లేని కొన్ని అంశాలు వేదాంతదీపంలోనూ, వేదాంత సారంలోనూ ఉన్నాయి. శ్రీభాష్యంలో మంగళ శ్లోకం, గురు వందనం, ప్రతిజ్ఞావాక్యం, సూత్ర వ్యాఖ్యానం అనేది క్రమం. వేదాంత దీపంలో అత్యాశ్చర్యకరంగా అవతారికను అనుగ్రహించారు, భగవద్రామానులు. ఇందులో రెండు ముఖ్యమైన విషయాలను చాలా ఆశ్చర్యకరంగా అనుగ్రహించారు. ఇందులోని అవతారికను రెండు భాగాలుగా విభజించి గ్రహించవచ్చు. మొదట తత్వత్రయవాదాన్ని చేశారు, శ్రీ రామానుజులు. అనంతరం బ్రహ్మసూత్ర ప్రబంధం యొక్క 16 పాదాల సారార్థాలను తెలియజేశారు. " యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్వతో బ్రహ్మ విద్యామ్" (ఏ బ్రహ్మ విద్య చేత అక్షరుడు అనబడే, స్వరూప స్వభావ వికారాలు లేనివాడైన పురుషుని తెలుసుకుంటున్నాడో, అటువంటి బ్రహ్మవిద్యను ఆచార్యుడు తన దగ్గరకు వచ్చి ఆశ్రయించిన శిష్యునకు ఉపదేశించాలి) అనే ముండకోపనిషత్ వాక్యం "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే మొదటి సూత్రం యొక్క

అర్థాన్ని అంతర్భవించుకున్నది. దీనికి వ్యాఖ్యానాన్ని శ్రీరామానుజులు వేదాంతసారంలో అనుగ్రహించారు. దీనిని అనుసరించి తత్వటీకలో శ్రీ వేదాంత దేశికులు, శ్రుత ప్రకాశికలో శ్రీసుదర్శన సూరి అనే మన ఆచార్యులు విస్తృతమైన వివరణలను అనుగ్రహించారు.

శ్రీ భాష్యకారులైన భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీ భాష్య గ్రంథంలో మిగిలిన భాష్యకారులు చూపని, వీరు విశేషించి చూపించిన విషయాలను ఆచార్యులకు శ్రీచరణ సన్నిధిలో ఉండి, క్రమానుసారంగా శ్రీభాష్యపంక్తులను సేవించి, కాలక్షేపం చేస్తే తప్ప తెలియడం అసాధ్యం. సాక్షాత్తు ఆదిశేశంభూతులైన శేషరామానుజులు తప్ప, మిగిలిన ఎవరి వల్ల శేషిరామానుజుడైన శ్రీకృష్ణుని ముఖకమలం నుండి ఉద్భవించిన గీతలోని ఋజువైన అర్థాలను తెలియడం గాని, పలుకడం కాని సాధ్యం కాని విషయం. ఆ విధంగానే, " యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (ఏ పరమాత్మ సృష్టి ఆరంభంలో బ్రహ్మను సృష్టించాడో, ఎవడు ఆ బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడో) అని, " అన్నమాయ్ మునివరోడు అమరరేఱ్ఱ ఆరుమఱైయై వెళిప్పడుత్త అమ్మాన్" (హంసావతారాన్ని ఎత్తినవాడై, మునులు, దేవతలు అందరూ కీర్తిస్తూ ఉండగా, అరుదైన వేదాలను వ్యక్తం చేసిన స్వామి) అని కీర్తింపబడే శేషి అయిన రామానుజుడే ఆ ఉపనిషత్తులలోని అర్థాలను చెప్పడం సాధ్యం. "వ్యాస రూపాయ విష్ణవే" అని అతడే అనుప్రవేశం చేసి, అనుగ్రహించిన శాస్త్రమైన బ్రహ్మసూత్రాలను అతడు ఒక్కడే వ్యాఖ్యానించడానికే సమర్థుడు. అందుచేత, "తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే, యః శృతిస్మృతి సూత్రాణామంతః జ్వరమశీశమత్" అనే విధంగా శ్రీరామానుజులు భగవదంశభూతులై అవతరించి, భగవంతుని వక్తగా కలిగిన ప్రస్థాన త్రయాన్ని కూడా వ్యాఖ్యానించి, వాటికి జ్వరాన్ని లేకుండా చేసి, సదర్థ ప్రతిష్ఠాపనం

చేశారు– అనే విషయం మన పెద్దలు మాటిమాటికి అనుగ్రహిస్తారు, అనుభవిస్తారు కూడా.

**8) శ్రీభాష్య వైభవవివరణం**

శ్రీవేదవ్యాసుల శిష్య ప్రశిష్య పరంపరలో ఆవిర్భవించిన ఒక పెద్దలే బోదాయనమహర్షి. ఈ మహాచార్యులు శ్రీ వేదవ్యాసులు అనుగ్రహించిన బ్రహ్మసూత్రాలకు 60 వేల గ్రంథాల పరిమితిలో ఉండే (ఒక గ్రంథం అంటే –32 అక్షరాలను కల ఒక ప్రమాణం), చాలా విపులమైన ఒక వ్యాఖ్యానాన్ని రచించారు. ఇదే బోధాయన వృత్తి గ్రంథం అని మన ఆచార్యులచే వ్యవహరింపబడుతున్నది. కాశ్మీర దేశంలో సరస్వతీ భాండాగారంలో మాత్రం ఉన్న ఈ గ్రంథాన్ని నాథమునులు, శ్రీయామునులు వంటి మహాచార్యులు దర్శించి, అందులో ఉండే విశేషాలను గ్రహించడానికి సాధ్యం కానందువలన, వారిచే శారీరక గ్రంథానికి ఒక వ్యాఖ్యానం రచించే అవకాశం కలుగలేదు. ఈ బోధాయన వృత్తి గ్రంథాన్ని సేవించి, అందులో గోచరించే బ్రహ్మసూత్రార్థ విశేషాలను తెలిసికొనే భాగ్య విశేషం శ్రీ కూరేశులను సహాయంగా కలిగిన భగవద్రామానుజులకు కలిగింది. అందువల్లనే ఈ శారీరక మీమాంసా శాస్త్రంలోని యథార్థమైన తాత్పర్యార్థాలను చాలా స్పష్టంగా తెలుసుకొని, మన స్వామి భగవద్రామానుజులు శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు అనేది సంప్రదాయ సూక్తి.

శ్రీ భాష్య మహా గ్రంథానికి వివరణ రూపమై ప్రకాశించే శ్రుతప్రకాశికలో శ్రుతప్రకాశిక భట్టర్ ఈ విషయాన్ని గూర్చి చాలా అద్భుతంగా వివరించారు. అది ఏమంటే– ఈ బోధాయన వృత్తి గ్రంథాన్ని సేవించే, అందులో కనుపించే వ్యాఖ్యానార్థ విశేషాలను మనసులో పెట్టుకొనే శ్రీభాష్యాన్ని రచించాలి అనే నిర్బంధం శ్రీ రామానుజులకు ఏ విధంగా ఏర్పడింది? ఋషి కానివాడు సూక్ష్మదర్శిగా ఉండే అవకాశం లేదు. ఒక ఋషి యొక్క అభిప్రాయాన్ని యథాతథంగా వేఱొక ఋషి మాత్రమే తెలియగలడు.

మందబుద్ధిని కల, ఋషి కానివారు తెలియలేరు. మన స్వామి అయిన భగవద్రామానుజులు అనుగ్రహించిన శారీరక శాస్త్ర వ్యాఖ్యాన గ్రంథాలు అయిన శ్రీ భాష్యం మొదలైనవి శ్రీ వేదవ్యాసుల శిష్యప్రశిష్య పరంపరలో అవతరించిన బోధాయనమహర్షి రచించిన వృత్తి గ్రంధం యొక్క అర్థవిశేషాలను తనలో కలిగినదై, వాటిని పూర్తిగా అనుసరించి, అవతరించినందున, మూల గ్రంథమైన బ్రహ్మసూత్రాలలోని తాత్పర్యార్థాలకు వేనికీ విరోధం ఏమీ రాకుండా, వాటిని సంశయ విపర్యయ దోషాలు ఏమి లేని విధంగా వివరించేదై ఏర్పడింది. శ్రీ భాష్యకారులు కంటే మిగిలిన బ్రహ్మసూత్రవ్యాఖ్యాతలు ఆర్ష వ్యాఖ్యానాలను అతిక్రమించి వర్తించినవారు— అనే విషయం మనం గ్రహించాలి. ఈ విధంగా బోధాయన ఋషి అనుగ్రహించిన వృత్తిగ్రంథాన్ని అనుసరించినందున వ్యాసుల మనోభిప్రాయాన్ని ప్రతిఫలింపజేసేదై ప్రకాశిస్తున్నది— అనేది మన స్వామి భగవద్రామానుజుల అనుగ్రహించిన శీభాష్య గ్రంథానికి కల అసాధారణమైన వైభవం. ఈ గొప్పతనం బ్రహ్మసూత్రాలను విషయంగా కల మిగిలిన భాష్యాలకు నేనే లేదు అనేది కూడా స్పష్టం.

ఈ సందర్భంగా ఇంకొక విషయాన్ని కూడా చాలా అందంగా శ్రుత ప్రకాశికాచార్యస్వామివారు తెలియజేశారు. శ్రీ భాష్యంలో భగవద్రామానుగులు శ్రీ వేంకటేశ్వరుడైన శ్రీనివాసుని ఉద్దేశించి మంగళ శ్లోకాన్ని అనుగ్రహించిన తరువాత, ఆచార్యులైన శ్రీ వేదవ్యాసులను గూర్చి, వారు అనుగ్రహించిన శారీరక శాస్త్రాన్ని గూర్చి రెండవ శ్లోకాన్ని అనుగ్రహించారు. ఇందులో "పూర్వాచార్య సురక్షితమ్" అనే ప్రయోగంతో, దీనికి తరువాత శ్రీరామానుజులు అనుగ్రహించిన సూక్తిలోని "భగవత్ బోధాయనకృతాం విస్తీర్ణాం పూర్వాచార్యాః సంచిక్షిపుః" అనే ప్రయోగాన్ని చేర్చి మన గమనించి, ఒక వాస్తవాన్ని గ్రహించాలి. అది ఏమంటే— మొదట, పూర్వాచార్యులు అందరూ పలు పలు వ్యాఖ్యానాలను అనుగ్రహించడంద్వారా ఈ శారీరక శాస్త్రాన్ని

చక్కగా తెలిపి, రక్షించారు– అని తెలుస్తున్నది. తరువాత, " విస్తీర్ణాం బ్రహ్మసూత్ర వృత్తిమ్"అని శ్రీ రామానుజులు పలికినదానిని బట్టి భగవద్బోధాయనులు బ్రహ్మసూత్రాలకు చాలా విపులమైన వృత్తి గ్రంథాన్ని అనుగ్రహించారు అని కూడా తెలుస్తున్నది. శారీరక శాస్త్రానికి మిగిలిన పూర్వాచార్యుల వ్యాఖ్యానాలు ఏర్పడి ఉన్నందున, ఈ వ్యాఖ్యాన గ్రంథాలను బోధాయనుల వృత్తి గ్రంధాన్ని పురస్కరించుకొని శారీరక శాస్త్రం యొక్క అర్థవిశేషాలన ఎవరైనా తెలుసుకోవచ్చు కదా! ఆ విధంగా ఉన్నప్పుడు, మన స్వామి భగవద్రామానుజులు మళ్ళీ శ్రీభాష్యమనే పేర వేరొక వ్యాఖ్యానాన్ని రచించడంలో ఏమి కారణం? అనే ప్రశ్న ఇక్కడ తల ఎత్తుతుంది. ఇక్కడనే శ్రీరామానుజుల శ్రీసూక్తులను (ఇంతకు ముందు చెప్పిన విధంగా) చేర్చి గమనించి, వాటికి తాత్పర్యార్థం తెలుపడడం ద్వారా శ్రీ రామానుజుల ఆశయాన్ని చక్కగా వివరిస్తున్నారు శ్రీశ్రుతప్రకాశికాచార్యులవారు. అది ఏమంటే –బోధాయన వృత్తి గ్రంధం అనేది చాలా విస్తృత వ్యాఖ్యానమై ఉన్నందున, దానిని పూర్ణంగా సేవించి, సుస్పష్టంగా అర్థగ్రహణాన్ని చేయడం అనేది సాధారణమైన విషయం కాదు. ఆయుర్దాయం అపారంగా ఉన్నవారికే అది సాధ్యమవుతుంది. శారీరక శాస్త్రానికి శ్రీరామానుజులు ముందున్న పూర్వాచార్యులు రచించిన వ్యాఖ్యానాలు అయితే, చాలా సంగ్రహంగా ఉన్నందున, సూక్ష్మ బుద్ధిని కలవారికే దాని తాత్పర్యార్థాలు బోధపడతాయి. మన వంటి వారికి అయితే, అటువంటి విధంగా సూక్ష్మబుద్ధి లేదు, అపారమైన ఆయుస్సు కూడా లేదు.

ఇంతకుమించి, ఇంకా, ఒక ప్రశ్న ఇక్కడ తల ఎత్తుతుంది. అది ఏమంటే, చాలా దీర్ఘమైన ఆయుస్సు లేకపోయినా, బుద్ధి సూక్ష్మం లేకపోయినా, ఎవడైనా నిత్యం పరిశ్రమ చేసి, ఈ గ్రంథాలలో పరిచయం పెంచుకున్నట్లయితే, అతనికి శారీరక శాస్త్రార్థాలను గ్రహించడం సాధ్యమే కదా! అనేది ఆ ప్రశ్న. అయితే, ఆ విధంగా పరిశ్రమ చేసిన

అధికారులు చాలా అరుదుగా ఉంటారు. అందుచేతనే పరమ కారుణికులు అయిన మన స్వామి భగవద్రామానులు శ్రీ భాష్యాది గ్రంథాలను మనం ఉజ్జీవించడం కోసం అనుగ్రహించారు అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్యులవారు.

అందుచేత భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీ భాష్యం అతి సంగ్రహంగా లేకుండా, అతి విస్తృతంగా లేకుండా ఉన్నందున సూక్ష్మ బుద్ధి, ఆయుర్వృద్ధిలేని మనంవంటివారు కూడా బ్రహ్మసూత్ర తాత్పర్యార్థాలను సులభంగా తెలుసుకోనేటట్లు ఏర్పడింది –అనే ఈ వాస్తవం శ్రీభాష్యంలోని గొప్పతనాన్ని మనకు చక్కగా తెలియజేస్తున్నది.

"సంహితమేతత్ శారీరకమ్" అని బోధాయనులు అనుగ్రహించడాన్ని భగవద్రామానుజలు శ్రీ భాష్యంలో ప్రస్తావించారు. ". ఏ తత్ శారీరకం సంహమ్" తం అని ఇక్కడ అన్వయం. సంహితం అంటే – "సంగతి విశేషణ విశిష్ట క్రమమ్" అని వివరిస్తారు, మన పూర్వా చార్యులు. దీని అర్థం ఏమి? అనే విషయాన్ని కొంచెం వివరిస్తాను.

యాగ శబ్దానికి దేవ పూజ అనే అర్థం. వేదంలో చెప్పబడిన పలు విధాలయిన యాగ కర్మలకు ఆరాధ్య దేవతలు ఎవరు? అని ఆకాంక్షను గూర్చి దేవతా విచారం ఆవశ్యకమవుతున్నది. వేదంలో విధింపబడిన ఆ యా యాగ కర్మలకు ఉద్దిష్టదేవతలైన ఇంద్రుడు, ప్రజాపతి, వరుణుడువంటివారిని గూర్చి విచారించే కాండంగా ఏర్పడినది, దేవతాకాండం. ఈ ఆరాధ్య దేవతలు అందరూ స్వతంత్ర దేవతలా? లేక, పరతంత్ర దేవతలా? (ఈ దేవతలు విభూతి రూపాలైన దేవతావిశేషాలా? అంటే, ఇంకొక పరతత్త్వానికి అణగి ఉండేవారైన దేవతలా? లేక, పరతత్వ దేవతా విశేషాలా? )అనే శంక లేవగా, దీనికి సమాధానం తెలుపడం కోసం బ్రహ్మవిచారం ఆవశ్యకమవుతున్నది. అందువల్ల ఈ విధంగా, కర్మకాండలో కనిపించే ప్రశ్నలకు సమాధానం దేవతాకాండాన్ని

విచారిస్తే తెలుస్తుంది. దేవతాకాండంలో వర్ణింపబడిన అర్థాలకు పైన ఏర్పడే ప్రశ్నలకు సమాధానం బ్రహ్మకాండాన్ని విచారిస్తే లభిస్తుంది.

శ్రీవేదవ్యాసులు "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" బ్రహ్మ విచారం కర్తవ్యం –అని అంటూ బ్రహ్మసూత్ర గ్రంథాన్ని ఆరంభించారు. ఈ బ్రహ్మం ఎవరు(అంటే, ఇదే కర్మకాండలో విచారింపబడిన అన్ని కర్మలకు ఆరాధ్యమైన దైవం. ఈ బ్రహ్మమే దేవతాకాండంలో విచారింపబడిన దేవతలకు అందరికీ అంతరాత్మ భూతుడైన దైవం. ఈ విధంగా బ్రహ్మం యొక్క పలు విధాలైన గొప్పతనాలు అన్నీ పలురీతులలో తెలియజేసి, సర్వకర్మ సమారాధ్యుడై, సర్వదేవతలకు అంతర్యామియై ఉండడమే బ్రహ్మ శద్దార్థ భూతుడైన నారాయణని తత్త్వం అని వేదవ్యాసులు నిరూపించారు.

అందువల్ల, జైమిని కర్తృకమైన కర్మకాండం, కాశ కృత్స్న కర్తృకమైన దేవతాకాండం, శ్రీ వేదవ్యాస కర్తృకమైన బ్రహ్మకాండం –అని మీమాంసలు మూడు ఉన్నప్పటికీ, విషయాలు మూడుగా ఉన్నప్పటికీ, మహర్షులు ముగ్గురుగా ఉన్నప్పటికీ, ఈ మూడిటినీ అంతర్భవించుకున్న శాస్త్రం ఒకటే. ఈ విషయాన్ని మనం ఇప్పుడు కొత్తగా చెబుతున్నాము అనేది లేదు. మహర్షులు ఏకగ్రీవంగా అంగీకరించిన అభిప్రాయంగా శ్రీబోధాయనులే అనుగ్రహించారు– అని మనకు తెలియజేస్తున్నారు, మన స్వామి అయిన భగవద్రామానుజులు.

ఇక్కడ మనకు ఒక విషయాన్ని చక్కగా వివరించి తెలుపుతున్నారు శ్రుతప్రకాశికా భట్టర్. అది ఏమంటే, కాండద్వయాత్మకమైన శారీరకం ఏకశాస్త్రమై ఉండగా, మన స్వామి భగవద్రామానుజులు కర్మమీమాంసకు, దేవతామీమాంసకు భాష్యం ఏమీ అనుగ్రహించకుండా, ఏ కారణంచేత కేవలం వేదవ్యాసులు అనుగ్రహించిన బ్రహ్మసూత్రాలకు మాత్రం వ్యాఖ్యానం అనుగ్రహించారు? అనే ప్రశ్న ఇక్కడ

ఉత్పన్నమవుతున్నది. కర్మకాండకు వ్యాఖ్యానాలు అనుగ్రహించిన అనంతర కాలానికి చెందిన వ్యాఖ్యాతలు చఅక్కడ కొంత సందేహాలను కలిగించిన మాట వాస్తవమే అయినప్పటికీ, కర్మ మీమాంసలో కనిపించే మంత్రాల ప్రయోగ మార్గంలో ఏ విధమైన సందేహాలకు కాని, భ్రమలకు కాని అవకాశం లేదు. అందుచేత, ఆ యా యాగ కర్మానుష్ఠాన మంత్రాలకు సంబంధించి ఏర్పడే స్వర్గం మొదలైన ఫలసిద్ధి అనేది ఆయా దేవతలకు స్వరూపంగా ఏర్పడుతున్నది. ఇటువంటి దేవతల స్వరూప యాథాత్మ్యమనేది (వాస్తవమైన స్థితి అనేది) సత్కార్య వాదం మొదలైన శాస్త్రార్థ జ్ఞానాపేక్షను కలిగి ఉండదు. అంటే, కర్మకాండలో చెప్పబడి ఉండే యాగకర్మలను చేసే అధికారికి సత్కార్యవాదంవంటి జ్ఞానకాండార్థ జ్ఞానాపేక్ష ఆవశ్యకం కాదు.

అయితే, “తత్వ జ్ఞానాత్ మోక్షలాభః” అని పరమ పురుషార్థమైన మోక్షం అనేది జ్ఞానం ఒక్కటి ద్వారానే సాధించవలసి ఉన్నందున, జ్ఞానమార్గంలో ఒకనికి నిశ్చయబుద్ధి లేకుండా, అతడు చంచలమైన మనసును కాని, లేక విపరీత జ్ఞానం కాని కలిగినవాడే అయితే, అది అతనికి ఆత్మ నాశనం కలిగించే అపాయం ఉన్నది. అందుచేత ఒకనికి ఆత్మహానిని కలిగించే విపరీత జ్ఞానాలే తప్పక పరిహరించుకోవలసినవై ఉన్నవి. అంతేకాక, బ్రహ్మ మీమాంసలో కూడా ఆయా అర్ధ విశేషాలకు సాధనాలుగా గ్రహింపబడిన కర్మకాండ దేవతాకాండలలోని అర్థాలు అక్కడక్కడ చూపబడినందున, అటువంటి అర్థవిశేషాలు సులభమైన రీతిలో నిర్వహించదగినవి అవుతున్నవి. ఈ కారణంచేతనే పరమకారుణికులు అయిన మన స్వామి భగవద్రామానుజులు శ్రీభాష్యం మొదలైన గ్రంథాలలో బ్రహ్మసూత్రార్థాలనే నిరూపించారు అని శ్రుతప్రకాశికాచార్య స్వామివారు అనుగ్రహించారు.

శ్రీవేదవ్యాసుల బ్రహ్మసూత్ర ప్రబంధానికి వ్యాఖ్యానంగా మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించిన శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలకు వ్యాఖ్యాన వివరణ

రూపాలుగా పలు గ్రంథాలను మన పూర్వాచార్యులు వారకి తరువాత అవతరించిన ఆచార్యులచే రచింపబడ్డాయి. వాటిలో ముఖ్యంగా కొన్ని గ్రంథాలనుమాత్రం ఇక్కడ ప్రస్తావిస్తాను.

మొదటగా శ్రుతప్రకాశిక ప్రస్తావించదగినది. ఈ వ్యాఖ్యాన గ్రంథమే లేకపోతే, దీనికి మూలమైన శ్రీ భాష్యంలోని అర్థ విశేషాలలో ఏదీ కూడా మనకు బోధపడదు. ఇది ఈ భాష్యానికి ఏర్పడిన విపులమైన వ్యాఖ్యానం. శ్రుతప్రకాశికాశాచార్యులవారే శ్రీ భాష్యానికి సంగ్రహ వ్యాఖ్యానమైన శ్రుతప్రదీపిక అనే గ్రంథాన్ని కూడా అనుగ్రహించారు. శ్రుతప్రకాశి క లుప్తం కాకుండా దానిని మనకు రక్షించి అనుగ్రహించారు, వేదాంతదేశికులు. ఈ మాహనీయులు అధికరణ సారావళి, తత్వటీక, న్యాయ సిద్ధాంజనం, శతదూషణి వంటి గ్రంథాలను అనుగ్రహించడం ద్వారా ఈ భాష్యాన్ని సంరక్షించారు. శ్రుత ప్రకాశికకు వ్యాఖ్యానమైన భావప్రదీపిక అనే గ్రంథం దశోపనిషత్ భాష్యకారులైన శ్రీరంగరామానుజమునులచే అనుగ్రహింపబడింది. వీరే శ్రీ భాష్యానికి వాఖ్యానమై వెలిగే మూలభావ ప్రకాశిక అనే గ్రంథాన్ని, దేశికుల న్యాయసిద్ధాంజనానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. శతదూషణికి చండమారుతం అనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన చోళ సింహపురం శుద్ధసత్వం దొడ్డయాచార్య స్వామి అనే మహా చార్యులు పారాశర్య విజయం అనే గ్రంథాన్ని బ్రహ్మసూత్ర ప్రబంధానికి వ్యాఖ్యానంగా అనుగ్రహించారు. బ్రహ్మసూత్రాలకు శ్రీ భాష్యాన్ని అనుసరించిన వ్యాఖ్యానమైన నయాప్రకాశిక అనే గ్రంథాన్ని, ఈ భాష్య భావ ప్రబోధనం అనే గ్రంథాన్ని వేదాంత దేశికుల కాలానికి ముందున్న మేఘనాదసూరి అనే మహాచార్యులచే అనుగ్రహింపబడింది. మయ మయూఖ మాలిక అనే గ్రంథం అప్పయ్యదీక్షితులచే విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అనుసరించి బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానంగా రచింపబడిన గ్రంథం.

శ్రీ భాష్యానికి శ్రీభాష్య వివరణం అని సోమాశి ఆండాన్ ఒక గ్రంథాన్ని, ఇదే శీర్షికతో ఎంగళాళ్వాన్ (విష్ణు చిత్తులు) ఒక గ్రంథాన్ని రచించారు. భగవద్రామానుజులకు సాక్షాత్ శిష్యులైన ఈ మహాచార్యులు అనుగ్రహించిన ఈ గ్రంథాలు ఇప్పుడు దొరకడం లేదు. వేదాంత న్యాయ సుదర్శనం అనే గ్రంథం శ్రీ వరద నారాయణ భట్టారకులు అనే మహాచార్యులచే రచింపబడింది. న్యాయకలాప సంగ్రహం అనే ఇంకొక గ్రంథం ఉన్నది. ఇదేకాక, నడాదూర్ అమ్మాళ్ అనుగ్రహించిన తత్త్వసారం అనే గ్రంథం శీభాష్యంలో చూపబడిన సారార్థాలను వివరించేదిగా వెలుగుతున్నది.

ఇవేకాక మైసూర్ అనందాళ్వాన్ అనుగ్రహించిన వేదాంత వేదావళి, మైసూర్ పరకాల జీయర్ స్వామి అనుగ్రహించిన గూడార్థ సంగ్రహం, మోర్ మున్నార్ అయ్యన్ అనుగ్రహించిన న్యాయమాత్మా భాష్యం, కపిస్థలం దేశికాచార్య స్వామి అనుగ్రహించిన అధికరణ రత్నమాల, వ్యాస సిద్ధాంతం మార్తాండం, అభినవదేశికులు అని కీర్తింపబడే ఉత్తమూర్ వీర రాఘవాచార్యస్వామి అనుగ్రహించిన భాష్యార్థ దర్పణంవంటి గ్రంథాలు శ్రీ భాష్యంలోని సారార్థాలను మనం తెలిసికొనడంలో సహాయపడుతున్నాయి. ఇవేకాక, ఇంకా ఎన్నో గ్రంథాలు పలువురు పెద్దలచే అనుగ్రహింపబడ్డాయి.

పైన పేర్కొన్న గ్రంథాల ద్వారా భగవద్రామానుగుల శ్రీ భాష్యాది గ్రంథాలలో ఉండే అర్థవిశేషాలను పలు విధాలుగా అనుభవంలో తెచ్చుకున్నారు, మన పెద్దలు. అయితే, ఇక్కడ ఒక ప్రశ్న తల ఎత్తుతుంది.

మనకు భగవద్రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు చాలవా? శ్రీభాష్యం, శ్రుత ప్రకాశిక వంటి కొన్ని గ్రంథాలను మాత్రం అనుభవంలోకి తెచ్చుకుంటే సరిపోదా? వీటికి తర్వాత ఇన్ని గ్రంథాలు ఎందుకు అవతరించాయి? వీటివల్ల ఏమి ఉపయోగం? ఈ గ్రంథాలను అన్నిటిని మనం ఎందుకు అనుభవంలోకి తెచ్చుకోవాలి? అనేది ఆ ప్రశ్న.

ఈ గ్రంథాలు అవతరించడానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. ఏవో కొన్ని కారణాలనుమాత్రం తెలియజేస్తాను. ముఖ్యమైన కారణం– బ్రహ్మసూత్ర గ్రంథానికి కల విషయ గౌరవం. బ్రహ్మసూత్ర ప్రబంధంలో శ్రీ వేదవ్యాసులు పలు ఉపనిషత్తులలోని అర్థాలను అన్నిటినీ న్యాయమార్గంలో విచారించి, వాటిలో అంతర్గతంగా ఉండే, యథార్థాలైన తాత్పర్యార్థాలను బహిర్గతం చేసి మనకు దర్శింప జేశారు. ఇవి, వీటిని మనం పలు విధాలుగా వివరించుకొంటూ, అనుభవంలోకి తెచ్చుకొని ఉపయోగం పొందేటట్లుగా విషయ గౌరవాన్ని, అర్థపుష్టిని కలిగినవి. ఆచార్య శిష్యక్రమంలో పరంపరా ప్రాప్తంగా అనుగతంగా వచ్చిన అర్థ విశేషాలు వ్యాఖ్యాన వివరణ క్రమంలో క్రమక్రమంగా పలు గ్రంథాల ద్వారా గ్రంథస్థం చేయబడి, మన పూర్వులచే అనుభవంలోకి తెచ్చుకోబడ్డాయి. మనకు ముందున్న ఆచార్యులు వీటిని నిత్యానుభవంగా గ్రహించి, ఉజ్జీవించారు. మనకు కూడా మన పెద్దలు అనుసరించిన క్రమంలో పొందడమే తగిన క్రమం.

వీటిని అన్నిటిని మనంఅనుభవంలోకి తెచ్చుకున్నప్పుడే భగవద్రామానుజుల మేధావిలాసాన్ని, వారు మనకి ఎంతో శ్రమపడి అనుగ్రహించిన ఉపకార పరంపరలను మనం ఎల్లప్పుడూ మనసులో పెట్టుకోవడం సాధ్యపడుతుంది. మనం మన స్వామి భగవద్రామానుజుల శ్రీ చరణ సంబంధాన్ని పొందినవారం. ఈ కారణం ఒక్కదానివల్లనే మహాభాగ్యశాలులై జన్మించినవారం అయినాము. మనకు శ్రీరామానుజుల శ్రీ సూక్తులలోనే ప్రావణ్యం అతిశయించి ఉండాలి. మనకు ఇదే పరమ ప్రయోజనం. మనకు ఇంతకంటే మించిన పురుషార్థం ఇంకొకటి ఉండదు. ఉండే అవకాశం లేదు. మనకు ఇంతకంటే మించిన అనుభవాన్ని, గొప్ప అనుభవాన్ని పొందడానికి సాధ్యం కాదు. ఇదే మనకు స్వామితో కల సంబంధాన్ని క్రమక్రమంగా వృద్ధి పొందిస్తుంది.

భగవద్రామానుజుల శ్రీ సూక్తులను మనం ఏ విధంగా అనుభవంలోకి తెచ్చుకోవాలి? అనేదానికి ఈ గ్రంథాలు దారి చూపేవై ఉన్నాయి. మనకు శ్రీరామానుజులు ఏ శ్రుతి వాక్యాలకు అన్నిటికీ వ్యాఖ్యానం అనుగ్రహించారు? అని తెలియాలి. ఏ స్మృతి ఇతిహాస పురాణ వచనాలకు అన్నిటికీ స్వామి అర్థాన్ని అనుగ్రహించారు? అని మనకు తెలియాలి. గీతాశ్లోకాలకు అన్నిటికీ స్వామి ఏవిధంగా అర్థాన్ని అనుగ్రహించారు? అని మనం గమనించాలి. వేదవాక్యాలు, బ్రహ్మ సూత్రాలు, స్మృతి ఇతిహాస పురాణ వచనాలు, గీతా శ్లోకాలు, పాంచరాత్ర సూక్తులు, ఆళ్వారుల దివ్య సూక్తులు, ఆచార్యవర్యుల శ్రీసూక్తులు అనే వీటిని అన్నిటిని శ్రీ రామానుజులు ఏ విధంగా అర్థస్వారస్యంతో సమన్వయించేశారు? అని, వీటిని ఏ విధంగా ఒకటిగా సమన్వయపరచి నయనం చేసి, వాటిలో స్ఫురించే తాత్పర్యార్థాలను అనుగ్రహించారు? అని మనం అనుభవించాలి. స్వామికి తరువాత అవతరించిన మహానుభావులైన పూర్వాచార్యులు అందరూ తమ తమ గ్రంథాలలో శ్రీ రామానుజుల సూక్తులను ఏ విధంగా వివరించి చూపించారు? అని మనం అనుభవించాలి. ఏ ఏ ప్రమాణ వచనాలను పురస్కరించుకొని శ్రీరామానుజల శ్రీ సూక్తులు అమరి ఉన్నాయి? అనే సంగతిని మనం గమనించాలి. శ్రీరామానుజుల శ్రీ సూక్తులను ఒక్కొక్కటిగా గ్రహించి, విచారిస్తే దానికి ఆధారంగా, మూలంగా ఉండే ప్రమాణ వచనాలు మనకి అర్థమవుతాయి. మన పూర్వులు ఇటువంటి విచారణలను అన్నిటిని చేశారు. శ్రీ రామానుజుల వ్యాఖ్యానశైలి ఎటువంటిది? అనే విషయాన్ని లోతుగా తెలుసుకొని అనుభవించాలి. ఒక్కొక్క అర్థాన్ని వివరించడానికి స్వామి గ్రహించిన విధానాలు, న్యాయాలు ఎటువంటివి? అని మనకు తెలియాలి. ముందు, వెనుక ఉండే ప్రమాణాలను అనుసరించి. తాత్పర్యార్థాలను అనుగ్రహించడం, వేదవాక్యాలలో ప్రాణస్థానీయంగా

ఉండేవాటికి ఇతిహాసపురాణాలలో ఋషులు వివరించి చూపించిన దారులను అనుసరించి అర్థాన్ని అనుగ్రహించడం, ఏ ఏ వేదవాక్యాలకు ఏ ఏ ఇతిహాస పురాణ శ్లోకాలు ఉపబృంహణ రూపంగా అమరి ఉన్నాయి? అని తెలుసుకొని, ప్రమాణ వచనాలను ఉపోద్బలకంగా కల సూక్తులను అనుగ్రహించి, తత్త్వపరంగా విషయాలను నిరూపించేటప్పుడు, వాటికి ఆధారంగా ప్రస్థానత్రయంనుండి, శ్రీ విష్ణు పురాణంనుండి ఆధారాలను చూపడం –అనే ఇవి అన్నీ శ్రీరామానుజులు అనుసరించిన దారులు. ఇంతే కాక, "మాఱన్ పడి పణిందు ఉయ్ న్దవన్ రామానుశన్"(శ్రీనమ్మాళ్వారుల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించిన శ్రీరామానుజులు) అని, " ఇదు కొండు సూత్రవాక్యంగళై ఒరుంగ విడువర్" (ఈ నం తిరువాయి ముడి శ్రీ సూక్తులను ఆధారంగా చేసుకుని బ్రహ్మసూత్ర వాక్యాలను శ్రీ రామానుజులు సమన్వయం చేశారు) అని చెప్పిన విధంగా ఎక్కడెక్కడ రామానుజులువారు నమ్మాళ్వారుల శ్రీ సూక్తులను మనస్సులో పెట్టుకొని, బ్రహ్మ సూత్రాలకు వేదవ్యాలకు అర్థ వివరణం చేశారు? అని అనుభవించాలి.

భగవద్ రామానుజుల శ్రీవాష్య శ్రీసూక్తులను గురించి శ్రుత ప్రకాశికాచార్యులవారు ఒక అద్భుతమైన శ్లోకాన్ని అనుగ్రహించారు "అవిస్తృతాః సుగంభీరాః రామానుజమునే గిరః దర్శయంతు ప్రసాదేన స్వం భావం అఖిలం దృఢమ్" అనేది ఆ శ్లోకం. భగవద్రామానుజుల శ్రీసూక్తులను అతివిస్తృతమైనవి అని చెప్పడం వీలు కాదు. అవి చాలా సంగ్రహమైనవి అని అనడం వీలు కాదు. వారి శ్రీసూక్తులు అన్నీ అనతివిస్తృతంగా ఉన్నప్పటికీ కూడా, అవి చాలా గంభీరమైనవి. వాటిని పై పైన చూసినప్పుడు కూడా వాటి అర్థాలు బోధపడతాయి. బాగా లోతుగా నిశితంగా గమనించి చూసినప్పుడు కూడా అపారమైన అర్థాలు గోచరిస్తాయి. సముద్రాన్ని మనం చూస్తున్నాము. అందులో పలు పదార్థాలు ఉన్నాయి. సముద్రంలో నురగ, చేపలు, ముత్యాలు, పగడాలు, రత్నాలవంటి ఎన్నో వస్తువులు ఆయా రేవులలో దిగినవారికి దొరుకుతాయి. "సముద్ర

ఇవ గాంభీర్యే" అని శ్రీరామునకు కల గాంభీర్య గుణానికి సముద్రాన్ని దృష్టాంతంగా శ్రీ వాల్మీకి మహర్షి పలికారు ఆ విధంగానే శ్రీరామానుజుల శ్రీ సూక్తి "ఆవిస్తృతాః సుగంభీరాః రామానుజ మునేః గిరః "అనే విధంగా అత్యంత గంభీరంగా ప్రకాశిస్తుంది.

శ్రీ రామానుజుల శ్రీ సూక్తులు ఒక్కొక్కటినీ మనం ఈ రీతిలో గమనించి పరిశీలించి అనుభవంలోకి తెచ్చుకోవాలి. పైన తెలిపిన గ్రంథాలు ఈ రీతిలో మనకు పరమ ప్రయోజనకరంగా గ్రహించదగినవి అవుతున్నవి. ఇక్కడ ఈ గ్రంథాలను అనుగ్రహించిన పెద్దలు అందరూ వేద మార్గాన్ని తప్పకుండా, అందులో స్థిరంగా నిలచి, వైదిక ప్రక్రియను, శ్రీభాష్యాది గ్రంథాలలో చూపబడిన అర్థ విశేషాలను గ్రహించడంలో, కాలక్రమంలో మనవంటివారికి కలిగే కొరతలను మనసులో పెట్టుకొని, "మన స్వామి శ్రీరామానుజుల శ్రీసూక్తుల సారస్యాన్ని, రసానుభవాన్ని వీరు కోల్పోకూడదు "అనే అభిప్రాయంతోనే ఈ అర్థ విశేషాలను గ్రహించి, మనం కూడా ఆత్మ క్షేమాన్ని పొంది ఉజ్జీవించాలి– అనే అభిప్రాయంతోను పరమ కారుణికులైన ఈ ఆచార్యులు ఈ గ్రంథాలను అనుగ్రహించారు. అందుచేత ఈ గ్రంథాలు మనకోసమే అవతరించినదవి అనే ఈ వాస్తవాన్ని మనం మనసులో పెట్టుకుని, యథాశక్తి ఈ గ్రంథాలను అనుభవంలోకి తెచ్చుకోవాలి. ఈ మహాచార్యుల శ్రీ చరణ బలంచేత, వారి ఆశీర్వాద, అనుగ్రహ బలంచేత మనం ఆత్మ క్షేమాన్ని పొందడం వీలవుతుంది.

## 9) శ్రీ శంకరాచార్యులవారు– భగవద్రామానుజులు

బ్రహ్మసూత్రభాష్యారంభంలో ఆది శంకరాచార్యులవారు అద్వైతమే సూత్ర, ప్రస్థానాల పరమతాత్పర్యం –అని అధ్యాస భాష్యాన్ని రచించారు. అయితే, మన స్వామి భగవద్రామానుజులు శ్రీ భాష్య ఆరంభంలో వేదవ్యాస శిష్యులైన బోధాయనుల వృత్తి గ్రంథంలో ఉండే అర్థాలను, పూర్వాచార్యులు సంగ్రహంగా చూపిన దారిలో(వారి మతాన్ని అనుసరించి) సూత్రాక్షరాలు వర్ణింపబడుతున్నాయి– అని మొదటి పంక్తిలో

అనుగ్రహించారు. " అఖిల భువన జన్మ "అనే ఆరంభం అయ్యే మంగళ శ్లోకంలో తాము విశదీకరించబోయే సకలార్థాలను ఆశ్చర్యకరంగా సంగ్రహించి పలికారు. ఆ శ్లోకంలో ఉండే "శేముషీ భక్తిరూపా"అనే పదాలతో ఆళ్వారుల "మదినలమ్"(భక్తిరూపమైన జ్ఞానాన్ని) పలికారు. "తత్త్వమేకో మహాయోగీ హరిః నారాయణః పరః" " "ధ్యేయో నారాయణః సదా" అని చెప్పబడిన విషయాన్ని "సర్వశ్రుతిష్వనుగతమ్" అనే గొప్పతనాన్ని కలిగినదైన పురుష సూక్తంలోనూ, శ్రుత్యర్థ స్మారకమైన భగవద్గీతలోనూ చేర్చి, అర్థ ఘటనం చేశారు. వేదాంతం పలికిన శేముషీ అనేది, గీత చెప్పిన భక్తి అనేది చేరితే "భక్తిరూపాపన్న జ్ఞానం "అవుతుంది. జ్ఞాన దర్శన ప్రాప్తులకు భక్తి ఉపాయం అనేది శాస్త్రసిద్ధం. " తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథా విద్యతే", " తమేవ విదిత్వా" అని మొదలైన ఉపనిషద్వాక్యాలలో చెప్పబడిన జ్ఞానానికి, " భక్త్యా తు అనన్యయా శక్యః" అని గీతావాక్యంలో చెప్పబడిన భక్తికి సమన్వయసామంజస్యాలను చూపే దారిలోని శ్రీరామానుజుల శ్రీసూక్తులు హృదయంగమాలుగాను, చలచిత్తవృత్తి వినివర్తనౌషధాలుగాను అవతరించాయి.

శంకరులు తమ భాష్యారంభంలోనే "బ్రహ్మ సత్యం, జగత్ మిథ్య" అనే తమ సిద్ధాంతమైన అద్వైతాన్ని తెలియజేశారు. బ్రహ్మం ఒక్కటే సత్యమైనది, మిగిలినది అంతా అసత్యమే– అనే తమ అభిప్రాయాన్ని సిద్ధాంతీకరణం చేసి, "దీనికి అనుగుణంగా సూత్రార్థాలను నేను తెలియజేస్తాను, ఇదే సూత్రకారులు అనుగ్రహించారు– అని చూపుతాను" అని ఆరంభించారు. అద్వైతమే వేదాంత సిద్ధాంతం అని తమ మేధావిలాసంతో శంకరులు వివరించి చెప్పడమే తప్ప, అది వేదవ్యాస కృత్రుతమైన శారీరకంలో చెప్పబడిందా? అని అంటే, "చెప్పబడలేదు" అని పలు విధాలుగా నిరూపిస్తున్నారు, మన స్వామి అయిన భగవద్రామానుజులు. "సూత్రకారులు సూత్రంలో ఏ అర్థాన్ని నిరూపణ చేసి పలికారో, దానిని నేను చెబుతున్నాను"– అని ప్రతిజ్ఞ

చేస్తున్నారు, భగవద్రామాను లు. తాము చెప్పేది సూత్రంలో ఉన్నది అని అంటున్నారు, శంకరులు. సూత్రంలో ఉన్న దానిని నేను యథాతథంగా చెబుతున్నాను– అని అంటున్నారు, రామానుజులు. బ్రహ్మసూత్ర గ్రంథంలోని నాలుగు అధ్యాయంలోనూ, వాటిలో అంతర్భవించి ఉండే 16 అధ్యాయాలలోనూ, వాటిలో అంతర్భవించి ఉండే 156 అధికరణాలలోనూ, వాటిలో అంతర్భవించి ఉండే 545 సూత్రాలలోనూ శ్రీవేదవ్యాసులు దేనిని నిరూపించారు? అని అంటే, " దర్శనం భేద ఏవ"అనే సిద్ధాంతాన్నే అనే సత్యాన్ని భగవద్రామానుజులు శ్రీ భాష్యాది గ్రంథాలలో విస్తృతంగా నిరూపించడానన్ని మన దర్శించవచ్చు. "అద్వైతమే వేదాంత సిద్ధాంతం "అనేదానికి అనుగుణంగా ఒక సూత్రం కూడా బ్రహ్మసూత్రాలలో గోచరించదు.

భగవద్రామానుజులు శిభాష్యంలో అద్వైత మతాచార్యులు చెప్పేది సరికాదు అని కొన్ని అధికరణాలలో స్పష్టంగా పలుకడం మనం గమనించవచ్చు. అయితే ఈ విధంగా తప్పకుండా అన్ని అధికరణాలలోనూ శ్రీరామానుజులు స్పష్టంగా చెప్పలేదు. కాని, శ్రీశ్రుతప్రకాశికాభట్టర్ మాత్రం ఒక్క అధికరణాన్ని కూడా విడువకుండా అన్ని అధికరణాలలో చివరిలో "అన్యే, ఇతరే"అని ఈ విధంగా శబ్ద ప్రయోగాన్ని చేశార్.ఈ సూత్రాలకు శంకరులు ఈ విధంగా వ్యాఖ్యానం చేశారు, యాదవ ప్రకాసులు ఈ విధంగా వ్యాఖ్యానం చేశారు, భాస్కరాచార్యులు ఈ విధంగా వ్యాఖ్యానం చేశారు– అని తప్పకుండా సూచించి, "ఇవి అన్ని సరికాదు, ఇవి సూత్రకారుల అభిప్రాయానికి అనుగుణమైన రీతిలో లేనే లేవు" అనే విషయాన్ని ఒక్కొక్క అధికరణం చివరలో నిరూపించారు. ఈ విధంగా శంకర భాస్కర యాదవ ప్రకాశ మతాలు మూడింటిని ప్రస్తావించి, ఆయా మతాలలో ఈ బ్రహ్మ సూత్రాలకు రచించిన వ్యాఖ్యానాలు వృత్తి గ్రంథానికి, పూర్వోత్తర సూత్రాలకు, వేదాంతవాక్యాలకు అనుగుణం కావు అని నిరూపించారు.

ఈ విధంగా శ్రుతప్రకాశికాచార్యులవారు అనుగ్రహించిన శ్రుత ప్రకాశిక అనే శీభాష్య వివరణ గ్రంథం రెండు విధాలుగా ఏర్పడి ఉండడం మనం గమనించవచ్చు. బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్యం అనుగ్రహించిన మన స్వామి భగవద్రామానుజుల మనోభిప్రాయాన్ని వివరించి, ఇదే వేదాంతవాక్యాలకు, బ్రహ్మసూత్రాలకు, వృత్తి గ్రంథానికి అనుగుణమైన వ్యాఖ్యానం అని నిరూపించడం ఒకటి, ఈ బ్రహ్మ సూత్రాలకు మిగిలినవారు చేసిన వ్యాఖ్యానాలు కొంచెం కూడా అనుగుణం అయిన రీతిలో లేవు అని నిరూపించడం రెండు— అనే ఈ క్రమంలోనే 156 అధికరణ వ్యాఖ్యానాలలోనూ శ్రుత ప్రకాశిక ఏర్పడి ఉన్నది. ఏ తత్వార్థాన్ని, సిద్ధాంతాన్ని నిరూపణం చేసినా, అది శ్రుతివాక్యాలకు అన్నిటికి వ్యతిరేకంగా లేనిదిగా, దానిని అది వేదతాత్పర్య మర్యాదకు అనుగుణమై ఉన్నదిగా నిష్కర్షించే రీతిలో ఉన్నదిగా ఉండాలి. ఇదే వైదికులు పోయే దారి. ఈ దారిని చక్కని రీతిలో, మన పూర్వాచార్యులు చూపించిన విధంలో, మనకు చక్కగా మలచి అనుగ్రహిస్తున్నారు, మన స్వామి భగవద్రామానుజులు.

" ఆర్షం ధర్మోపదేశం చ వేద శాస్త్రావిరోధినా, యస్తర్కేనణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (మనుస్మృతి–12–106) శృతి స్మృతులకు విరోధం లేకుండా తర్కంతో ఎవడు అర్థాన్ని గ్రహిస్తాడో, అతడే ధర్మాన్ని తెలిసినవాడు, లేనివాడు ధర్మం తెలియనివాడే) అనే విధంగా వేదవిరోధం లేని చక్కని తర్కాలతో అలంకరింపబడిన గొప్ప ప్రమాణాలతో వేద వేదాంతాల యథార్థాన్ని నిర్ణయించాలి –అనే నియతికి తగినట్లు శ్రీ భాష్యాన్ని అనుగ్రహించినవారు మన స్వామి భగవద్రామానుజులు. శ్రుతిస్మృతిహాస పురాణాలు, బ్రహ్మ సూత్రాలు, శ్రీమద్భగవద్గీత, పాంచరాత్ర శాస్త్రం, అళ్వారుల దివ్య సూక్తులు, పూర్వాచార్యుల శ్రీ సూక్తులు అనే ప్రమాణాలలో సంచారం చేసి, వీటి అర్థ విశేషాలను న్యాయ మార్గాల ద్వారా మంచి తర్కాలతో, అంటే, వేద

విరోధం లేని తర్కాలతో, నిర్ణయించి, వీటిని వల్ల స్పష్టమయ్యే తాత్పర్యార్థాలను వ్యక్తం చేసి, ఇవి పరమ వైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంతానికి పూర్తిగా అనుగుణంగా ఉన్నవి—అని నిరూపించారు, మన స్వామి భగవద్రామానుజులు.

ఈ సందర్భంలో ఒక ముఖ్యమైన విషయాన్ని గూర్చి కొంచెం విజ్ఞాపన చేస్తాను. అది ఏమంటే, వేదాంతం ఏమి చెబుతున్నదో, దానిని మనం యథాతథంగా తెలుసుకొని ఒప్పుకోవాలి తప్ప, మన సౌకర్యం కోసం ఒక విషయాన్ని కానీ, వస్తువుని కానీ మనం ఉన్నది, లేదు అని చెప్పడం సాధ్యం కాదు. మన సంప్రదాయంలో మనం అన్ని వేద భాగాలకు పూర్ణమైన ప్రామాణికత్వాన్ని ఒప్పుకున్నాము. అద్వైతులు పూర్వభాగానికి అంత ప్రామాణికత్వాన్ని ఒప్పుకోలేదు. ఉత్తరాభాగానికి ప్రామాణికత్వాన్ని ఒప్పుకున్నారు. అందులో కూడా, అన్ని వేదాంతవాక్యాలకు ప్రామాణికత్వాన్ని అంగీకరించలేదు. మహా వాక్యాలు అని కొన్ని వాక్యాలనే వారు ముఖ్యంగా లెక్కించారు. ఘటక శ్రుతులకు, భేదశ్రుతులకు ప్రామాణికత్వాన్ని వారు అంగీకరించలేదు. ఈ విధంగా వేదంలో కొన్ని వాక్యాలకు ప్రామాణికత్వాన్ని ఒప్పుకోవడం, మరి కొన్ని వాక్యాలను అవి ప్రామాణికాలు కావు అని పక్కకు గెంటి వేయడం అనేది వైదికులైనవారికి సరైన క్రమం కాదు.

మన సంప్రదాయంలో మనం అన్ని వేదవాక్యాలకు మూలప్రామాణికత్వాన్ని ఒప్పుకుంటున్నాము. విధివాక్యాలు అంటే వాటికి కూడా ప్రామాణికత్వం ఉన్నది. అందుచేత అన్ని శ్రుతి వాక్యాలను ముందుకు వెనుకకు విరుద్ధంగా లేకుండా వాటిని ఏ విధంగా నయనం చేయాలో ఆ విధంగా నయనం చేసి, వాటిని సమన్వయం చేసి, వేదతాత్పర్యార్థాన్ని నిర్ణయించాలి తప్ప, మనం ఒక సిద్ధాంతాన్ని మనసులో పెట్టుకొని, దానికి అనుగుణంగా తోచే కొన్ని వేదవాక్యాలను ప్రమాణాలుగా గ్రహించడం, దానికి విరోధంగా తోచే మరి కొన్ని వేదవాక్యాలను అవి ప్రామాణికాలు కావు అని

తిరస్కరించడం కూడదు. ఈ విధంగా చేయడానికి ఏ వైదికులకు అధికారం లేదు. వేద వాక్యాలను అన్నిటిని సమన్వయం చేసి, వేద తాత్పర్యార్థాన్ని నిర్ణయం చేయడమే వైదికులైనవారికి, ముఖ్యంగా, వైదికమతాచార్యుల బాధ్యత అవుతున్నది. ఈ క్రమాన్ని కొంచెం కూడా తప్పకుండా అనుసరించినవారు, మన పూర్వాచార్యులు.

## 10) అద్వైతం –విశిష్టాద్వైతం

**అ**ద్వైత సిద్ధాంతంలో నామరూప గుణాలు లేని శుద్ధ వస్తువైన బ్రహ్మం ఒక్కటే సత్యం అని, ఉన్నవి అని తోచే (కంటితో చూడబడే) మండప ప్రాకార గోపుర మనుష్యాది సకల పదార్థాలు అవిద్యాపరికల్పితాలు, మిథ్యాపదార్థాలు అని చెప్పబడుతున్నది. అంటే, ఇవి అన్నీ అవిద్య అనబడే మాయా సంబంధం చేత బ్రహ్మకు ఏర్పడిన భ్రమలు. బ్రహ్మకు కలిగిన అవిద్య ఆత్మజ్ఞానం చేత తీరి, బ్రహ్మకు మోక్షం కలుగుతున్నది. –అని ఆ మతంలో చెప్పబడుతున్నది. వీరి పక్షంలో బ్రహ్మం నిర్గుణం, అశరీరం, విభూతి శూన్యం, నిర్విశేషం, అవేద్యం, అవాచ్యం అని ఈ విధంగా చెప్పబడుతున్నది.

విశిష్టాద్వైతులు– భగవంతుడే బ్రహ్మ శబ్ద వాచ్యుడని, సమస్త కళ్యాణ గుణాలతో కూడినవాడని, దోషలేశం కూడా లేనివాడని, శ్రియః పతి అ, ని దోషం కల జీవుని దోషాన్ని తన కృప చేతకు పోగొట్టేవాడని, అతడు ఆత్మ, మిగిలిన సమస్త చేతన చేతనాలు అతనికి శరీరమని, అతడు శేషి, మిగిలినవి అన్నీ అతనికి శేషం అని, చిత్త, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు తత్వాలు, సత్యమే అని అభిప్రాయపడుతున్నారు. వీరి మతంలో బ్రహ్మం సవిశేషం. అంటే, బ్రహ్మం సకల విశేష విశిష్టం. బ్రహ్మ శబ్దవాచ్యుడైన భగవానుడు సత్య జ్ఞ్యానానందాది సమస్త కళ్యాణ గుణాలతో కూడిన పురుషోత్తముడు. అతడు భక్తి చేత పొందడానికి సాధ్యమైనవాడు. అతని కృపచేత ముముక్షువు మోక్షాన్ని పొందుతున్నాడు.

మన సంప్రదాయాన్ని అనుసరించి యతులకు శిఖ ఉన్నది. యజ్ఞోపవీతం ఉన్నది, కటి సూత్రం ఉన్నది, ఇప్పుడు శ్రీ పెరుంబూరు దివ్యదేశంలో స్వామి భగవద్రామానుజులను అర్చామూర్తిగా మనం సేవిస్తున్నాము. ఎంత అందమైన శిఖతో మనకు ఆ రూపం దర్శనాన్ని అనుగ్రహిస్తున్నది! అద్వైత సంప్రదాయంలో యతులకు ఇవి ఏమి ఉండవు. బ్రహ్మసూత్రం లేని వారు ఏ విధంగా బ్రహ్మసూత్ర వ్యాఖ్యానం చేయడానికి సిద్ధపడ్డారు? అని ఒక పెద్దలు వినోదంగా అడిగారు. వీరు తమను వపనం చేసుకోవడంలో ఆశ్చర్యం లేదు, కాని, వీరు బ్రహ్మనే వపనం చేశారుకదా! అని అంటున్నారు, వారు. బ్రహ్మకు విగ్రహం లేదు, గుణాలు లేవు, విభూతి లేదు, లక్ష్మీదేవి లేదు— అని ఈ విధంగా అబద్ధవాదాలను చేసే వీరు మతంలో బ్రహ్మం శుద్ధం, నిర్విశేషం అని అనబడుతున్నది. సవిశేష (విశిష్ట) బ్రహ్మమే వేదాంతంలో చెప్పబడుతున్నది అనేది మన మతం. "వేదాంతంలో బ్రహ్మకు గుణాలు నాయని చెప్పబడినది కదా చెప్పబడినదికదా! " అని శంకరులను చూచి అడిగేవారికి వారు ఏమి పలుకుతున్నారు? అంటే, గుణాలు లేవు అని చెప్పడంకోసం "గుణం ఉన్నది అని వేదాంతం చెబుతున్నది" అని అంటున్నారు. వేదాంతంలో సగుణ వాక్యం పూర్వ వాక్యంగా ఏర్పడి ఉన్నది. నిర్గుణ వాక్యం ఉత్తర వాక్యంగా ఉన్నది. అపచ్ఛేదన్యాయాన్ని అనుసరించి పూర్వ వాక్యం దుర్బలం, ఉత్తర వాక్యం ప్రబలం అనేది శాంకర మతం. విధివాక్యం ముందు, నిషేధవాక్యం తరువాత అనేది అద్వైతుల వాదం. ఇక్కడ అపచేదన్యాయానికి ప్రసక్తి లేదు —అని నిరూపిస్తున్నారు, మన స్వామి భగవద్రామానుజులు.

వేదాంతదేశికులు శతదూషణి అనే వాదగ్రంథాన్ని అనుగ్రహించారు. నూరు వాదాలు కలిగిన నూరు దూషణాలు పరమతాలను గూర్చి ఇందులో నిరూపింపబడ్డాయి అద్వైతుల వంటి కుదృష్టుల వాక్యాలను ఖండించేదై ఉండే ఈ గ్రంథంలో ఇప్పుడు మనకు

దొరికేది కేవలం 66 వాదాలు మాత్రమే. వీటికి మించి ఉండే 34 వాదాల గ్రంథభాగం లోపించిపోయింది. ఇందులో 66వ వాదం మనం అందరూ తెలుసుకోవలసినది, అనుభవించవలసినది. దీనికి "పరమతే సూత్ర స్వారస్య భంగవాదః "అని పేరు. ఇందులో, శారీరక మీమాంసలో ఒక్కొక్క సూత్రం, ఒక్కొక్క అధికరణం, ఒక్కొక్క పాదం, ఒక్కొక్క అధ్యాయం పరమతాలవారికి ఎంత మాత్రం అనుగుణంగా లేవు– అని, ఇవి అన్నీ అనుగుణంగా ఉండడం భగవద్రామానుజుల శ్రీభాష్యాది గ్రంథాలకే అని చాలా ఆశ్చర్యకరంగా నిరూపించారు, వేదాంత దేశికులు. దీనికి మించి ఏమి చెప్పవచ్చు? అని చూశారు. కుదృష్టుల వాదాలు అన్నీ శారీరక శాస్త్రంలో ఐదవ అధ్యాయానికి పొసగుతాయి అని పలికి, వాదాన్ని పూర్తి చేశారు. శారీరక శాస్త్రంలో ఐదవ అధ్యాయం అనేది ఏదీ లేదు. అందుచేత బ్రహ్మసూత్ర ప్రబంధంలోని తాత్పర్యార్థాలకు బాహ్యమైనవి, ఈ కుదృష్టివాదాలు– అని చాలా సరసంగా, రసగనంగా వారు చెప్పినట్లయినది.

నాలుగు అధ్యాయాలను కలిగిన ఈ శారీరక శాస్త్రంలో చెప్పబడి అర్థం ఏమి? అంటే, జగత్తుకు అంతటికి కారణం బ్రహ్మం. ఆ బ్రహ్మను ఉపాసనను చేస్తున్నాడు, సంసారి జీవాత్మ. అతడు బ్రహ్మం యొక్క కళ్యాణ గుణాలను ఉపాసిస్తున్నాడు. తరువాత ఆ భగవంతుని కృప చేత ప్రాకృత శరీరాన్ని విడచిపెట్టి బయలుదేరి, ఇంకొక సూక్ష్మ శరీరంతో అర్చిరాది మార్గంలో విరజానదిని సమీపించి, అందులో స్నానం చేసి, సూక్ష్మ శరీరాన్ని తొలగించుకొని, అప్రాకృతమైన శరీ రాన్ని పరిగ్రహించి, 500 మంది అప్సరస స్త్రీలు వచ్చి ఇతనికి విశేష అలంకారాలను చేయగా, తరువాత పరమపదాన్ని చేరి, వేయి కాళ్ళ మండపాన్ని ప్రవేశించి, అక్కడ వేంచేసి ఉండే పరమపదనాధుని ఒడిలో కూర్చొని, బ్రహ్మనందాన్ని అనుభవించి, ఆ అనుభవం వల్ల కలిగిన ప్రీతి ప్రేరేపించగా సమస్తకైంకర్యాలు దివ్య దంపతుల సమక్ష సమక్షంలో సిద్ధించగా, చేసి ఆనందిస్తున్నాడు.

అక్కడనుండి ఎప్పటికీ ఈ సంసార మండలం లోపలకు తిరిగి రానే రాడు— అని పలికి తమ బ్రహ్మసూత్ర ప్రబంధాన్ని పూర్తి చేశారు, శ్రీ వేదవ్యాసులు.

అందుచేత, గుణాలు లేకుండా, విభూతి లేకుండా, దివ్య మంగళ విగ్రహం లేకుండా, లక్ష్మీదేవి లేకుండా, అన్నిటినీ విడచి పెట్టి ఒక్కడు మాత్రమే ఉండే ఏమీ లేని దరిద్రుడైన ఒక బ్రహ్మం అనేది ఎక్కడ ఉన్నది? అంటే, శారీరకంలో ఐదవ అధ్యాయంలోనే —అని చెప్పడం ద్వారా ఇటువంటి ఒక తత్వం శాస్త్రాలకు బాహ్యమైనది అని అంటున్నారు దేశికులు.

ఇక మన స్వామి భగవద్రామానులు శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలలో సారంగా చూపిన పరమ వైదికమైనది, అనాది అయినది అయిన ఈ విశిష్టాద్వైత సిద్ధాంతంలోని తత్వాలలో కొన్నిటిని ముందుగా అనుభవంలోకి గ్రహించడం ద్వారా, ఈ సిద్ధాంతానికే సూత్రానుగుణ్యం ఉన్నది అనే విషయం విస్తృతంగా నిరూపింపబడుతుంది.

**11) కాండత్రయాత్మకమైన మీమాంసాశాస్త్రం ఒకే శాస్త్రం అనే విషయం**

మీమాంసా అంటే విచారం అని అర్థం. ఆనందమయుడైన, ఆనందప్రకారుడైన భగవంతుని ఆనందాన్ని గూర్చి విచారించేది ఆనందమీమాంసా అనబడుతుంది. " సైషానందస్య మీమాంసా భవతి " అని ఆనందమీమాంస వేదాంతంలో ప్రసక్తమైనది. ఆ విధంగానే బ్రహ్మాన్ని గూర్చిన, అంటే, పరతత్వాన్ని గూర్చిన విచారం బ్రహ్మమీమాంసా అనబడుతుంది. మీమాంసా శాస్త్రాన్ని కాండ త్రయాత్మకంగా వర్ణించారు, మన పూర్వాచార్యులు. అంటే, అది కర్మకాండ అని, దేవతాకాండ అని, బ్రహ్మకాండ అని మూడు కాండలు ఇందులో ఉన్నాయి. శ్రీవేదవ్యాసమహర్షి శిష్యులు అయిన జైమిని 16 అధ్యాయాలను కల మీమాంసా శాస్త్రాన్ని రచించారు. అది పూర్వ మీమాంస అని, కర్మమీమాంస అని అనబడుతుంది. కర్మకాండలోని వేదార్థాలను అందులో

జైమినిమహర్షి వివరించారు. వేదవాక్యాలను యథార్థమైన ప్రమాణాలుగా గృహించి, ఆ వేదవాక్యాలకు అర్థ నిర్ణయం చేసే రీతిలో రచింపబడింది, ఈ కర్మకాండ మీమాంస అనబడే వేదార్థ విచార గ్రంథం.

మొదటి 12 అధ్యాయాలలో జ్యోతిష్టోమాది కర్మలను గూర్చి విచారించి, తరువాత కల నాలుగు అధ్యాయాలలో ఆ కర్మల చేత ఆరాధింపబడే దేవతలనుగూర్చి విచారించారు. తరువాత 4 అధ్యాయాలతో వేదవ్యాసులు బ్రహ్మ విచారం చేశారు. ఇదే ఉత్తర మీమాంస అని, బ్రహ్మ మీమాంస అని అనబడుతున్నది. జైమిని 12 అధ్యాయాలలో ఏ కర్మలను గూర్చి విచారణ చేశారో, ఆ కర్మలకు ఆరాధ్యులై ఉండే ఏ దేవతలను గూర్చి తరువాత నాలుగు అధ్యాయాలలో విచారించారో, ఆ దేవతలకు అంతర్యామిగా ఉండే బ్రహ్మనుగూర్చి నాలుగు అధ్యాయాల ద్వారా శ్రీవేద వ్యాసమహర్షి విచారించి, అర్థ నిష్కర్షను చేశారు.

ఈ విధంగా అన్ని కర్మల చేత ఆరాధింపదగినది, అందరు దేవతలకు అంతరాత్మయై ఉండేది అయిన పరం బ్రహ్మ వేదాంత వేద్యం –అనేదే వేదవ్యాస సిద్ధాంతమై ఉన్నది. అందుచేత "అథాతో ధర్మ జిజ్ఞాసా" అని ఆరంభించి, "అణనావృత్తిః శబ్దాత్, అనావృత్తిః శబ్దాత్" అనే పర్యంతం ఉండే 20 అధ్యాయాల మీమాంసా శాస్త్రం ఒకే శాస్త్రం అని ఏర్పడుతున్నది.

పూర్వోత్తర మీమాంసలు రెండు కలసి ఒకే శాస్త్రం అనేది మన పెద్దలు గ్రహించిన క్రమం అనే ఈ విషయాన్ని కొంచెం వివరిస్తాను. సంహితం ఏతత్ శారీరకం జైమినీయేన షోడశలక్షణేనేతి శాస్త్రైకత్వసిద్ధిః" అని వృత్తికారులైన బోధాయనులు పలికారు. " అంగాని వేదాః చత్వారో మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా

హ్యేతాః చతుర్దశ” అని 14 విద్యా స్థానాలను చెప్పేటప్పుడు “మీమాంసా” అని ఏకవచన ప్రయోగం చేత మీమాంసాశాస్త్రం అంతా ఒకటే అని చెప్పబడింది. వేదత్వం నాలుగు వేదాలకు అవిశిష్టమై ఉన్నప్పటికీ, వేదాలను నాలుగు విద్యా స్థానాలుగా విభజించి చెప్పినదే! పురాణాలు, ధర్మశాస్త్రాలు, వేదోప బృంహణాలుగా ఉన్నప్పటికీ, “పురాణం ధర్మశాస్త్రం చ” అని రెండు విద్యాస్థానాలుగా విభజించి చెప్పబడిందే! ఆ విధంగా కర్మ మీమాంస, దేవతా మీమాంస, బ్రహ్మ మీమాంస అని మీమాంసలు మూడు అని చెప్పకుండా, “ మీమాంసా” అని ఒకే పదంతో ఈ మూడిటిని చెప్పినప్పటికీ, ఈ మూడు ప్రత్యేకంగా మూడు శాస్త్రాలుగానే ఎందుకు గ్రహించకూడదు? అని అంటే, అనాది సిద్ధ వ్యవహారంచేత గ్రహించకూడదు. అంటే, వేదాలు నాలుగు అని, పురాణా ధర్మశాస్త్రం అని విభజించి కలిపి, చేసే వ్యవహారం చేత, అటువంటి వ్యవహారం కుదురుతుంది కానీ, మీమాంస ఈ విధంగా ఎక్కడా కూడా ఎవరి చేత మూడు మీమాంస శాస్త్రాలు అని విభజించి చెప్పబడనందున ఈ విధంగా వేరుగా వ్యవహరించకూడదు. అంతటా ప్రయోగాలు కనబడుతున్నవి.

కర్తృభేదం వల్ల శాస్త్రభేదం సిద్ధించదు అనే విషయాన్ని కూడా పలు ఉదాహరణలతో మనం తెలియవచ్చు. ఆపస్తంబ సూత్ర వ్యాఖ్యానాన్ని ధూర్త స్వామి, కపర్ది అనే ఇద్దరు చేసినప్పటికీని, వ్యాఖ్యానింపబడిన (మూలమైన)ఆపస్తంబసూత్ర గ్రంథం ఒకటే కనుక, అది ఒకటే శాస్త్రం అని చెబుతున్నాము. వామనులు, జయాదిత్యులు అనే ఇద్దరు పాణిని సూత్రాలకు పూర్వోత్తర వృత్తి గ్రంథాలను అనుగ్రహించినప్పటికీని, వ్యాఖ్యేయైక్యం చేత శాస్త్రైక్యం గ్రహింపబడుతున్నది. మనుస్మృతి మనువు చేత ఆరంభింపబడి, భృగువుచే పూర్తి చేయబడినది అయినా, శాస్త్రభేదాన్ని గ్రహించకుండా, శాస్త్రైక్యాన్ని గ్రహిస్తున్నాము. భోజరాజు, లక్ష్మణ సూరి అనే ఇద్దరిచే రచింపబడిన చంపూ రామాయణం ఒకటే గ్రంథం అనే

గ్రహింపబడుతున్నది. ఛాందోగ్యంలో ఉపకోసల విద్యాప్రకరణంలో ఉపదేష్టలు వేరువేరుగా ఉన్నా, విద్యకు భేదం గ్రహించడం లేదు. ఆ విధంగానే ఇక్కడ కూడా, జైమిని, కాశకృత్స్నులు, వేదవ్యాసులు అనే కర్తృభేదం ఉన్నప్పటికీ, శాస్త్రభేదం లేదు, ఒకే శాస్త్రం అనే గ్రహించాలి. కర్మ, దేవత, వేదార్థం, బ్రహ్మం అంతా వేదాంతార్థమే.

ఈ విధంగా మూడు కాండలుగా మీమాంసా శాస్త్రం ఉన్నప్పటికీ, కర్మ విచారమైనా, దేవతా విచారమైనా, బ్రహ్మవిచారమైనా, ఇవి మూడు మూడు విషయాలను గూర్చి, అంటే, కర్మ మీమాంసకు కర్మం, దేవతా మీమాంసకు దేవతలు, బ్రహ్మమీమాంసకు బ్రహ్మం విషయాలు కనుక, ఈ మీమాంసలకు విషయభేదంచేత భేదాన్ని చెప్పవచ్చు కదా! అని అంటే, వీటిచే చెప్పబడుతున్న అర్థం ఏకార్థం అని, ఐకార్థ్యాన్ని ఒప్పుకొని అర్థైకత్వాత్ ఏకం వాక్యం, సాకాంక్షం చేత్" అనే పూర్వ మీమాంసా సూత్రానుసారంగా ఏకార్థప్రతిపాదకం కనుక, ఒకే శాస్త్రం అని చెప్పబడుతున్నది. కర్మకాండలో చెప్పబడిన కర్మలు పరమాత్మ ఆరాధనలు. దేవతాకాండలో చెప్పబడిన దేవతలు పరమాత్మకు శరీరభూతులు. బ్రహ్మ కాండంలో చెప్పబడిన బ్రహ్మం సర్వకర్మ సమారాధ్యమైన సర్వదేవతాంతర్యామిభూతమైన బ్రహ్మం, నారాయణ శబ్దవాచ్యం అవుతున్నది { ఒకే అర్థం మూడు మీమాంసల సారంగా ఏర్పడుతున్నది కనుక, ఇది ఒకటే శాస్త్రం అవుతున్నది. పూర్వకాండలో ప్రతిపాదింపబడిన కర్మలు ఆరాధనా రూపాలు. వాటికి ఆరాధ్య వస్తువు ఏది? అనే ఆకాంక్షకు శాంతి ఉత్తరకాండమైన ఉపనిషత్తుల చేత కలుగుతుంది. బ్రహ్మం ఆరాధ్యం, దీనికి ఆరాధన ఏది? అనే ఆకాంక్షను ఉపశమింప జేస్తున్నది, పూర్వకాండం అనే వేదం. అందుచేత, ఆరాధన విశిష్టారాధ్యుడు బ్రహ్మశబ్దవాచుడైన నారాయణుడే– అనే ఒకే అర్థం పూర్వోత్తర భేదభిన్నవేదార్థమై విలసిల్లుతున్నది. ఈ వేద వేదాంతలనే వ్యాఖ్యేయాలకు ఉండే పౌర్వాపర్యం, ఐక్యం వాటి వ్యాఖ్యానాలకు కూడా పొసగుతుంది– అనేదే శ్రీభాష్యసారం.

సకల వేదవేద్యత్వం, సర్వధర్మ ప్రవర్తకత్వం, సర్వదేవతాంతరాత్మతయా సర్వకర్మ సమారాధనీయత్వం, సర్వధర్మఫలప్రదత్వం– అనే ఈ నాలుగు పరమాత్మ లక్షణాలు. ఇవే మూడు కాండలలోని సారంగా భాసిస్తున్నవి. అంతటా విచారింపబడేవాడు పరమాత్మయే. కర్మకాండలో ధర్మంగాను, దేవతాకాండలో దేవతాశరీరకుడుగాను, బ్రహ్మకాండలో దేవత అనే కంచుకాననని, తీసివేసి, సాక్షాత్తు పరమాత్మ గాను విచారింపబడేవాడు అతడే– అని అంటారు, మన పెద్దలు. ధర్మే ప్రమీయమాణేన వేదేన కరణాత్మనా, ఇతికర్తవ్యతాభాగం మీమాంసా పూర్వమిష్యతి" అనే సూక్తి ఇక్కడ అనుసంధేయం. కాష్ఠాన్ని రెండుగా విభజించడానికి గొడ్డలి ఆవశ్యకం అయినా, దానిని మోసి, ఆ కట్టెపై దానిని పెట్టి కొట్టాలి కదా. ఆ కట్టెను రెండు ఖండాలుగా కావడానికి కారణం గొడ్డలి. దానిని మోసి, ఆ కట్టెపై కొట్టడం ఇక్కడ అంగం అవుతున్నది. ఇతికర్తవ్యత అనేది, అంగం అనేది పర్యాయపదాలు. ఆ విధంగానే, కర్మజ్ఞానానికి వేదం కరణం. వేదార్థవిచారమైన మీమాంసాశాస్త్రం ఇతికర్తవ్యత అవుతున్నది. ఇది లేకుండా వేదం ధర్మ ప్రమాణం కాబోదు అని భావం. కర్మప్రకారార్థ నిర్ణయం కర్మమీమాంసవల్ల కలుగుతుంది. దేవతా ప్రకారార్థ నిర్ణయం దేవతామీమాంస వల్ల కలుగుతుంది. బ్రహ్మప్రకారార్థ నిర్ణయం బ్రహ్మమీమాంస వల్ల కలుగుతుంది. అని అర్థం.

1)ఈ విధంగా విషయైక్యాన్ని గ్రహించి, ప్రయోజనైక్యాన్ని గ్రహించి, ప్రవృత్తిప్రకారైక్యాన్ని గ్రహించి ఇవి మూడు ఒకే శాస్త్రం అనేది మనపూర్వాచార్యులు విస్తృతంగా నిరూపించారు.

2) పూర్వకాండంలో చెప్పబడిన కర్మలు అనే అంగాలకు అంగి ఏది? అనే ఆకాంక్షను ఉత్తరకాండం, ఉత్తరకాండలో చెప్పబడిన జ్ఞానమనే అంగికి అంగం ఏది? అనే ఆకాంక్షను పూర్వకాండం తీరుస్తున్నందున, కర్మాంగకమైన జ్ఞానమే ఉపాయం అనే ఒకే అర్థాన్ని తెలుపుతున్నందున ఒకే శాస్త్రం అని చెప్పవచ్చు అని అంటారు,

ఐకశాస్త్రావాదులైన మన పూర్వాచార్యులు. కర్మజ్ఞానాలకు అంగాంగిభావంతో సముచ్చయాన్ని మన స్వామి భగవద్రామానుగులు అభిప్రాయపడ్డారు. ఇదే "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ, అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే" అనే ఉపనిషత్ వాక్యార్థం అనేది శ్రీరామానుజుల అభిప్రాయం.

ఈ వాక్యానికి అద్వైతుల వాఖ్యానం ఈ విధంగా ఉన్నది. కర్మజ్ఞానాలు స్వభావంలో పరస్పర విరుద్ధాలు. కర్మ– భేదావలంబి, జ్ఞానం –అభేదావలంబి. అందుచేత వీటికి అనుష్ఠానంలో సాహిత్యం కుదరదు. అయినా, జ్ఞాతవ్యత్వే సాహిత్యం కుదురుతుంది. ఉపాదేయత్వేన జ్ఞాతవ్యం జ్ఞానం, త్యాజ్యత్వేన జ్ఞాతవ్యం కర్మ ("జ్ఞానం పొందదగినది అని, కర్మ విడువదగినది అని తెలియాలి" అనేది పైన తెలిపిన వాక్యంలోని సారమైన అర్థం.

ఈ వ్యాఖ్యానం తగినది కాదు అనేది భగవద్రామానుదుల అభిప్రాయం. అంటే, కర్మలు కర్తవ్యాలుగా వేదాంత విహితాలు కాబట్టి, అవి విడవ తగినవి అనేది వేదాంత విరుద్ధం. అంతేకాక, ఈ వాక్యంలో ఉండే "తీర్త్వా" అనే పదానికి "పొంది" అనే అర్థం చెప్పడం అప్రసిద్ధి దోష పరాహతం. " మృత్యుం తీర్త్వా" అనే చోట "స్థితశ్చేత్" అనే రెండు పదాలను చేర్చి వ్యాఖ్యానించినందున అధ్యాహారదోష ప్రసంగం కూడా ఏర్పడుతుంది. అందుచేత అద్వైతుల వ్యాఖ్యానం అసంగతమే.

పైన ఉదాహరించిన వాక్యానికి యాదవ ప్రకాశులు చేసే వ్యాఖ్యానం ఈ క్రింది విధంగా ఉన్నది. జ్ఞాన కర్మలు సంప్రదానోపాయాలుగా జ్ఞాతవ్యాలు. ఉపాయం కూడా రెండు విధాలు. జ్ఞానం, కర్మ అనేది అవి. ఇది పూర్వవాక్యార్థం. ఉపేయం కూడా రెండు

విధాలు. అని అనిష్ట నివారణ, ఇష్ట ప్రాప్తి అనేవి ఆ రెండు. అనిష్ఠ నివృత్తిరూప ఫలానికి కర్మం ఉపాయం అని, ఇష్ట ప్రాప్తి రూప ఫలానికి జ్ఞానం ఉపాయం అని ఇక్కడ చెప్పబడుతున్నది. ఇది ఉత్తర వాక్యార్థం.

సాధనమని సాధ్యమని రెండు ఉన్నాయని అంగీకరించడంద్వారా పూర్వోత్తరవాక్యాలకు అర్థం చెప్పడం యుక్తం కాదు అని భాష్య కారుల అభిప్రాయం. ఏవిధంగా అంటే, ఉపాయం జ్ఞానమనేది ఒకటే. వేరొక ఉపాయం లేదు– అని ఉపనిషత్తులలో " తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథావిద్యతేఽయనాయ" అనే ఉపనిషత్ వాక్యంలో చెప్పబడినందున ఉపాయం రెండు అని చెప్పడం వేదాంత విరుద్ధం. ఎందుకంటే, "తమేవం విదిత్వా అమృతత్వమేతి" అనే వాక్యంలో అనిష్టనివృత్తి ఫలం అని, అది జ్ఞాన సాధ్యమని చెప్పబడినందున. అనిష్టనివృత్తి కర్మఫలం అనేది కూడా అంగీకరించదగినది కాదు. అనిష్ట నివృత్తి ఏర్పడినట్లయితే, ఇష్టప్రాప్తి తనంతటతానే సిద్ధిస్తుంది. అందుచేత సాధ్యద్విత్వం చెప్పడం కూడా వేదాంత విరుద్ధమే అవుతుంది. అందుచేత జ్ఞాన కర్మలకు జ్ఞాతవ్యత్వమాత్రంలో సాహిత్యం అనే మాయావాదిమతం, జ్ఞాన కర్మలకు సమ ప్రాధాన్యం అనే యాదవ ప్రకాశుల పక్షం అనాదరణీయం. అంగాంది భావేన సాహిత్యం అనే భగవద్రామానుజ పక్షమే ఆదరించదగినది అని తెలుస్తున్నది.

జ్ఞాన కర్మలకు అంగాంగిభావాన్ని భాస్కరుడు కూడా అంగీకరించినప్పటికీ, అతడు కర్మను జ్ఞానోత్పాదకత్వేన అంగం అని అంగీకరించకుండా, ఉత్పన్న జ్ఞానానికి అనుగ్రాహకం అని అన్నాడు. కర్మ జ్ఞానోత్పాదకం, ఉత్పన్న జ్ఞానానికి వర్ధకం అనేది శ్రీ భాష్యకారుల అభిప్రాయం. ఈ విధంగా అంగాంగులను పూర్వోత్తర కాండలు ప్రతిపాదిస్తున్నందున ఒకటే శాస్త్రం అనేది మన పెద్దలు దర్శించిన క్రమం. శ్రీయామునులు కూడా ఈ విషయాన్ని మనకు తెలియజేశారు. శంకరులు కూడా ఈ

అభిప్రాయానికి వ్యతిరేకంగా తోచేటట్లు కొన్ని చోట్ల పలికినప్పటికీ, వారు కూడా ఈ ఐక్యశాస్త్రవాదాన్ని అంగీకరించారు అనేది వారి భాష్యంలో ఒకచోట చెప్పబడి ఉన్నది అనే విషయాన్ని మన పెద్దలు ప్రస్తావించి తెలియజేశారు.

కర్మజ్ఞానాలకు కల అంగాంగి భావం చేత సముచ్చాయాన్ని శ్రీ రామానుజులు అభిప్రాయపడ్డారు అని ఇదే "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ, అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే" అనే ఉపనిషద్వాక్యంలోని అర్థం– అనేది మన స్వామి భగవద్రామానుజుల అభిప్రాయం – అని ఇంతకుముందే తెలియజేశాను. ఇది మనం తప్పక తెలియవలసిన, మన స్వామి పరమ కృపతో మనకు దర్శింపజేసిన యథార్థం.

ఈ ఈశావాస్యోపనిషద్వాక్యానికి శ్రీరామానుజులు అనుగ్రహించిన వ్యాఖ్యానాన్ని అనుసరించి వివరించే మన పెద్దలు అనుగ్రహించిన అర్థవిశేషాలను శ్రీవైష్ణవ సుదర్శనం పత్రికాధిపతి శ్రీ ఉ. వే. పుత్తూరు కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి అనుగ్రహించిన వ్యాసం ద్వారా ఇప్పుడు అనుభవంలోకి తెచ్చుకుందాం.

**12) కర్మజ్ఞానాలకు అంగాంగి భావం**
**(శ్రీవైష్ణవ సుదర్శనం పత్రికాధిపతి శ్రీ ఉ. వే. పుత్తూరు కృష్ణస్వామి అయ్యంగార్ స్వామి)**

విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే.
మోక్షాన్ని కోరే ఎవడు,

విద్యాం చ– ఇంతకు ముందు తెలుపబడిన జ్ఞాన రూపమైన బ్రహ్మవిద్యను,

అవిద్యాం చ— విద్యకంటే వేరైన (విద్యకు అంగమైన) కర్మయోగం,

తత్ ఉభయం — అనే ఈ రెండిటిని,

సః— ఒకదానితో ఇంకొకటి చేరినదిగా,

వేద— తెలిసికొంటున్నాడో,

సః— అతడు,

అవిద్యయా— పైన తెలిపిన క్రమంలో,

మృత్యుం— విద్యకు ఆటంకమైన పుణ్యపాపరూప కర్మలను,

తీర్త్వా— పోగొట్టుకొని,

విద్యయా— బ్రహ్మ విద్యతో,

అమృతం— పరమాత్మను పొందుతున్నాడు.

ఈ మంత్రం ఈశావాస్యోపనిషత్తులో 11 మంత్రంగా పఠింపబడుతున్నది. ఈ ఉపనిషత్తులోని మొదటి మంత్రంలో " స్వామి అయిన పరమాత్మకు ఈ లోకం అంతా సొత్తు" అని తత్త్వజ్ఞాన రూపమైన పరవిద్య ముముక్షువుకు సంగ్రహంగా ఉపదేశింపబడినది. రెండవ మంత్రంలో విద్యకు అంగంగా కర్మయోగాన్ని ఆచరించడం ఆవశ్యకం అని సంగ్రహంగా చెప్పబడింది. మొదటి రెండు మంత్రాలలో చూపబడ్డ పరవిద్యను కర్మయోగాన్ని అనుష్ఠించకుండా ఉండేవారికి విపరీత ఫలం కలిగిస్తుంది అని తెలియజేయడం ద్వారా ఆ రెండిటిని అనుష్ఠించవలసిన ఆవశ్యకత ఉన్నది— అని మూడవ మంత్రంలో చెప్పబడింది. నాలుగవ మంత్రం మొదలుకొని ఎనిమిదవ మంత్రంవరకు మొదటి మంత్రంలో చెప్పబడిన పరవిద్య విషయంలో

అనుసంధించవలసిన పరావర తత్త్వాలను గూర్చిన యథార్థమైన జ్ఞానం, ఈ విధంగా అనుసంధించడం వల్ల శోకమోహాలు లేకుండా పోవడం అనే అవాంతర ఫలం కలుగుతుంది అనేది కూడా చెప్పబడింది. రెండవ మంత్రంలో సంగ్రహంగా చెప్పబడిన కర్మ కూడా పరవిద్య తోపాటు తప్పక చక్కగా అనుస్తింపబడాలి అని చక్కగా, స్థిరంగా స్థాపించడం కోసం తొమ్మిదవ పదవ మంత్రాలలో విపరీత ఫలం కలుగుతుంది కనుక, విద్యా కర్మలను వేరువేరుగా అనుష్టించకూడదు అని, విద్యా కర్మలు అనే రెండిటిచేత కలిగే రెండు ఫలాలు ముముక్షువునకు ఆవశ్యకం కనుక, వేరు వేరు ఫలాలను కల ప్రత్యేక ప్రత్యేకంగా ఆచరిస్తే మోక్షఫలం లభించదు అనికూడా నిరూపింపబడింది. ఇక ముముక్షువునకు ఆవశ్యకమైన ఆ విద్యాఫలం, కర్మఫలం ఏవి? అనే ప్రశ్న రాగా, దానికి బదులు పలుకుతూ, విద్యాకర్మలు అంగిగా, అంగంగా కలిపి అనుష్ఠింపబడాలి– అని స్థాపింపబడుతున్నది, ఈ మంత్రంలో.

**వ్యాఖ్యానమ్**– (యః) మోక్షాన్ని కోరిన వాడు ఎవడు, (విద్యాం చావిద్యాం చ)– ముందు చెప్పబడిన జ్ఞానరూపమైన బ్రహ్మవిద్యను, విద్య కంటే వేరుగా ఉండే పరలోకరూపఫలానికి ఉపకారమై ఉండే విషయంలో దానికి అనురూపమైనదై, అంగం కనుక విద్యకు సన్నిహితమైనదై, వర్ణాశ్రమ విహిత కర్మ అనే ఈ రెండిటిని, (సహ వేద) అంగంగాను, అంగిగాను ఒకదానితో ఒకటి కలసి ఉన్నవిగా తెలుసుకుంటున్నాడో –అని భావం. జ్ఞానానికి ఫలం అనుష్ఠానం కనుక ఇక్కడ " వేద" (తెలిసికుంటున్నాడో) అనే ప్రయోగంవల్ల – తెలిసికొని, కర్మను అంగంగాను, విద్యను అంగిగాను గ్రహించి కలిపి, అనుష్ఠిస్తున్నాడో– అనే అర్థం ఏర్పడుతుంది. అంతరంగ కర్మలను ఆ యా కర్మల వల్ల కలిగే ఫలాలను ఆశిస్తూ ఆచరించకుండా అనూష్ఠిస్తే మోక్షానికి విరోధి అయిన అన్య ఫలాలు కలిగి కలుగుతాయి గనుక విద్యకు ఆటంకం కలుగుతుంది. ఫలం విషయంలో ఆశను విడచిపెట్టి, ముందు చెప్పిన విధంగా అంగంగా కర్మను పరవిద్యను కలిపి

అనుష్ఠించాలి—అని భావం. యచ్ఛబ్దం ఉండే వాక్యంలో తచ్ఛబ్దం ఉండి తీరాలి కనుక, "సః" అనే పదాన్ని ఇక్కడ అధ్యాహారం చేసుకోవాలి. ముముక్షువైనవాడు —అని దీని అర్థం. (అవిద్యయా) ముందు తెలిపిన కర్మతో, (మృత్యుమ్) పరవిద్యక కలగడానికి ఆటంకంగా ఉన్నవై, పుణ్య పాప రూపమైన ప్రాచీన కర్మలను అన్నిటిని, (తీర్త్వా) పోగొట్టుకొని, (విద్యయా) బ్రహ్మవిద్య అనే జ్ఞానంతో, (అమృతం) పరబ్రహ్మను, (అశ్నుతే) పొందుతున్నాడు.

ఇక్కడ ఆవిద్యాశబ్దానికి కర్మయోగం అని, మృత్యు శబ్దానికి జ్ఞానం కలగడానికి అడ్డుగా ఉండే పుణ్య పాప రూపమైన ప్రాక్తన కర్మలు అని, అమృత శబ్దానికి పరబ్రహ్మం అని అర్థం గ్రహించడం జిజ్ఞాసాధికరణ శ్రీభాష్యాన్ని అనుసరించియే.

"అత్ర అవిద్యాశబ్దాభిహితం వర్ణాశ్రమవిహితం కర్మ. అవిద్యయా కర్మణా, మృత్యుం జ్ఞానోత్పత్తివిరోధి ప్రాచీనం కర్మ, తీర్త్వా వ్యపోహ్య, విద్యయా జ్ఞానేన, అమృతం బ్రహ్మ, ప్రాప్నోతి ఇత్యర్థః. మృత్యుతరణోపాయతయా ప్రతీతా, అవిద్యా విద్యేతరత్ విహితం కర్మైవ" (ఈ మంత్రంలో అవిద్యాశబ్దం చేత వర్ణాశ్రమ విహిత కర్మ చెప్పబడినది. అవిద్య చేత, అంటే, కర్మచేత మృత్యువును, అంటే, జ్ఞానం కలగడానికి అడ్డు అయిన ప్రాచీన కర్మలను పోగొట్టుకొని, విద్య అనబడే జ్ఞానంతో అమృతం అనబడే బ్రహ్మను పొందుతున్నాడు— అని ఈ ఉపనిషత్ వాక్యంలోని అర్థం. మృత్యువు అనబడే ప్రాచీన కర్మలను పోగొట్టుకోవడానికి ఉపాయంగా చెప్పబడిన అవిద్య కంటే వేరైన కర్మమే అవుతున్నది అనేది జిజ్ఞాసాధికరణ శ్రీభాష్య శ్రీసూక్తి. దీనివల్ల, బ్రహ్మవిద్య నెరవేరడానికి అడ్డుగా ఉండే మృత్యువు అనబడే పుణ్య పాప రూప ప్రాచీన కర్మలు తొలగడమే అవిద్య అనబడే వర్ణాశ్రమాలకు తగిన కర్మల ఫలం అని, అమృతం అనబడే బ్రహ్మను పొందడమే విద్యాఫలం అని తెలుస్తున్నది.

వీటిలో, మొదటి ఫలమైన ప్రాచీన కర్మలు తొలగడం అనేది నెరవేరకపోతే బ్రహ్మ విద్య నెరవేరదు. ఆ స్థితిలో పరమపురుషార్థమైన బ్రహ్మ ప్రాప్తి అనే రెండవ ఫలం సిద్ధించదు. ఈ విధంగా మొదటి ఫలానికి సాధనమై ఉండేది వర్ణాశ్రమాలకు తగిన కర్మ అనబడే అవిద్య అని, రెండవ ఫలానికి సాధనమై ఉండేది జ్ఞాన రూపమైన విద్య అని స్పష్టమవుతున్నందున, ఇవి రెండు ఒకదానితో ఇంకొకటి విరుద్ధంగా ఉండకుండా ఉండడం కోసం కర్మను అంగంగాను, విద్యను అంగిగాను గ్రహించి, ముముక్షువు అయినవాడు రెండిటిని కలిపి అనుష్ఠించాలి అనే ఇక్కడ స్పష్టమవుతున్నది. అయితే, ఇక్కడ ఈ క్రింద ప్రస్తావింపబడే విధంగా ఒక ఆక్షేపం వస్తుంది.

"ఆపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి,
యథైధాంసి సమిద్ధోగ్నిః భస్మసాత్ కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా,
న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" (గీత –4–36, 37, 38)
(పాపులు అందరికంటే మహాపాపిగా నీవు ఉన్నప్పటికీ, ఆ అన్ని పాపాలను జ్ఞానమనే ఓడచేతనే నీవు దాటి వేయగలవు. అర్జునా! పైపైకి విజృంభించి ఎగసిపడే అగ్ని ప్రాచీన కర్మలు అనే కట్టెలను భస్మం చేస్తున్నది. ఈ లోకంలో జ్ఞానంతో సమానంగా శుద్ధిని కలిగించే విషయం వేరొకటి ఏదీ లేదు) అనే గీతా వాక్యం వల్ల జ్ఞానమే అన్ని కర్మలను నశింప చేయగలదు అని స్పష్టమవుతున్నది.

"తమేవ విదిత్వా అతిమృత్యుమేతి, నాన్యః పంథా" (శ్వేతాశ్వతరోపనిషత్ –3) (ఆ పరమాత్మను తెలియడం వల్ల మృత్యువును నశింప జేసుకుంటున్నాడు, దీనికి ఇంతకంటే వేరు దారి లేదు) అని శ్వేతాశ్వతరోపనిషత్తులో జ్ఞానమే మృత్యువును పోగొట్టగలిగినదిగా చెప్పబడింది. ఆ విధంగా ఉన్నప్పుడు, కర్మమే మృత్యువును

పోగొడుతున్నది, బ్రహ్మను పొందడం విద్య యొక్క ఫలం అవుతున్నది– అని విద్యాకర్మలకు వేరువేరు ఫలాలను చెప్పడం, ఆ కారణంగా కర్మను అంగంగా, విద్యను అంగిగా గ్రహించి, రెండిటినీ చేర్చి అనుష్ఠించాలి అని అనడం ఏ విధంగా పొసగుతుంది? అనేది ఆ ఆక్షేపం.

దీనికి తగిన సమాధానం ఈ విధంగా చెప్పబడుతున్నది. విద్య నెరవేరిన తరువాత బ్రహ్మను పొందడానికి అడ్డుగా ఉండే అన్ని కర్మలు ఆ విద్య చేత నశింపజేయబడుతున్నవి అయినప్పటికినీ, విద్య జనించడానికి ప్రాచీన కర్మలను ఇంకా పుట్టని ఆ విద్య ముందుగానే నశింప చేయడం సాధ్యం కాదు కనుక, పూర్వం చూపబడిన గీతా వాక్యాలు, వేదవాక్యాలు ఆ పాపాలను నశింప చేస్తాయి అని చెప్పేవి కావు. అందుచేత ఆ విద్య పుట్టడానికి అడ్డు అయిన పిపాలను ముందు తెలిపిన కర్మయోగమే పోగొడుతున్నది అని ముందు ప్రస్తావించిన శాస్త్రాల వల్ల సిద్ధిస్తున్నందున, ఆ పాపాలు పోవడం కర్మ వల్ల అని, విద్య చేత బ్రహ్మ ప్రాప్తి కలుగుతున్నదని, దానివల్లనే కర్మ, విద్య అనే రెండు అంగంగాను, అంగిగాను చేర్చి అనుష్ఠించాలి అని ఏర్పడుతున్నది –అని చెప్పడంలో ఏ కొరత లేదు. అందుచేతనే, పూర్వం ప్రస్తావించిన గీతా వాక్యాలను అనుసరించి "తత్ స్వయం యోగసంస్థితః, కాలేనాత్మని విందతి" (గీతా–4–38)(అటువంటి జ్ఞానాన్ని ముందు తెలిపిన కర్మయోగసిద్ధిని పొందినవాడు తన ఆత్మలో పొందుతున్నాడు) అని జ్ఞానానికి కర్మ అంగంగా ఉన్నది అనే విషయం నిర్ణయింపబడింది. హిందువల్లని గీతా శాస్త్రంలోని 18వ అధ్యాయంలో అర్నాష్టమ వర్నాశ్రమ ధర్మాలకు తగిన కర్మలను వివరించి, తరువాత, "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః, స్వకర్మ నిరతః సిద్ధిం యథా విందతి తత్ శృణు" (గీతా– 18–45) (తమకు తమకు తగిన కర్మలను ఆచరించే మానవుడు పరమపదాన్ని పొందుతున్నాడు. తన కర్మను ఆచరించేవాడు పరమ పదాన్ని ఏ విధంగా

పొందుతున్నాడు? అనే విషయాన్ని వివరిస్తాను, విను) అని ఆరంభించి, కర్మయోగానికి విద్యోత్పత్తి ఫలం కనుక, విద్య యొక్క ఫలమైన బ్రహ్మ ప్రాప్తిని గూర్చి కర్మయోగం పరంపరా కారణం అవుతున్నది– అని శ్రీకృష్ణుడు నిరూపించడం కూడా ఈ విషయాన్ని బలపరుస్తున్నది.

"ఇయాజ సోపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః,

బ్రహ్మవిద్యా మదిష్ఠాయ తర్తుం మృత్యుం చ విద్యయా"(విష్ణు పురాణం– 6–6 – 12)

(ఆ కేశిధ్వజ మహారాజు ఆత్మజ్ఞానాన్ని కలిగినవాడై, బ్రహ్మోపాసనం చేసేవాడై, ఆ బ్రహ్మోపాసనకు అడ్డుగా ఉండే ప్రాచీన కర్మలను కర్మయోగం ద్వారా దాటడం కోసం పలు యాగాలను చేశాడు) అని విష్ణు పురాణంలో ఈ మంత్రమే చాలా స్పష్టంగా వివరింపబడినది. ఇక్కడ "జ్ఞానవ్యపాశ్రయః "అని, " బ్రహ్మవిద్యామధిష్ఠాయా"అని చెప్పినందున కేశిధ్వజ మహారాజు మోక్షాన్ని పొందాలని కోరే ముముక్షువు అని తెలుపబడుతున్నది. " అవిద్యయా మృత్యుం తీర్త్వా" అని ఈ మంత్రంలో చెప్పబడిన విషయం "తర్తుం మృత్యుం అవిద్యయా" అని ఉపబృంహణం చేయబడినది. అవిద్యాశబ్దంతో చెప్పబడినది కర్మయే అనే విషయం "సుబహూన్ యజ్ఞాన్" అనే ప్రయోగం ద్వారా వివరింపబడింది. " బ్రహ్మ విద్యా మదిష్ఠాయ అవిద్యయా మృత్యుం తీర్త్వా" అని అన్నందున బ్రహ్మవిద్య కలగడంలో అడ్డుగా ఉండే ప్రాచీన కర్మలు మృత్యుశబ్దంతో చెప్పబడినవి అని కూడా తెలుస్తున్నది.

"అవిద్యా కర్మసంజ్ఞాఽన్యా " (విష్ణుపురాణం– 6 –7 –61) అని శ్రీ విష్ణు పురాణంలోనే తరువాత అధ్యాయంలో విద్య కంటే భిన్నమైన కర్మయే అవిద్య అనబడుతున్నది అని ఘోషింపబడింది. వీటి వల్ల ఈ మంత్రానికి శ్రీభాష్యకారులు చేసిన వ్యాఖ్యానమే పరాశర మహర్షికి అభిమతమైనది అని అర్థమవుతున్నది.

" తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్,

తపసా కిల్బిషం హంతి విద్యయాఽమృత మశ్నుతే" (మనుస్మృతి– 12 –140) (బ్రహ్మను ఉపాసించే బ్రాహ్మణునకు తపస్సు అనే కర్మం, విద్య అనే ఉపాసనం అనేవి గొప్పమోక్షోపాయాలు. తపస్సు చేత ఉపాసనకు అడ్డుగా ఉండే పాపాన్ని పోగొట్టుకుంటున్నాడు, ఉపాసనతో బ్రహ్మను పొందుతున్నాడు) అని మనుస్మృతిలో కూడా, ఈ మంత్రంలో ఉండే పదాలు, వాటికి పర్యాయమైన పదాలను ప్రయోగించి ఈ విధంగా వివరింపబడడం గమనించవచ్చు. ఈ అర్థం మను మహర్షి కూడా అంగీకరించినదే అని దీనివల్ల తెలుస్తుంది. " ధర్మేణ పాపమపనుదతి" (తైత్తిరీయ నారాయణం– 63) (కర్మయోగం ద్వారా పాపాన్ని పోగొట్టుకుంటున్నాడు) అనే ఉపనిషద్వాక్యం, "అవిద్యయా మృత్యుం తీర్త్వా" అనే మంత్రంలోని భాగాన్ని స్పష్టంగా వివరిస్తున్న రీతిలో భాసించే విషయం గమనించదగినది. అవిద్యాశబ్దం ధర్మ శబ్దంతో వివరింపబడుతున్నందున ఫలంలో సంగం లేని కర్మయోగాన్ని, " మృత్యు" శబ్దం పాపశబ్దంచేత వివరింపబడుతున్నందున ఉపాసనకు అడ్డుగా ఉండే పాపాలను "తీర్త్వా "అనే శబ్దంతో, " అపనుదతి" అనే పదంతో వివరింపబడుతున్నందున, " లేకుండా చేయడం" అనే అర్థాన్ని సూచిస్తున్నాయి–అని స్పష్టంగా ఇక్కడ తెలుపబడినట్లయినది.

ఇప్పుడు, ఈ సందర్భంగలో, ఇంకొక ఆక్షేపం కలుగవచ్చు. అది ఏమంటే–

"కర్మణా పితృలోకో, విద్యయా దేవలోకః" (బృహదారణ్యకం– 3 –5 –16) (కర్మవల్ల పితృలోకం లభిస్తున్నది, విద్య వల్ల పరమపద ప్రాప్తి కలుగుతున్నది) అని ఉపనిషత్తులో కర్మ వల్ల నశించే ఫలం, విద్యచేత నశించని ఫలం కలుగుతాయని చెప్పిన క్రమానికి ఇది విరుద్ధమవుతున్నదికదా! అనేది ఆ ఆక్షేపం.

దీనికి సమాధానం ఏమిటంటే, ఇక్కడ కర్మ అనేది ఫలంలో సంగంతో చేయబడే కర్మయే. ఫలం లో ఆశ కలిగి చేయబడే కర్మచేత నశించే ఫలాలే లభిస్తాయి అనే విషయం, ఫలంలో సంగం లేకుండా చేయబడే కర్మ పరవిద్యను కలిగించి, దాని మూలంగా మోక్షానికి కారణం అవుతుంది అనే విషయం అనేక శ్రుతి స్మృతి వాక్యాల వల్ల స్పష్టం అవుతున్నది.

"అథ యే యజ్ఞేన దానేన తపసానాశకేన, జయంతి తే ధూమ మభిసంభవంతి" (బృహదారణ్యకం_ 8–2 –16) (యజ్ఞం, దానం, తపస్సు మొదలైన కర్మల చేత పుణ్యలోకాలను జయించినవారు ధూమాధి మార్గం ద్వారా వెడుతున్నారు), " అథ య ఇమే గ్రామే ఇష్టాపూర్తం దత్తమిచ్ఛ్యుపాసతే తే ధూమ మభిసంభవంతి" (ఛాందోగ్యమ్–5–10–3) (గ్రామంలో యాగాన్ని చేయడం, బావులు తవ్వడం, దానం చేయడం మొదలైన కర్మలను చేసేవారు ధూమమార్గం ద్వారా వెళుతున్నారు) అని మొదలైన వేదవాక్యాల వల్ల,

"త్రైవిద్యా మాం సోమపా పూతపాపాః యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,

తే పుణ్యమాసాద్య సురేంద్ర లోకం అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్" (గీత 9– 20) (వేదాలలోని పూర్వభాగాలలో చెప్పబడిన ధర్మాల మార్గంలో ఊనికను కలిగినవారై, ఇంద్రుడు మొదలైన వారిని గూర్చి చేయబడే యాగాల శేషమైన సోమ రసాన్ని పానం చేసేవారై, స్వర్గం మొదలైనవానిని పొందడానికి అడ్డుగా ఉండే పాపాల నుండి విడుదలను పొందినవారై, ఇంద్రుడు మొదలైన దేవతలను గూర్చి యజ్ఞాల ద్వారా, ఆ దేవతలకు అంతర్యామి అయిన నన్ను ఉద్దేశించి యాగం చేసి, ఇంద్రుడు మొదలైనవారు ఉండే చోటు అయిన స్వర్గాన్ని వేడుతున్నారో, వారు, ఈ లోకంలోని దుఃఖాలు లేని దేవేంద్ర లోకాన్ని చేరి, అక్కడ ఉండే పలుచోట్ల ఈ లోకంలోని అనుభవాల కంటే గొప్పవి అయిన

దేవతల భోగాలను అనుభవిస్తారు) అని మొదలైన స్మృతులలోనూ ఫలంలో సంగంతో చేయబడే కర్మలకు నశించే ఫలాలే కలుగుతాయి అని చెప్పబడింది.

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" (బృహదారణ్యకం –6–4–22) యజ్ఞం చేత, దానం చేత, నిరాహారంగా ఉండడం మొదలైన తపస్సుల చేత, వేదాధ్యయనం చేత, ఈ పరమ పురుషుని బ్రహ్మజ్ఞానులు తెలుసుకోవాలని కోరుతున్నారు), " ధర్మేణ పాపమపనుదతి" (ఫలంలో ఆశ లేని కర్మలద్వారా పూర్వపాపాలను పోగొట్టుకుంటున్నాడు) అని మొదలైన వేద వాక్యాలలో ఫలంలో సంగం లేని కర్మ బ్రహ్మప్రాప్తికి కమేణ కారణం అవుతున్నది అని చూపబడింది. గీత లో కూడా 18వ అధ్యాయంలో " త్యాజ్యం దోషవదిత్యేవ కర్మ ప్రాహుర్మనీషిణః, యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే" (గీత– 18– 3) (కొందరు దోషాన్ని కలిగినవది అయినందున కర్మ విడువదగినది అని అంటున్నారు. యజ్ఞం, దానం, తపస్సు మొదలైనవి విడువదగినవి కావని కొంతమంది జ్ఞానులు అంటున్నారు) అనే రెండు పక్షాలను ప్రస్తావించి, " యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్, యజ్ఞం దానం తపశ్చైవ పావనాని మనిషిణామ్" (18–5) (యజ్ఞం, దానం, తపస్సు మొదలైన వైదిక కర్మలు ముముక్షువుచేత ఏ సమయంలోనూ విడిచిపెట్టదగినవి కావు. ఆయుస్సు ఉన్నంతవరకు ప్రతిదినం అనుష్ఠించి తీరాలి. ఎందుకంటే, ఉపాసనం చేసేవారికి ఆ కర్మలు ఉపాసనం పూర్తిగావడానికి అడ్డుగా ఉండే పూర్వపాపాలను పోగొడుతున్నాయి కనుక) అని ఫలంలో సగం లేని కర్మలు ముముక్షువు చేత అనుష్ఠింపబడాలి అని భగవంతుడు తన సిద్ధాంతాన్ని వ్యక్తం చేశాడు మూడవ అధ్యాయంలో కూడా "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" (3– 20) (జ్ఞానులలో గొప్పవాడైన జనకుడు మొదలైనవారు కర్మయోగంతోనే సిద్ధిని పొందారు) అని తెలియజేశాడు. నాల్గవ అధ్యాయంలోనూ 15వ శ్లోకంలో "ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,

కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్" (ఈ విధంగా నన్ను తెలుసుకొని పాపాన్ని పోగొట్టుకున్న పూర్వులచే (ముముక్షువులచే) ముందు చెప్పబడిన కర్మయోగం చేయబడింది. అందుచేత నీవు కూడా పూర్వులచేత చేయబడిన ప్రాచీనమైన కర్మయోగాన్ని ఆ విధంగానే ఆచరించు) అని ముముక్షువులు కర్మయోగాన్ని తప్పక ఆచరించాలి—అని తెలియజేశాడు. పూర్వం ప్రస్తావించిన శ్రీవిష్ణుపురాణ శ్లోకాలు కూడా ఈ అర్థాన్నే బలపరుస్తున్నాయి. గీతలో 18వ అధ్యాయంలో ఈ విషయంగా శ్రీకృష్ణుడు తన దృఢమైన నిర్ణయాన్ని ప్రస్తావించబోయే శ్లోకాలలో తెలియజేశాడు.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ, కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్" (6) (ఈ కర్మలను ఉపవాసన వలెనే, నాది అనే భావనను, ఫలాన్ని విడచి ఉపాసన నెరవేరడం కోసం తప్పక అనుష్ఠింప వలసినదే అనేదే నా నిశ్చితమైన అభిప్రాయం. " అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణా ఫలమ్, భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్యాసినాం క్వచిత్" (12) (కోరదగని నరకం మొదలైనవి, ఆశపడదగిన స్వర్గం మొదలైనవి, దుఃఖం కలసిన ఆనందాన్ని కలిగించే పుత్ర పశ్వన్నాదులనేవి (కర్మలకు కలిగే) మూడు విధాలయిన ఫలాలు త్రివిధ పరిత్యాగం చేయనివారికి ఆ కర్మను ఆచరించిన తరువాత కలుగుతాయి. ఆ మూడు విధాలైన పరిత్యాగాలతో కర్మలను ఆచరించేవారికి మోక్ష విరోధి అయిన ఆ ఫలాలు ఏ సమయంలోనూ కలుగవు), " సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః, మత్ ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్"(56) (కామ్యకర్మలతో కూడుకున్న అన్ని విధాలైన కర్మలను నా విషయంలో కర్తత్వం మొదలైనవానిని సమర్పించి, ఎల్లప్పుడూ అనుష్ఠించేవాడు నా కృపతో స్థిరమైన ఫలమైన నన్నే పొందుతున్నాడు), " చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః, బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చితః సతతం భవ" (57) (నిన్ను పరమాత్మచేత నియమింపబడే సొత్తుగా భావించి, అన్ని కర్మలను అన్ని రీతులలోనూ

నా వద్ద సమర్పించి, నన్నే ఫలంగా అనుసంధించు. నా వద్ద మనస్సును ఎల్లప్పుడూ పనిలుపుకో) అనే ఈ శ్లోకాలలో ఫలంలో ఆశతో చేయబడిన కర్మలే మోక్ష విరోధి అయిన స్వర్గాది ఫలాలను కలిగిస్తాయి అని, ఫలంలో సంగం లేకుండా, మూడు విధాలైన పరిత్యాగాలతో ఆచరింపబడే కర్మలకు అటువంటి మోక్ష విరోధి అయిన ఫలం కలుగదని, ఉపాసన విరోధులైన పాపాలను పోగొట్టి ఉపాసనాన్ని పూర్తి అయ్యేటట్లు చేయడం ద్వారా అవి క్రమంగా బ్రహ్మానుభవాన్ని కలిగిస్తాయని తలో శ్రీకృష్ణుడే స్పష్టంగా పలికినందున ఈ విషయం ఎవరూ కాదనడానికి, వేరు విధంగా చెప్పడానికి వీలు లేనిది.

అందుచేత "కర్మణా పితృలోకః" అనే చోట కర్మ శబ్దం ఫలంలో ఆశతో చేయబడే కర్మను సూచిస్తుంది అని, ఈ మంత్రంలో అవిద్యశబ్దం సంగం లేకుండా చేయబడే కర్మనే చూపుతున్నదని, అందుచేత ఈ రెండిటికి ఎటువంటి వైరుధ్యం లేదు అని వ్యక్తమవుతున్నది. ఈ వాక్యంలో పితృలోక శబ్దం బ్రహ్మలోక పర్యంతంగా ఉండే నశించే లోకాలకు ఉపలక్షణం. దేవలోక శబ్దం "యత్ర పూర్వే సాధ్యాః సంతి దేవాః" (యజురారణ్యకం– 3 –12– 7) అని చెప్పబడిన నిత్య సూరులు ఉండే చోటైన, ఏనాటికీ నశించని పరమపదాన్ని తెలుపుతున్నదనే గ్రహించాలి.

కర్మ సాధ్యమైన, నశించే లోకాలకు విపరీతంగాను, విద్యాసాధనంగాను ప్రస్తావింపబడటం వల్ల "తమేవం విద్వాన్ అమృత ఇక భవతి" (పురుష సూక్తమ్) అని విద్య అనే జ్ఞానంద్వారామోక్షం లభిస్తుంది– అని కదా, చెప్పబడుతున్నది. ఆ పరమపదమే "విద్యయా అమృత మశ్నుతే" అని ఈ ఉపనిషత్తులో కూడా చెప్పబడినదని గ్రహించాలి. విద్య మోక్ష సాధనం అని చెప్పినందున, ఫలంలో సంగం లేని కర్మ మోక్షానికి మోక్షాన్ని గూర్చిగాని, దానికి సాధనమైన విద్యను గూర్చిగాని ఎటువంటి ఫలాన్ని ఇవ్వదు అని సిద్ధించింది. "తమేతం వేదానువచనేన" అని ఆరంభమయ్యే, పూర్వం ప్రస్తావించిన వేదవాక్యం వల్ల, స్మృతుల వల్ల కర్మయోగం విద్యా విరోధులను

పోగొట్టి, విద్యను ఉత్పన్నం చేసి, వృద్ధి చేస్తున్నది– అని స్పష్టంగా తెలుస్తున్నది కదా. అందువల్లనే ఇంకొక వేదవాక్యంలో "క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః" (ముండకోపనిషత్– 3– 1– 4) (కర్మను కలిగినవాడే బ్రహ్మ జ్ఞానులలో గొప్పవాడు) అని చెప్పబడింది. " సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేరశ్వవత్" (బ్రహ్మసూత్రం –3–4– 26) (గృహస్థుని వద్ద బ్రహ్మ విద్య అగ్నిహోత్రం మొదలైన అన్ని కర్మలను అపేక్షిస్తున్నది, ఏ విధంగా అంటే, "యజ్ఞేన దానేన" అని ఆరంభమయ్యే వేదవాక్యంలో ఆ విధంగా చెప్పబడినందున, ప్రయాణానికి సాధనమైన గుర్రం తనకు తగిన పగ్గాలు మొదలైనవాటిని అపేక్షించేటట్లు, " సహకారిత్వేన" (బ్రహ్మ సూత్రం –3–4–33) (బ్రహ్మవిద్య ఉత్పన్నం కావడానికి సాధనంగా (యజ్ఞాది కర్మలు అనుష్ఠించవలసినవిగా) విధింపబడినందున) అనే సూత్రాలలోనూ కర్మయోగం బ్రహ్మ విద్యకు అంగమై నిలచి ఉపకరిస్తున్నది అని చాలా స్పష్టంగా చెప్పబడింది. ఈ ఉపనిషత్తులో కూడా రెండవ మంత్రంలో "కుర్వన్నేవేహ కర్మాణి" అని కర్మలు అనుష్ఠించవలసినవే అని చాలా దృఢంగా చెప్పబడినది.

ఈ ప్రమాణాలను అన్నిటినీ గమనించినప్పుడు "విద్యాం చ అవిద్యాం చ" అనే ఈ మంత్రంలో బ్రహ్మ విద్యకు అంగంగా కర్మ యోగాన్ని కలిపే అనుష్ఠించాలి అని చెప్పినట్టే గ్రహించాలి. ప్రమాణాలు ఆ విధంగా ఉండగా, ఈ మంత్రం జ్ఞానిని గూర్చి కాకుండా, బుభుక్షువును గురించి తెలుపుతున్నది అని శంకరులు మొదలైనవారు వాదం చేయడం ఎంత మాత్రం పొసగదు. బుభుక్షువులకు తెలుపవలసిన కర్మలు అన్నిటినీ గూర్చి ఇంతకుముందే కర్మకాండలో విస్తృతంగా తెలిపి పూర్తిచేసిన తరువాత, ఆరంభమవుతున్న జ్ఞానకాండమైన ఈ ఉపనిషత్తులో మళ్లీ అతనిని గూర్చి కర్మలను విధించవలసిన అక్కరలేనే లేదు. " ఈశావాస్యమ్" అని మొదటి మంత్రంలో ముముక్షువును గూర్చి ప్రారంభమైన తరువాత అజ్ఞానినిగూర్చి ఈ ఇక్కడ పలికే

అవకాశం లేదు. ఇంతే కాక, " విద్యయా అమృత మశ్నుతే" అని ఇక్కడ మోక్షం కదా ఫలంగా చెప్పబడింది. " అమృతమశ్నుతే" అని స్పష్టంగా చెప్పబడినప్పుడు, దానికి "మోక్షాన్ని పొందుతున్నాడు" అని వివరించకుండా, "దేవతాత్మ భావం అశ్నుతే, తద్ధి అమృతముచ్యతే, యద్దేవతాత్మగమనమ్" (దేవత్వాన్ని పొందుతున్నాడు, అదే ఇక్కడ అమృతం అని ఉపచారంగా చెప్పబడింది) అని శంకరులు వ్యాఖ్యానించడం ముందు ప్రస్తావించిన సకల ప్రమాణాలకు విరుద్ధం అవుతుంది.

సంగ్రహంగా శంకరుల వాదం ఈ మంత్రాన్ని వివరించాలి అనే వచ్చిన

"ఇయాజ సోపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః,
బ్రహ్మవిద్యా మదిష్ఠాయ తర్తుం మృత్యుం చ విద్యయా" (విష్ణు పురాణం– 6–6 – 12) అనే శ్లోకంలో కేశిధ్వజ మహారాజును ఆత్మ జ్ఞానం కలవాడు అని, అతడు బ్రహ్మోపాసనను చేస్తూనే, దానికి అడ్డుగా ఉండే ప్రాక్తన కర్మలను అవిద్య అనబడే కర్మయోగం ద్వారా దాటడం కోసం ఎన్నో యాగాలు చేశాడు అని చాలా స్పష్టంగా వివరించడానికి కొంచెం కూడా పొసగదు అని ఇంతకుముందే పిరూపింపబడింది. ఆ విధంగానే, అక్కడే చూపబడిన మనస్మృతివచనంలో తపస్సు అనబడే కర్మ, విద్య మోక్ష సాధనాలు, కర్మ ద్వారా ఉపాసనకు అడ్డుగా ఉండే పాపం తీరుతుంది, విద్య అనే ఉపాసన ద్వారా ఉపాసకుడు మోక్షాన్ని పొందుతున్నాడు –అని వివరించడం కూడా శంకర భాష్యానికి కొంచెం కూడా అనుకూలం కాదు– అని నిరూపింపబడింది.

ఉపనిషత్తులలో అమృత శబ్దం మోక్షాన్ని కానీ, పరమాత్మను గాని నిర్దేశించడం చూడవచ్చు. బృహదారణ్యకం నాలుగవ అధ్యాయం, 5వ బ్రాహ్మణంలోని మొదటి పది నాలుగు ఖండాలలోనూ "ఏష త ఆత్మా అంతర్యామ్యమృతః" అని అమృత శబ్దంతో పరమాత్మ ఉద్దేశింపబడ్డాడు. "ఉతామృతత్వస్యేశానః "అని పురుష సూక్తంలో అమృత

శబ్దంతో మోక్షస్థితి చెప్పబడింది. ఈ విధంగా పలుచోట్ల గమనించవచ్చు. అందుచేత ఇక్కడ అమృత శబ్దంతో దైవత్వాన్ని పొందడం సూచింపబడుతున్నదని శంకరులు వ్యాఖ్యానించడం కొంచెం కూడా సరికాదు. "విద్యయా దేవలోకః" అనే చోట దేవలోక శబ్దం మోక్సలోకమైన పరమపదాన్నే నిర్దేశిస్తున్నది అనేది కూడా ఇంతకుముందే నిరూపింపబడినది. ఫలంలో సంగం లేని కర్మయోగం మోక్షానికి క్రమంగా కారణమవుతున్నది. "సంసారంలో జీవుని బంధించదు" అని గీతా మొదలైన పలు శాస్త్రాలలో చెప్పబడడం ఇక్కడ తిరస్కరించటానికి వీలు కాదు కనుక, శంకరులు ఇక్కడ సాధారణంగా కర్మ అంతా బంధకం అని భావించారు అనేది చక్కగా తెలుస్తున్నది.

బృహదారణ్యకంలోని ఆరవ అధ్యాయంలో "కిం ప్రజయా కరిష్యామః యేషాం నోయమాత్మా అయం లోకః"(6 –4 –22)అని" బ్రహ్మజ్ఞానులు గృహస్థాశ్రమాన్ని విడచి పెట్టాలి" అని చెప్పబడినందున, శ్వేతాశ్వతరోపనిషత్తులో " అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం ప్రోవాచ సమ్యక్ ఋషి సంఙుష్టమ్" (6– 21) అని సన్యాసాసశ్రమంలో ఉండేవారికి బ్రహ్మవిద్యను ఉపదేశించడం వల్ల గృహస్థునకే తగిన కర్మ మోక్షానికి ఏ రీతిలోనూ సహాయ పడదు అనే వాదం చేయడం తగదు.

"సమేతం వేదానువచనేనా బ్రాహ్మణాః వివిదిషంతి" అని ప్రారంభమయ్యే వాక్యంలోనే కర్మ మోక్షసాధనమైన విద్యకు సాధనం అని చెప్పబడినందున, సూత్రకారులు కూడా దానిని ఆదరించడం ఇంతకుముందే చూపబడింది. వాస్తవంలో సూత్రకారులు "బ్రహ్మవిద్యకు కర్మ తప్పక ఆవశ్యకమై ఉన్నందున, అగ్నిహోత్రాది కర్మలు లేని సన్యాసులకు బ్రహ్మవిద్యలో అధికారం లేదు" అని పూర్వపక్షం చేసి, "వారికి అగ్నిహోత్రాదికర్మలు లేకపోయినప్పటికీ, జపం, తపస్సు మొదలైన కర్మలు ఉన్నందున, వాటి ద్వారా వారు బ్రహ్మవిద్యకు అడ్డుగా ఉండే, విరోధులైన, పాపాలను పోగొట్టుకొనివచ్చు కనుక, వారికి కూడా బ్రహ్మవిద్యలో అధికారం ఉన్నది అని

బ్రహ్మసూత్రం (3–4–17) లో పైన ప్రస్తావించిన అగ్నీంధనాద్యధికరణంలోసిద్ధాంతం చేసినందున, బ్రహ్మవిద్యలో గృహస్థులకే ముఖ్యమైన అధికారం అని తెలుస్తున్నది. పూర్వం ప్రస్తావించిన శ్వేతాశ్వతర మంత్రం మొదటి భాగంలో తపః ప్రభావాత్ దేవప్రసాదాచ్చ బ్రహ్మ హ శ్వేతాశ్వతరోऽథ విద్వాన్" అని సన్యాసి అయిన శ్వేతాశ్వతరుడు తపస్సు అనే కర్మ మహిమ వల్ల, దానితో కూడిన ఉపాసనతో తృప్తుడైన పరమాత్మ యొక్క అనుగ్రహించేత బ్రహ్మవిద్యను పొందాడు– అని చెప్పబడినందున, సన్యాసులు కూడా వారికి తగిన తపస్సు మొదలైన కర్మలను అనుష్ఠించాలి అనే తెలుస్తున్నది. ఆ ఉపనిషత్తులోని తరువాత మంత్రంలోని "వేదాంతే పరమం గుహ్యం పురాకల్పే ప్రచోదితమ్, నా ప్రశాంతాయ దాతవ్యం నా పుత్రాయ అశిష్యాయ వా పునః" అని పుత్రునకు బ్రహ్మవిద్యను ఉపదేశించవచ్చు– అని చెప్పినందున బ్రహ్మవిద్యలో గృహస్థునకు యోగ్యత ఉన్నది అనే తెలుస్తున్నది.

అందువల్లనే ఛాందోగ్యపనిషత్తులో బ్రహ్మవిద్యను ఆచార్యుని దగ్గరనుండి ఉపదేశం పొందిన తరువాత, అధికారి ఏ విధంగా జీవించాలి? అని వివరించే వాక్యంలో "కుటుంబే శుచౌ దేశే" అని అతనిని గృహస్థునిగా వర్ణించి, " స ఖల్వేవం యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే, న చ పునరావర్తతే " (8 –15) అని ఆయుస్సు ఉన్నంతవరకు గృహస్థ ధర్మాలను అనుష్ఠించే బ్రహ్మవిద్యానిష్ఠునకు ఈ లోకానికి తిరిగి రావడం అనేది లేని మోక్షం లభిస్తుంది– అని చెప్పడం కూడా దీనినే బలపరుస్తున్నది.

ఈ విషయాన్ని "కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః" (బ్రహ్మ సూత్రం –3–4–47) అన్ని ఆశ్రమాలకు బ్రహ్మవిద్య ఉన్నందువల్ల, "ఛాందోగ్యంలో గృహస్థశ్రమంలో ఉండేవానికి తగినదిగా బ్రహ్మవిద్యను నిర్ణయించి పలకడం మిగిలిన ఆశ్రమాలకు ఉదాహరణే కాగలదు"– అని సూత్రంలో సూత్రకారులు కూడా ఆదరించారు.

అందుచేత బ్రహ్మ విద్యలో సన్యాసులకు మాత్రమే అధికారం ఉన్నది, మిగిలిన వారికి లేదు– అని, కర్మలు గృహస్థునకే తగినవి, సన్యాసులకు లేవు– అని తాముగా కల్పించుకొని, ఇక్కడ కర్మను, విద్యను చేర్చి పలకడం అజ్ఞానుల విషయమైనది అని శంకరులు వ్యాఖ్యానించడం ఇంతకు ముందు చెప్పిన రీతిలో శ్రుతి స్మృతి సూత్రకారులకు విరుద్ధం కనుక, అనాదరించదగినది అనేది చక్కగా తెలుస్తుంది.

అందుచేత ముముక్షువులచే కర్మలు ఫలంలో సంగం లేకుండా అనుష్టింపవలసినవే– అని సుస్థాపింపబడింది. ఈ విషయాన్ని ఆళ్వారులు కూడా "పలు పలు దివ్య దేశాలలో నివసించే ముముక్షువులైన పరమ భాగవతులు కర్మలను భగవంతుని ఆరాధనా రూపంగా చేస్తున్నారు " అని చూపడం ద్వారా వ్యక్తం చేశారు. " శంది వేళ్వి శడంగు నాన్మఱై ఓది ఓదువిత్తు ఆదియాయ్ వరుమ్ అందణర్ అఱా అణియాలి" (పెరియతిరుమొழி – 3 –5– 6), " ముఱైయాల్ వాళర్ క్క న్థ ముత్తీయర్ నాల్వేదర్ ఐ వేళ్వి ఆఱంగర్" (పెరియ తిరుమొழி– 3 –8 –4), "నా ల్తొழிల్ మఱైవల్లార్ కళ్ నయందు అఱమ్ పయంద వణ్ కై త్తీల్తొழிల్ పయలుమ్ నాంగూర్" (పెరియ తిరుమొழி –4–5–3), " నల్ల నాన్మఱైయోర్ వేళ్వియుళ్ మడుత్త నఱుమ్ పుకై విశుంబొళి మఱైక్కుమ్" (తిరువాయ్ మొ ழி– 8–4–5), "నల్ల అందణర్ వేళ్విప్పుకై మైన్నలమ్ కొండు ఉయర్ విణ్ మఱైక్కుమ్" (తిరువాయ్ మొழி– 5 –9– 5), " ఉరుక్కుఱు నఱు నెయ్ కొండు ఆరழలిల్ ఇరుక్కుమందణ ర్ శందియిన్ వాయ్ ఇరుక్కినిల్ ఇన్నిశైయానవననే" (పెరియ తిరుమొழி–6–1–7) మొదలైన చోట్ల దివ్యదేశాలలో నివసించే ఉత్తములైన బ్రాహ్మణులు కర్మలను భగవంతుని ఆరాధనగా అనుష్ఠిస్తూ ఉజ్జీవించారు అని చెప్పబడడం గమనించవచ్చు.

## 13) దేవతాకాండం– జైమినిప్రోక్తం –కాశకృత్స్న ప్రకాశితం

జైమిని కర్మ విచారాన్ని చేశారు. అయితే, దేవతా విచారాన్ని చేసినవారు ఎవరు? అనే విషయంలో మన ఆచార్యులలో కొంచెం అభిప్రాయ భేదం ఉంది. ఈ విషయాన్ని దేశికులు తత్త్వటీకలో విమర్శించారు. "కర్మదేవతా బ్రహ్మచోదనా సా త్రిథోద్భవా సూత్రకారతః, జైమినేః మునేః కాశకృత్స్నః బాదరాయణాత్ ఇత్యతః క్రమాత్ "అనే ఈ శ్రీసూక్తిని తత్త్వ రత్నాకరం అనే గ్రంథంలో శ్రీ పరాశర భట్టర్ అనుగ్రహించారు. దేశికులు శ్రీ భాష్యానికి వ్యాఖ్యానరూపంగా తాము అనుగ్రహించిన తత్త్వటీక అనే గ్రంథంలో ఈ సూక్తిని ఉదాహరించి "షోడశలక్షణీయేన జైమినీయన" అని బోధాయనులచే స్పష్టంగా అనుగ్రహింపబడిన శ్రీ సూక్తితో భేదిస్తున్నది– అని, వీటిని ఏ విధంగా సమన్వయించడం అనే విషయాన్ని చూపించారు. లక్షణం అంటే– అధ్యాయం అని అర్థం. షోడశలక్షణం అంటే– 16 అధ్యాయాలు అని అర్థం. 16 అధ్యాయాలు గల పూర్వమీమాంసా శాస్త్రం జైమినిచే రచింపబడినది అని బోధాయనుల అభిప్రాయం. 12 అధ్యాయాలు గల కర్మకాండం జైమిని రచించినది అని, తరువాత గల నాలుగు అధ్యాయాలు కశకృత్స్నులు రచించారని శ్రీ పరాశరభట్టర్ అభిప్రాయం. అందుచేత 12 +4 అనే కర్తత్వ భేదాన్ని పురస్కరించుకొని పూర్వమీమాంసను పరాశరభట్టర్ విభజించారు. ఇక్కడ పరాశరభట్టర్ అనుగ్రహించినది ప్రమాణంగా గ్రహించాలా? అనే ప్రశ్న వస్తున్నది.

శ్రీ వేదవ్యాసుల శిష్యప్రశిష్య పరంపరలో ఆవిర్భవించిన మహాచార్యులు బోధాయన మహర్షి. శ్రీ పరాశర భట్టర్ స్వామి భగవద్రామానుజుల స్థానంలో మూర్ధాభిషిక్తులై వేంచేసి ఉన్న మహాచార్యులు. ఈ మనకు ఇద్దరూ గౌరవనీయులే. అందుచేత ఈ విషయంలో మనకు ఆప్తతములైనవారిలో, ఒకరి మాటను ప్రమాణంగా గ్రహించి, ఇంకొకరి మాటను అప్రమాణమని గెంటివేయడం అనేది తగనే తగదు. మరి,

పరస్పరం విరుద్ధంగా ఉన్నట్లు తోచే ఈ ఇద్దరి సూక్తులను ఏ విధంగా సమన్వయించడం? అని అంటే, దానికి ఉండే ఒక చక్కని దారిని శ్రీదేశికులు మనకు తెలియజేశారు. అది ఏమంటే– 16 అధ్యాయాలను జైమిని రచించారు, అయితే, అందులో అంతర్భవించిన నాలుగు అధ్యాయాలు గల దేవతామీమాంసా శాస్త్రాన్ని కాశకృత్స్నులు ప్రకాశింపజేశారు –అని మనం గ్రహించాలి. దీనిని ఒక దృష్టాంతంతో వివరిస్తాను.

శ్రీ వేదవ్యాసులు మహాభారతాన్ని అనుగ్రహించిన తరువాత ఒకనాడు సరస్వతీనదీతీరంలో కూర్చుని ఉన్నారు. అప్పుడు వారి మనస్సులో చటుక్కున కారణం తెలియకుండా ఒక పెద్ద దుఃఖం మనసులో కలిగి, కంటిలో నీరు ప్రవహించడం ఆరంభించింది. అప్పుడు నారద మహర్షి అక్కడికి వచ్చారు. ఒక లక్ష, 25 వేల శ్లోకాలను కల, పంచమ వేదం అని కీర్తింపబడే మహాగ్రంథం అయిన మహాభారతాన్ని రచించి, మనసులో ఆ విధంగా గొప్ప దుఃఖంతో బాధపడుతున్న వ్యాసులను చూచి, దానికి గల కారణాన్ని ఆ నారద మహర్షి ప్రశ్నించారు. అప్పుడు వేద వ్యాసుడు తాము చాలా దుఃఖంతో ఉండడానికి గల కారణం తనకే తెలియలేదు అని అన్నారు. ఆ తరువాత నారదుడే వ్యాసులకు వారికి ఏర్పడిన దుఃఖానికి గల కారణాన్ని తెలియజేశారు.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్" అనే శ్లోకాన్ని అనుసరించి ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగు పురుషార్థాలను గూర్చి శ్రీ వేదవ్యాసులు మహాభారతంలో చక్కగా అనుగ్రహించారు. అయితే, " నారాయణకథా మిమామ్ "అని "నారాయణుని గూర్చి పలుకుతాను" అని మహాభారతాన్ని ఆరంభించిన వేదవ్యాస మహర్షి నారాయణుడైన శ్రీకృష్ణుని గూర్చి పూర్ణంగా పలుకలేదు. అందుచేత, దేనిని చెబుతాను అని ఆరంభించారో, దానిని గూర్చి సరిగా చెప్పకుండా, మిగిలిన విషయాలను అన్నిటినీ చెప్పి, "పూశల్ పట్టోలై"

(యుద్ధాల చిట్టా) అనే విధంగా ఉండే గ్రంథాన్ని రచించారు, వేదవ్యాసులు– అని వారి దుఃఖానికి కల కారణాన్ని నారద మహర్షి తెలియజేశారు.

"నారాయణ కథా మిమామ్" – నారాయణుడు ఎవరు? అని అంటే, అతడు పాండవ దూతయే. పాండవ దూతకే నారాయణుడని తిరునామం. "మహాభారతత్తాల్ తూదుపోనవనుడైయ ఏర్రమ్ శొల్లుకిఅదు" అని ఈ వచనం భూషణ దివ్యగ్రంథసూత్రం. దీనికి అరుంబదవివరణను అనుగ్రహించిన ఆచార్యులు "నారాయణ కథా మిమామ్" ఎన్హు ఆరంభిత్తారే, నారాయణన్ ఎన్నాల్ పాండవ దూతన్" ("ఈ నారాయణ కథను –అని ఆరంభించారు కదా. నారాయణుడు అంటే– పాండవ దూత" అని అనుగ్రహించారు). నారాయణుడు అనేదానికి ఏమి అర్థం? పాండవ దూత అనేదానికి ఏమి అర్థం? ఈ రెండిటిని సమన్వయం చేసి చూపవచ్చు– అని శ్రీ పెరుంబూదూర్ ఒన్హాన ఎంబార్ జీయర్ స్వామి అరుంబద వివరణలో ఈ అర్థాన్ని చూపించారు. " నరో మనుష్యార్జునయోః" ఇతి నిఘంటుః. "నరోఽర్జునే మనుష్యే చ" ఇతి వైజయంతీ. నరస్య– అర్జునస్య, ఇమే నారాః, పాండవాః, అయనాని ప్రాప్యాః, యస్య సః కృష్ణః, పాండవసేవకః ఇత్యర్థః" అనేది అక్కడ వారు చేసిన వివరణం. ఈ విధంగా భారతం రచించిన కొరత తీరేటట్లు భాగవతాన్ని తరువాత వ్యాసులు అనుగ్రహించారు అని తరువాత చరిత్ర గమనించబడుతున్నది

ఈ భాగవతాన్ని శుకభాగవతం అని అంటున్నారు కదా! మరి, ఇది వేదవ్యాసులచే అనుగ్రహింపబడిందా? లేక, శుక మహర్షి చేత అనుగ్రహింపబడిందా? అని అంటే, భాగవతం వ్యాసకృతమే, అందులో సందేహం లేదు, అయితే, దానిని శుకులు ప్రకాశింపజేశారు అనే కారణంచేత అని శుకభాగవతం అని పిలువబడుతున్నది. శ్రీరామాయణాన్ని వాల్మీకి రచించినప్పటికీ, కుశలవుల మూలంగానే అది ప్రచారానికి వచ్చింది. ఆ విధంగానే, శుకాచార్యుల ద్వారానే వ్యాస కృతమైన భాగవతం ప్రచారంలోకి

వచ్చింది. ఒక గ్రంథానికి ఒకరు కర్త కావచ్చు. ఇంకొకరు ప్రచారకులుగా ఉండవచ్చు ఆ విధంగానే దేవతాకాండం కూడా జైమినిచే రచింపబడినది అయినా, దానికి ఆకాకృత్స్నులు ప్రకాశకులు అని గ్రహించాలి.

**14) దేవతాకాండం కర్మకాండంలో అంతర్భవించినది అనే విషయాన్ని నిరూపించడం**

ఇక దీనికి తరువాత దేవతాకాండం కర్మకాండంలో ఒక విధంగా అంతర్భవించినది అనే విషయాన్ని గూర్చి కొంచెం వివరిస్తాను. అంటే, కర్మ మీమాంస అయిన 12 అధ్యాయాలతో, నాలుగు అధ్యాయాలు కలిగిన దేవతాకాండం కూడా కలుపుకోవాలి అనేది మన పూర్వాచార్యుల నిరూపణం.

"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనేది బ్రహ్మ మీమాంసలోని మొట్టమొదటి సూత్రం. ఈ సూత్రంలో "అథ" అనే శబ్దానికి భగవద్రామానుజులు ఏమి వ్యాఖ్యానం చేశారు అని అంటే, "అథ శబ్దః ఆనంతర్యే భవతి" అని ఆనంతర్యం అనే అర్థంలో వచ్చింది అని వివరించారు. ఈ అర్థాన్ని అనేది శంకరులు కూడా అంగీకరించారు. అందుచేత "అథ"అనే శబ్దానికి ఆనంతర్యం, అంటే, తరువాత అనే అర్థం అందరికీ సమ్మతం. ఇక్కడ తరువాత అని అంటే ఏమిటి? తరువాత అనే ప్రశ్న వస్తుంది. సాధన చతుష్ట సంబంధినంతరం– అని వ్యాఖ్యానం చేశారు, శంకరులు. కర్మ విచారానంతరం –అని వ్యాఖ్యానం చేశారు మన స్వామి భగవద్రామానుజులు. అందుచేత అథశబ్దానికి "తరువాత" అనే అర్థాన్ని గ్రహించడంలో ఈ ఇద్దరికీ అభిప్రాయ భేదం లేదు. అయితే, దేనికి తరువాత అనే విషయంలో మాత్రంఈ ఇద్దరూ మతాచార్యులు అభిప్రాయంలో భేదించారు.

"కర్మ విచారానికి అనంతరం" అని భగవద్రామానుజులు వివరించినందున ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది. అది ఏమంటే– కర్మ విచారానికి తరువాత దేవతా విచారం, దేవతా

విచారానికి తరువాత బ్రహ్మ విచారం —అనే క్రమం చెప్పబడి ఉన్నది. కనుక బ్రహ్మ విచారం దేవతా విచారానికి తర్వాత రావాలి. అందుచేత అథశబ్దానికి "దేవతా విచారానికి తరువాత" అని వివరించవలసినవారైన మన స్వామి భగవద్రామానుజులు ఆ విధంగా వివరించకుండా, ఎందుకు "కర్మ విచారానికి తరువాత" అని వివరించారు? అనేది ఆ ప్రశ్న.

ఈ ప్రశ్నకు తగిన సమాధానాన్ని శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారు తమ గ్రంథంలో ఒకచోట చాలా సంగ్రహంగా తెలియజేశారు. అది ఏమంటే, దేవతా విచారాన్ని కర్మ విచారంలో అంతర్గతమైనదిగా భావించారు, మీమాంసకులు. మీమాంసకులకు యాగంలోనే అభినివేశం. వారు యాగానికి చెప్పబడిన ద్రవ్యాన్ని కూడా అంగీకరించారు. యాగానికి చెప్పబడిన దేవతను కూడా అంగీకరించారు. అయితే, వారికి యాగం అనే కర్మమే ముఖ్యం. యాగమనే అంగికి అంగంగా వారు ద్రవ్యాన్ని మాత్రం గ్రహించలేదు. యాగానికి అంగంగా దేవతలను అంగీకరించారు, మీమాంసకులు. అందుచేత మీమాంసకుల సంప్రదాయంలో యోగానికి ఉండే ప్రాధాన్యం దేవతలకు లేదు. అందుచేత, కర్మ అనే అంగి విచారం లోపల దేవతా విచారమైన అంగ విచారం కూడా చేరిపోతుంది —అని వారు భావించినందున కర్మ విచారం అంగి విచారం, దేవతావిచారం అంగ విచారం —అని వారి మతంలో ఏర్పడుతున్నంది కనుక, "అంగి విచారానికి లోపల అంగ విచారం అంతర్భవింపజేయాలి" అనే అభిప్రాయంతోనే, కర్మ విచారానికి తరువాత బ్రహ్మ విచారం— అని అనడంలో ఏ విధమైన ఆక్షేపానికి అవకాశం లేదు—అని అంటున్నారు శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారు.

అందుచేత, కర్మ విచారం, దేవతా విచారం, బ్రహ్మ విచారం— అని కాండత్రయాత్మకమైన మీమాంసాశాస్త్రంలోని ఏకార్థం— బ్రహ్మ సర్వకర్మ సమారాధ్యం, సర్వదేవతాంతరాత్మభూతం పరం బ్రహ్మ వేదాంతవేద్యం— అనేది. భగవంతుడు కూడా

గీతలో “భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్, సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి” అని అన్ని కర్మలు తనకు ఆరాధనా రూపాలుగా ఉండడాన్ని స్పష్టంగా తెలియజేశాడు. సర్వకర్మల చేత ఆరాధింపబడే దేవతలకు అంతరాత్మగా భగవంతుడు ఉన్నందున, అన్ని కర్మలు వేదారర్థాలుగా ఉన్నప్పటికీ, వేదాంతార్థమైన భగవానుడు ఈ కర్మలకు ఆరాధనీయుడు అవుతున్నాడు.

మనువు తన స్మృతిలో వర్ణాశ్రమ ధర్మాలు మొదలైన అనేక విధాలుగా ఉండే ధర్మాలను అన్నిటిని విచారించడానికి ప్రయత్నించేశారు. మొట్టమొదట, ఏడు శ్లోకాలలో భగవానుని గూర్చి వర్ణించారు. మనస్మృతి అనేది ధర్మశాస్త్రం. “మనుధర్మ శాస్త్రానికి విపరీతమైన అర్థాలు అన్నీ వ్యర్థమే” అని దీనికి గొప్పతనం చెప్పబడింది. ఇటువంటి గొప్పతనం కల మనువు మొట్టమొదట “తమో భూతమ్” అని తన ధర్మశాస్త్రాన్ని అనుగ్రహించారు. మనుసప్తశ్లోకి అనే పేరుతో ప్రసిద్ధి పొందిన ఈ ఏడు శ్లోకాలు భగవంతుని జగత్కారణంగా వర్ణిస్తున్నవి. జగత్ సృష్టిని గూర్చి మనువు అన్నీ తెలియజేశాడు, ఈ ప్రకరణంలో. శ్రుత ప్రకాశికాశార్యస్వామివారు కూడా ఈ శ్రీభాష్య ప్రకరణంలో ఈ శ్లోకాలను వ్యాఖ్యానించారు. ఇక్కడ వారు ఏమని ప్రశ్నిస్తున్నారు? అని అంటే, మనువు ధర్మశాస్త్రం చెప్పాలని ప్రయత్నం చేశారా? బ్రహ్మవిచారాన్ని చేయాలని ఆరంభించారా? ధర్మాలను గూర్చి చెప్పాలని వచ్చినవారు ఎందుకు నారాయణుని గూర్చి విచారిస్తున్నారు? అనేది వారు చేసిన ప్రశ్న.

ఇతిహాస పురాణాలు నారాయణుని గూర్చి చెప్పడానికి ఏర్పడినవి. ధర్మశాస్త్రాలు అన్ని ధర్మాలను గూర్చి చెప్పడానికి ఏర్పడినవి. ఇతిహాస పురాణాలలో కూడా కొన్నిచోట్ల ధర్మ విచారాలు చేయబడ్డాయి. ధర్మశాస్త్రాలలో కొన్నిచోట్ల నారాయణుని గూర్చి విచారింపబడింది. దీనివల్ల ఏమి అర్థం తెలుస్తున్నది? అని అంటే, ధర్మశాస్త్రాలలో చెప్పబడిన ధర్మాలు ఆరాధనా రూపమై ఏర్పడి ఉన్నందున, ఈ

ఆరాధనలు అన్నీ ఎవరికి? అనే ఆకాంక్షలో, వీటికి ఆరాధ్యుడైన భగవానుని గూర్చి వీటిని వివరించే గ్రంథాలలో చెప్పబడ్డాయి. ఈ కారణం చేతనే నారాయణుని గూర్చి చెప్పబడిన ఇతిహాస పురాణాలలో ఇతనికి ఆరాధనారూపాలైన ధర్మాలను గూర్చి చెప్పబడింది. అందుచేత ఆరాధ్యుని గూర్చి చెప్పబడుతున్నచోట్ల ఆరాధనలను గూర్చి, ఆరాధనలను గూర్చి చెప్పబడుతున్న చోట్ల ఆరాధ్యుని గూర్చి పలుకడం అనేది మన ఋషుల దర్శించిన క్రమం.

ఈ విధంగా ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉండే ధర్మాలకు ఆరాధ్యుడు భగవానుడైన శ్రీమన్నారాయణుడే– అనే విషయాన్ని సుస్థిపించడం కోసమే మనుసప్తశ్లోకి అవతరించింది అనే విషయాన్ని శ్రీ శ్రుతప్రకాశికాచార్య స్వామివారు చాలా అందంగా వ్యక్తం చేశారు. ఈ క్రమంలోనే కాండత్రయాత్మకమైన మీమాంసా శాస్త్రం ఒకటే శాస్త్రం అనేది మన పూర్వులు చేసిన నిరూపణం.

## 15) తత్త్వనిరూపణం

ఈ భాష్య గ్రంథానికి తరువాత శ్రీరామానుజులు అనుగ్రహించిన బ్రహ్మసూత్ర వ్యాఖ్యాన గ్రంథమే వేదాంత దీపం. ఇది శీభాష్యానికి సంగ్రహంగా ఏర్పడి ఉన్నది. ఈ విషయాన్ని స్పష్టంగా శ్రీ రామానుజులే అనుగ్రహించారు. శ్రీ భాష్యంలో చెప్పబడిన అర్థాన్ని సంగ్రహంగా తెలుపుతున్నట్లు ఆ గ్రంథం ప్రారంభంలోనే శ్రీ రామానుజులు ప్రతిజ్ఞ చేశారు.

ఈ గ్రంథంలో ఒక విశేషం ఉన్నది. అది ఏమి? అంటే, ఒక్కొక్క సూత్రానికి శీభాష్యంలో చూపబడిన అర్థాలను శ్రీ రామానుజులు ఇక్కడ సంగ్రహంగా తెలుపుతున్నారు అనేది కాదు. ఒక్కొక్క అధికరణానికి ఎన్ని సూత్రాలు ఉన్నా, వాటిలో మొదటి సూత్రానికి ఉండే అర్థాన్ని మాత్రం తప్పకుండా ఈ గ్రంథంలో

అనుగ్రహించారు. ఒకే సూత్రం ఉండే అధికరణం అయినా, లేక, ఫలు సూత్రాలు ఉందే అధికరణం అయినా, మొదట సూత్రానికి మాత్రమే సూత్రార్థాన్ని రచించాలి– అనే నిర్బంధాన్ని గ్రహించి, ఈ గ్రంథాన్ని శ్రీరామానుజులు అనుగ్రహించారు. ఈ సూత్రం పూర్వపక్షాన్ని తెలిపే సూత్రంగా కూడా ఉండవచ్చు, లేక, సిద్ధాంతాన్ని తెలియజేసే సూత్రంగా కూడా ఉండవచ్చు. ఏ విధంగా ఉన్నా, ఈ విచారంలో అంతా ప్రవేశించకుండా, మొదట సూత్రానికి మాత్రం అర్థాన్ని తెలియజేశారు, శ్రీరామానుజులు.

ఈ గ్రంథంలోని ఉపోద్ఘాత ప్రకరణంలో ఆశ్చర్యకరంగా ఒక విషయాన్ని శ్రీరామానుజులు మనకు తెలియజేశారు. వైదిక ప్రక్రియ అనేది ఏమి? అనే విషయాన్ని గూర్చి అత్యద్భుతంగా వారు అనుగ్రహించారు. " ఆత్రేయమేవ హి వేదవిదాం ప్రక్రియా" అనేది అక్కడ శ్రీ రామానుజుల శ్రీసూక్తి క్రమం. " వేదాన్ని తెలిసినవారు చెప్పే క్రమం ఏది? " అని ప్రశ్న చేసికొని, వేద ప్రమాణాన్ని అంగీకరించి, వేదాంతార్థాలను యథాతథంగా తెలుపగల వైదికలు బ్రహ్మసూత్రాల అర్థ విశేషాలను ఏ విధంగా స్పందిస్తున్నారు? అనేదానికి క్రమాలను అన్నిటినీ వారు చూపించారు. వైదిక సిద్ధాంతం అనేది ఏమి? అనే విషయాన్ని గూర్చి తెలియజేయాలని అభిప్రాయపడినవారై, మునుముందుగా తత్వత్రయాల స్వరూప స్వభావ విశేషాలను గూర్చి అనుగ్రహించారు.

తత్త్వం అంటే, యథార్థమైన వస్తువు –అని అర్థం. అనాది అయినది, పరమ వైదికమైనది అయిన మన విశిష్టాద్వైత సిద్ధాంతంలో తత్త్వాలు మూడు అని ఒప్పుకొనబడ్డాయి. అవి, చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు– అనే మూడు తత్త్వాలే అవి.

సాంఖ్యులు చిత్త, అచిత్తు అని రెండు తత్త్వాలను మాత్రమే అంగీకరించారు. వరి మతంలో ఈశ్వర తత్త్వం అనేది లేదు. శంకర మతంలో ఈశ్వర తత్వాన్ని మాత్రం ఒప్పుకొని, చిత్తు, అచిత్తుతత్త్వాలను లేవు అని విడచి పెట్టారు, అయితే, తత్వత్రయ

వాదమే వేదం తెలిసినవారి మతం— అని అంటున్నారు< మన స్వామి భగవద్రామానుజులు. దీనికి సాక్షిగా ఎన్నో ప్రమాణవచనాలను వారు ఉదాహరించారు.

ఆచిత్తు అనేది జ్ఞానశూన్యమైన తత్త్వం చిత్తు అనేది జ్ఞాన విశిష్టమైన తత్త్వం. ఈ రెండు తత్త్వాలకు నియంతయై ఉండే సర్వేశ్వరుడు మూడవ తత్త్వం. దీనిని స్పష్టంగా వేదాంతమే తెలుపుతున్నది. భోక్తభాగ్యం ప్రేరితారంచ మత్వా అని వేదాంతవాక్యం ఈ విషయాన్ని తెలుపుతున్నది ఈ వేదవాక్యంలో "భోక్తా" అనే పదంచేత జీవాత్మ. "భోగ్యమ్" అనే పదంచేత అచిత్ తత్త్వం, " ప్రేరితారమ్" అనే పదం ద్వారా వీటికి నియంత అయిన పరమాత్మ చెప్పబడ్డారు.

ఈ ఉపనిషద్వాక్యం తత్త్వ త్రయ స్వరూపకథనం, అంటే, వీటి స్వరూప స్వభావ అన్యథాభావనిరూపణం చేస్తున్నది వాస్తవాన్ని మనం తెలియాలి. అది ఏమంటే, ఆకాశాదులైన అచిత్ పదార్థాలకు స్వరూప వికార రూప కార్యత్వం, జీవాత్మలకు స్వభావ వికార రూప కార్యత్వం ఉన్నది. భోగ్యభూతమైన ప్రకృతి తత్త్వం మహత్, అహంకార, భూత పంచక, ఇంద్రియాది రూపంలో స్వరూప పరిణామాన్ని పొందితే తప్ప జీవాత్మలకు అది భోగ్యం కాబోదు. జీవాత్మ స్వరూపతః వికారం లేనివాడై, తన స్వభావమైన ధర్మభూతజ్ఞనంయొక్క వికాసం చేత ప్రాకృత పదార్థాలను అనుభవించే భోక్త అవుతున్నాడు. అందుచేత ఇతనికి జ్ఞానవికారమే కలుగుతుంది ఆవశ్యకం. ఇందుచేత భగవంతుడు ఆత్మలకు స్వభావ వికాసం కలిగించడం కోసం ప్రకృతిని ప్రాకృతమైన స్వరూపంతో పరిణమింప జేస్తున్నాడు అని తెలుస్తున్నది. చిత్తు అచిత్తు తత్త్వాలను గూర్చిన ఈ యథార్థాలు "సర్వం బ్రహ్మకార్యం" అనే వాస్తవాన్ని తెలుపుతున్నవి.

ఈ విధంగా తత్త్వత్రయ వాదాన్ని వేదాంతం స్పష్టంగా చెబుతూ ఉండగా, ఈశ్వర తత్త్వం లేదు, ప్రకృతి పురుషులు మాత్రమే ఉన్నారు –అని కానీ, లేక, బ్రహ్మం మాత్రమే ఉన్నది, ప్రకృతి జీవ తత్త్వాలు లేవు– అని కానీ వైదికులు ఏ విధంగా చెప్పడానికి వీలవుతుంది? అని ప్రశ్నిస్తున్నారు మన స్వామి భగవద్రామానుగజులు. ఈశ్వరుని వైలక్షణ్యం ఏమి? స్వామిత్వం. జీవునకు ఉండే అసాధారణ ధర్మం ఏమి? దాస్యత్వం. ఈ రెండిటిని ఈ మతంలో ఉండేవారు లేవు అని అంటున్నారు. వైదిక ప్రక్రియలో స్థిరం గా నిలచి ఉండే మన పూర్వాచార్యులు అయితే, జీవునకు అతనికి తగిన అసాధారణ ధర్మమైన దాస్యత్వం ఉంటేనే పరమాత్మకు స్వామిత్వం సిద్ధిస్తుంది– అని, పరమాత్మ కూడా అతనికి తగిన విలక్షణ స్వభావమైన స్వామిత్వం ఉంటేనే జీవాత్మల దాస్యత్వం సిద్ధిస్తుంది–అని నిరూపించారు.

అందుచేత, ఈ విధంగా, చిత్తు, ఈశ్వరుడు– అనే రెండు తత్వాలను తప్పక ఒప్పుకోవాలి. ఇందులో, జీవాత్మతత్వానికి భోగ్యంగా ఉండేది చైతన్య శూన్యమైన అచిత్ తత్వం. ఈ అచిత్తు అనబడే భోగ్యాన్ని అనాదికాలంగా అనుభవిస్తూ వస్తున్నాడు, జీవాత్మ. దీనివల్ల పరమాత్మ అనుభవానికి ఇతడు కరావడమే లేదు. ఈ అచిదనుభవాన్ని త్యాజ్యంగా భావించి, దీనిని విడచిపెట్టి, పరమాత్మ అనుభవానికి ఎవడైనా ఆశపడి వస్తాడా? అనే విషయంకోసమే అన్ని శాస్త్రాలు అవతరించాయి.

శ్రీ శ్రుతప్రకాశికాచార్య స్వామివారు అత్యద్భుతంగా ఒక విషయాన్ని అనుగ్రహించారు. అది ఏమంటే, ఒకడు ఆస్తికుడుగా ఉండవచ్చు, నాస్తికుడుగా ఉండవచ్చు, విద్వాంసుడుగా ఉండవచ్చు, విద్య లేని వాడుగా ఉండవచ్చు, బ్రాహ్మణుడుగా ఉండవచ్చు, అబ్రాహ్మణుడుగా ఉండవచ్చు, దైవంగా ఉండవచ్చు, మానవుడిగా ఉండవచ్చు, పురుషుడుగా ఉండవచ్చు, స్త్రీగా ఉండవచ్చు, ఎవరు ఈ విధంగా ఉన్నా, అందరూ కోరేది సుఖాన్నే, అందరూ వద్దనుకునేది దుఃఖాన్నే. అయితే,

సుఖాన్ని ఒకడు దుఃఖంగా భ్రమించవచ్చు, దుఃఖాన్ని సుఖంగా భావించి భ్రమించవచ్చు. నిజానికి చూస్తే, మనకు ఏది సుఖం? ఏది దుఃఖం? అనే విషయాన్ని శాస్త్రమే తెలియజేసింది దీనిని ఏ విధంగా తెలియజేస్తున్నది? అని అంటే, దుఃఖానికి అవధి –అనంత క్లేశ భాజనమైన సంసారం, సుఖానికి అవధి– నిరతిశయానంత ప్రాప్తి అయిన మోక్షం.

అழகియ మణవాళ పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు ఆచార్యహృదయం అనే గ్రంథం ఆరంభంలో ఈ అర్థాన్నే తెలియజేశారు. "అనంత క్లేశనిరతిశయానందహేతు జ్ఞాతవ్య పంచకజ్ఞానాజ్ఞానంగళ్"(సూత్రం –5) అని సంసారవర్ధనానికి జ్ఞానం కారణం, అంటే, జ్ఞానం అంటే అర్థ పంచక జ్ఞానం, అది కూడా జ్ఞాతవ్యార్థపంచక జ్ఞానం, అంటే, తెలియవలసిన ఐదు విషయాలను తెలుసుకోవడం –అని అంటున్నారు, సూత్రకారులు. ఈ ఐదు విషయాలను గూర్చిన జ్ఞానాన్ని మనకు కలిగించడం కోసమే అన్ని శాస్త్రాలు ఏర్పడ్డాయి. వేదవేదాంతాలు, ఇతిహాస పురాణాలు, బ్రహ్మసూత్రాలు, శ్రీమద్భగవద్గీత, ఆళ్వారుల దివ్య ప్రబంధాలు, పూర్వా ఆచార్యుల దివ్య గ్రంథాలు– అన్నీ జ్ఞాతవ్యార్థ పంచక ప్రతిపాదకాలే.

ఈ అర్థ పంచకాన్ని శ్రీ వేదవ్యాసులు శారీరకం ఈ అనబడే బ్రహ్మ మీమాంసాశాస్త్రంలో అద్భుతంగా వివరించి చూపించారు– అని మన స్వామి భగవద్రామానుజులు అర్థ పంచక వివరంగా పలు పలు అర్థ విశేషాలను అన్నిటినీ తమ శీభాష్యాదిగ్రంథాలలో అద్భుతంగా నిరూపించారు. అందు మొట్టమొదటగా తత్వత్రయ విభాగం చేసి, చిత్ అంటే ఏమి? , అచిత్ అంటే ఏమి? , ఈశ్వర తత్వం అంటే ఎటువంటిది? అని ఈ విషయాలను అన్నిటిని వర్ణించారు. ఈ మూడు తత్వాలను గూర్చి వేదాంతం స్పష్టంగా తెలియజేసింది. తన స్వరూపంతోనూ, స్వభావంతోను అచేతన వస్తువుల కంటే విలక్షణుడుగా ఉండేవాడు– దానికి ఆత్మ అయిన చేతనుడైన

జీవాత్మ, జీవాత్మ వర్గం అనేది బద్ధుడు, ముక్తుడు, నిత్యుడు –అని మూడు విధాలుగా ఉంటుంది. ఈ జీవాత్మ వర్గం కంటే విలక్షణమైనవాడై, నిఖిలహేయ ప్రత్యనీకుడై, సమస్త కళ్యాణగుణైకతానుడైనవాడు పరమాత్మ. అన్ని దశలలోనూ చేతనా చేతన విభాగం లేకుండా వాటికి నియామకుడుగాను, ధారకుడుగాను, శేషిగాను ఉండడం ద్వారా, వాటికంటే పరమ విలక్షణమైనవాడు, ఈ పరమాత్మ. పరమాత్మకు కళ్యాణ గుణాలు లేవు –అనే వాదాన్ని ఈ లోకంలో ప్రచారం చేయడం కోసం వచ్చినవారు– అద్వైతులు. పరమాత్మకు సమస్త కళ్యాణ గుణాలు ఉన్నాయి– అని స్థాపించడం కోసమే అవతరించినవారు మన స్వామి భగవద్రామానుజులు.

తత్వత్రయాన్ని గూర్చి ఈ విధంగా సంగ్రహంగా తెలియజేసి, దీనికి ఆధారంగా పలు ప్రమాణవచనాలను కుదృష్టులు నోరు తెరవడానికి వీలు లేని విధంగా ఉదాహరించారు, భగవద్రామా నులు. ఈ ప్రమాణ వచనాలను శ్రీరామానుజులు ఉదాహరించిన రీతిలోనే మనం కూడా అనుభవంలోకి తెచ్చుకోవడం ఆవశ్యకం. మునుముందుగా వేదవేద్యుడైన శ్రీకృష్ణపరమాత్మయొక్క గీతావచనాన్ని ఉదాహరిస్తున్నారు, శ్రీరామానుజులు.

తత్వత్రయాన్ని గూర్చి ఇంతవరకు మనం అనుభవించిన విషయాలకు అనుబంధంగా, కీర్తిమూర్తి, న్యాయవేదాంత విద్వాన్, శ్రీ ఉ. వే. కార్పంగాడు వేంకటాచార్య స్వామివారు అనుగ్రహించిన తత్త్వ నిర్ణయం అనే వ్యాసంనుండి కొన్ని భాగాలు ఇక్కడ సంగ్రహింపబడుతున్నాయి.

## 16)తత్త్వనిర్ణయం

1) ధర్మం, అర్థం, కామం, మోక్షం అని నాలుగు పురుషార్థాలు. వీటిలో, మోక్షం అనబడే పురుషార్థం పరమ పురుషార్థం అనబడుతున్నది.

2) "తత్వజ్ఞానాత్ మోక్షలాభః" అనే ప్రసిద్ధమైన వచనానుసారం మోక్షాన్ని పొందాలని కోరే చేతనుడు మొదట జ్ఞానాన్ని సంపాదించాలి.

3) మోక్ష సాధనం జ్ఞానం అనే విషయం సకల సిద్ధాంత సాధారణం అయినా, మోక్షస్వరూపంలోనూ, సాధన జ్ఞాన స్వరూపంలోనూ ఆయా సిద్ధాంత ప్రవర్తకులైన ఆచార్యులకు అభిప్రాయ భేదం ఉన్నది.

4) ఇక్కడ మోక్ష సాధనంగా చెప్పబడే జ్ఞానం తత్వ నిర్ణయ సాపేక్షం.

5) తత్వం అనేది మూడు అని చెప్పేటట్లుగాను, ఒకటి అని చెప్పేటట్లుగాను ఉన్నది. ఈ అర్థం ఉపనిషత్ సిద్ధాంతం.

6) తత్వాన్ని పరతత్వం, అని అవర్తత్వాలు అని రెండు విధాలుగా విభజించవచ్చు. చేతనునకు ప్రాప్యమై, ఇతనికి ఇష్టమైన ఐశ్వర్యం మొదలైన పుషార్థాలను ఇచ్చేదై, ఇతడు చేసే ఉపాసనం మొదలైనవానికి విషయమై ఉండే పరదేవత పరతత్వం అనబడుతున్నది. ఆ పరదేవతకు శరీరంగా చెప్పబడే, జ్ఞానం కల చేతనుడు, జ్ఞానం లేని అచేతన వస్తువులు అవరతత్వాలు అనబడుతున్నాయి.

7) చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే తత్వాలను తెలియజేసే శ్రుతివాక్యాలు వాస్తవంగా ఉండే మూడు యథార్థమైన తత్వాలను తెలుపుతున్నందున, అవి కూడా ఉపపన్నాలే. (సిద్ధాంతానికి పోసగేవిగా అంగీకరించదగినవే) బ్రహ్మం ఒక్కటే ఉన్నది, ఇక ఏమీ లేదు —అనే అద్వైతాన్ని తెలిపే శ్రుతివాక్యాలు కూడా చేతనా చేతనాలను

శరీరంగా కలిగిన ఈశ్వరుడు ఒక్కడే కనుక, అటువంటి వస్తువు వేరొకటి లేదు కనుక, అవి కూడా అర్థానికి పొసగేవే, అంటే, ఉపపన్నాలే.

8) ఏ ధర్మం ఏ వస్తువులో మాత్రం ఉండి, మిగిలిన వస్తువులలో లేకుండా ఉంటుంద, ఆ ధర్మం ఆ వస్తువునకు అసాధారణమైన ధర్మం, అంటే, లక్షణం అనబడుతున్నది. దీని ప్రకారం చూస్తే, చిత్ అని, చేతనుడు అని చెప్పబడే జీవాత్మకు కల అసాధారణమైన ధర్మం దాస్యం అనబడుతున్నది. ఈ దాస్యం అనబడే అసాధారణమైన ధర్మంతో జీవాత్మ మిగిలిన వస్తువుల కంటే విలక్షణుడుగా, యథాతథంగా తెలియబడుతున్నాడు. దాస్యమంటే– జ్ఞానంతో కూడిన శేషత్వం, అంటే, భగవంతుడు తన ఇష్ట ప్రకారంగా వినియోగించుకొనడానికి యోగ్యమై ఉండడం. ఈ దాస్యశరీరంలో చేరిన జ్ఞానం అనే అంశం– అచేతన వస్తువుల కంటే జీవాత్మ భిన్నుడు అని తెలియడానికి హేతువుగాను, శేషత్వం అనే అంశం– ఈ జీవుడు ఈశ్వరుని కంటే వేరైనవాడు అని తెలియడానికి హేతువుగాను ఉంటాయి.

9) " దాసభూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అనే వచనానుసారం, భగవంతునకు చేసే స్వాభావిక దాస్యంతో సత్తను పొందేవారు చేతనులు అని చెప్పబడుతున్నందున, దాస్యం ఆత్మకు ప్రధాన ధర్మం అనేది స్పష్టం. "అడిగేనుళ్ళాన్" అనే ఆళ్వారుల దివ్య సూక్తిలో, ఈ దివ్యసూక్తి వ్యాఖ్యానంలో చెప్పబడిన ఐతిహ్యంలోనూ ఈ యథార్థం స్పష్టంగా తెలియబడుతున్నది.

10) అచేతన వస్తువులను గూర్చి తెలియబడే అసాధారణ ధర్మం ఏమంటే, జ్ఞానం లేకుండా ఉండడం. ఈ ధర్మం అల్పజ్ఞానాన్ని కల జీవాత్మ దగ్గర, పూర్ణజ్ఞానాన్ని కలవాడైన భగవంతునిలోనూ లేకుండా, అచేతన వస్తువులలో మాత్రం ఉన్నందున,

వాటికి అసాధారణ ధర్మం అవుతున్నది. అందువల్లనే జీవేశ్వరుల కంటే అచేతన వస్తువు విలక్షణంగా తెలియబడుతున్నది.

11) భగవంతుని దగ్గర ఉండే అసాధారణమైన ధర్మం– శాసనం, అంటే, నియంతృత్వం. ఇది మిగిలిన వస్తువులలో దేనిలోనూ లేకుండా, భగవంతునితో మాత్రం ఉన్నందున, ఆ స్వామికి అసాధారణమైన ధర్మం అవుతున్నది. ఈ విషయం ఉపనిషత్ సిద్ధం. చాందోగ్యోపనిషత్తులో ఆరవ ప్రపాఠకంలో చెప్పబడే విద్య సద్విద్య అనబడుతున్నది. అక్కడ చెప్పబడుతున్న విషయం ఇది. అది ఏమంటే, ఈ ప్రకరణంలో పరబ్రహ్మకు ఆదేశ శబ్దంతో నియమనాన్ని అసాధారణమైన ధర్మంగా చెప్పబడడం సుస్పష్టం.

12) అందుచేత, చిత్తులో దాస్య ధర్మాన్ని, అచిత్తులో జ్ఞాన శూన్యత్వాన్ని, ఈశ్వరునిలో నియంతృత్వాన్ని అసాధారణమైన ధర్మమని తెలుసుకున్నప్పుడే, చిత్, అచిత్, ఈశ్వరుడు– అనే యథార్థతత్వాలను ఒకడు యథాతథంగా తెలుసుకున్నవాడు కాగలడు. అటువంటి జ్ఞానమే పరమ పురుషార్థమైన మోక్షానికి ఉపయోగి కాగలదు.

## 17) శరీరాత్మ భావం

సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ, ఉపబృంహిత వేదాయ నమో వ్యాసాయ విష్ణవే" అనే వచనానుసారం భగవంతుని అంశావతార భూతులైన శ్రీ వేదవ్యాసులు మహాభారతాన్ని అనుగ్రహించారు. శారీరకమనబడే బ్రహ్మ మీమాంసా శాస్త్రాన్ని కూడా అనుగ్రహించారు. ఇందుచేత వీరు చేసిన మహోపకారం వేదాంతోపబృంహణం. వేదాంతంతో వేదాంతార్థాన్ని తెలిసే కాలంలో వేదాంతాన్ని మాత్రం గ్రహించి వేదాంతార్థాన్ని తెలియడం సాధ్యం కాదు. వేదాంతర్థాన్ని

యధాతథంగా తెలిసికోవడానికి వాటికి ఉపబృంహణాలై ఉండే ఇతిహాసాలు, పురాణాలు, ఇంకా, న్యాయశాస్త్రం కూడా ఆవశ్యకాలు అవుతున్నాయి.

న్యాయ శాస్త్రం అంటే ఏమి? న్యాయశాస్త్రం అంటే— శారీరక మీమాంసా శాస్త్రం. శారీరకానికి న్యాయ శాస్త్రం అనే పేరు దేనివల్ల వచ్చింది? అని అంటే, ఇందులో ఒక్కొక్క అధికరణంతో ఒక్కొక్క న్యాయాన్ని చూపి, ఒక్కొక్క సారార్థాన్ని శ్రీ వేదవ్యాసులు నిష్కరించినందున ఈ శారీరకమే న్యాయకలాపం అనబడుతున్నది. ఒక్కొక్క అధికరణంలోను ఒక్కొక్క న్యాయం అనే లెక్కలో 156 న్యాయాల కలాపంగా, అంటే, సమూహంగా ప్రకాశిస్తున్నది, శారీరకం. "ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా, యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (ఋషులచేత సాక్షాత్కరింపబడిన వేదాలను, ధర్మాలను ఉపదేశించే స్మృతులు మొదలైనవానిని తర్కంతో ఎవడు విచారిస్తున్నాడో, అతడే ధర్మాన్ని తెలిసినవాడు. మిగిలినవాడు తెలియలేడు) అని అంటున్నది, మనువచనం. శ్రీభాష్యం ఆరంభంలో మన స్వామి భగవద్రామానుజులు కూడా "న్యాయానుగృహీతస్య వాక్యస్య అర్థనిర్ణయకత్వాత్" (న్యాయంతో అనుగ్రహింపబడిన వాక్యానికే అర్థాన్ని నిర్ణయం చేసే స్వభావం ఉన్నందున) అని అన్నారు. శారీరక శాస్త్రం, ఈ భాష్యాది తత్త్వ వివరణ గ్రంథాలు ఈ రీతిలోనే నిర్మింపబడినవిగా గోచరిస్తున్నాయి.

ఈ గ్రంథానికి శారీరకం అనే పేరు ఏ విధంగా వచ్చింది అని గమనించాలి "సంహితం ఏతత్ శారీరకమ్" అని బోధాయనమహర్షి అన్నారు. "బోధాయనుల వృత్తి గ్రంథాన్ని అనుసరించి భాష్యాన్ని రచిస్తున్నాను"అని శ్రీ భాష్య గ్రంథంలో భగవద్రామానుజులు " భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్ర వృత్తిం పూర్వాచర్యాః సంచిక్షిపుః" అనే ప్రతిజ్ఞా వాక్యాన్ని అనుగ్రహించారు. శారీరకం అంటే ఏమి, శారీరుడు అంటే ఎవరు? శారీరక అంటే ఏమి? అని ఈ విధంగా మన పెద్దలు విస్తృతంగా నిరూపించారు. మనకు

ఉండేది శరీరం అనబడుతున్నది. మనకు ఉండేది ఒక శరీరం. కొందరు పెద్దలు పలు శరీరాలను పరిగ్రహించారు అనే విషయం కూడా మనం తెలుసుకుంటున్నాం. సౌబరిమహర్షి 50 శరీరాలను పరిగ్రహించారు అనేది పురాణ ప్రసిద్ధం. భగవానునుడయితే, జగత్తునే శరీరంగా కలవాడు. "యస్యాత్మా శరీరం, యస్య పృథివీ శరీరం", " ఏష సర్వభూతాంతరాత్మా అపహత పాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అనే వేదాంతవాక్యం భగవంతుడు తప్ప మిగిలిన అన్ని చేతనాచేతన పదార్థాలు కూడా భగవంతునకు శరీరం అని స్పష్టంగా తెలుపుతున్నది. అంటే, ఆత్మపదార్థాలతో, అచేతన పదార్థాలతో తేడా లేకుండా చేతనా చేతనద్రవ్యాలను అన్నిటిని భగవంతుడు తనకు శేషంగాను, నియామ్యంగాను, ధార్యంగాను వ్యాప్తి విశిష్టుడై కలిగి ఉన్నాడు, వ్యాప్యమై, ధార్యమై, నియామ్యమై ఉండేది శరీరం, వ్యాపకుడై, ధారకుడై, నియామకుడై, శేషియై ఉండేవాడు ఆత్మ. ఇది మన సంప్రదాయానుసారంగా శరీరాత్మభావాన్ని అనుసరించిన లక్షణం.

శ్రీ భాష్యంలో "యస్య చేతనస్య యత్ ద్రవ్యం సర్వాత్మనా స్వార్థే నియంతుం ధారయతుం చ శక్యం తచ్ఛేషతైకస్వరూపం చ, తత్ తస్యశరీరమ్" (2—1—4) (ఏ చేతనునకు ఏ ద్రవ్యం తానుండేవరకు ఆ చేతనుని ఉపయోగ కోసం అతనిచే నియమించడానికి, ధరించడానికి తగినదిగా ఉంటుందో, అతనికి శేషంగా ఉండడమే స్వభావంగా కలిగి ఉంటుందో, ఆ ద్రవ్యం ఆ చేతనునకు శరీరం) అని మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించారు. ఆత్మ అని ఏ వస్తువును చెప్పినప్పటికీ, అది వ్యాపకమై, ధారకమ, శేషియై, నియంతయై ఉంటుంది. ధార్యమై, నియమ్యమై, శేషమై, వ్యాపకమై ఉండే శరీర లక్షణం అనేది అచిత్తుకు కూడా సమానమే. చిత్తుకూ సమానమే. దీని ప్రకారం చూస్తే, ధార్యమై, శేషమై, నియామ్యమై ఉండే జగత్తు, అంటే,

చిదచిత్తులు—భగవంతుడు అనే ధారకునకు, భగవంతుడనే నియంతకు, భగవంతుడనే శేషికి శరీరమై ఉంటాయి.

అందుచేత, "ఈ జగత్తు అనేది భగవంతుని శరీరమై ఉన్నది, దీనికి భగవంతుడు ఆత్మ అవుతున్నాడు" అని జగత్తుకు, భగవంతునకు మధ్య ఉండే ఈ సంబంధాన్ని నిర్దేశించేదే శరీరాత్మ భావం అనబడుతుంది. "జగచ్ఛరీరీ విష్ణుః" అనేదే వేదాంత సిద్ధాంతాలలో చాలా ముఖ్యమైనది. పరమ కారుణికులైన మన స్వామి భగవద్రామానుజులు చాలా ఆదరించి, మనకు దర్శింపజేసినది, వాస్తవమైనది, అనది అయినది, పరమ వైదికమైన మన విశిష్టాద్వైత సిద్ధాంతంలోని ప్రధాన ప్రతి తంత్రార్థమైనది ఇదే. అంటే, మన సిద్ధాంతానికి అసాధారణమైనది, మూల భూతమైనది అయిన వేదాంత సిద్ధాంతం ఇదే. ఈ శరీరాత్మ భావాన్ని పురస్కరించుకునే మన సంప్రదాయంలో తత్త్వ హిత పురుషార్థ నిర్ణయాన్ని మన పూర్వాచార్యులు నిర్ణయించి పలికారు.

తత్త్వ వివరణ చేసేటప్పుడు— అవరతత్త్వం శరీరం, దీని కంటే ఎన్నో రెట్లు ఉన్నతమైనది ఆత్మతత్త్వం అని తెలియాలి. ఆత్మ తత్త్వం ఉన్నతమైనది అనే విషయం, ఇంతకంటే చాలా తక్కువ అయిన తత్త్వం శరీరం అనేది మనకు అనుభవ సిద్ధం. అదేవిధంగా, ఉన్నతమైన ఆత్మనే తనకు శరీరంగా కలిగి, ఆ ఆత్మకు కూడా ఆత్మగా ఉండే భగవంతుడు పరతత్త్వం అవుతున్నాడు.

శారీరకుడు అంటే —జగత్తును శరీరంగా కలిగిన వాడు— అని అర్థం. వేదవ్యాస కర్తృకమైన శారీరక మీమాంసా శాస్త్రం శారీరకుడైన భగవంతుని గూర్చి తెలియజేసే శాస్త్రంగా ఉన్నందున శారీరకం అనబడుతున్నది. ఆనందమయాధికరణ శ్రీభాష్యంలో భగవద్రామానుజులు "స్వవ్యతిరిక్త చేతనాచేతన వస్తుజాతం స్వశరీరమితి స ఏవ నిరుపాధిక శారీర ఆత్మా, అత ఏవేదం పరం బ్రహ్మాధికృత్య ప్రవృత్తం శారీర

మిత్యభియుక్తై రభిధీయతే" (తనకంటే వేరైన చేతనాలను శరీరంగా కలిగినవాడై పరమ పురుషుడు ఉన్నందున అతడే సహజంగా శారీరుడు అయిన ఆత్మ అవుతున్నాడు. అందువల్లనే ఇటువంటి పరతత్వాన్ని గూర్చి ఏర్పడిన ఈ శాస్త్రం శారీరక శాస్త్రం అని అభిజ్ఞులచే చెప్పబడుతున్నది అని అనుగ్రహించారు. వేదాన్ని కమ్మని ద్రావిడ భాషలో అనుగ్రహించి నమ్మాళ్వార్లు కూడా "ఉడన్ మిశై ఉయిరెన కరందెంగుమ్ పరందుళన్"అని, "ఉయిరినాల్ కుఱైవిలన్" అని అనుగ్రహించారు. వేదాంతదేశికులు కూడా న్యాయ సిద్ధాంజనం అనే గ్రంథంలో "స్వేతర సమస్త ద్రవ్య శారీరకత్వమ్" – అని, అంటే, తాను, తన జ్ఞానం తప్ప, మిగిలిన అన్ని ద్రవ్యాలను శరీరంగా కలిగి ఉండడం అని ఈ శరీరాత్మభావాన్ని పురస్కరించుకొని ఈశ్వర లక్షణాన్ని నిరూపించారు.

భగవంతుడు శారీరుడు అని మన ఆచార్యులు మాత్రమే పలుకుతున్నారు అని అర్థం కాదు, వేదాంతమే పలుకుతున్నది– అనే విషయాన్ని మునుముందుగా చూసాము. వేదోపబృంహణంగా అవతరించిన శ్రీరామాయణంలో కూడా ఈ సత్యాన్ని గమనించవచ్చు. రావణవధ అయిన తరువాత, శ్రీరాముని బ్రహ్మ మొదలైన దేవతలు అందరూ స్తోత్రం చేసే సమయంలో "జగత్ సర్వం శరీరం తే" అని అంటూ బ్రహ్మ శ్రీరాముని స్తోత్రం చేస్తున్నట్లు శ్రీ రామాయణ వచనం. ఈ వచనాన్ని మన స్వామి భగవద్రామానుజులు శ్రీ భాష్యంలో ఉదాహరించారు. అందుచేత అన్ని శాస్త్రాలలోనూ భగవంతుడు జగత్తుకు ఆత్మ, జగత్తు అంతా భగవంతుని శరీరం –అని జగత్తుకు, బ్రహ్మకు మధ్య ఉండే శరీరాత్మ సంబంధం వ్యక్తంగా చెప్పబడింది. నారాయణ శబ్దంలోని పరమార్థమే ఇది. నారాలకు భగవంతుడు ఆత్మగా ఉన్నాడు, ఇంత మాత్రమే కాదు, నారాలను అయనంగాను కలిగి ఉన్నాడు, భగవంతుడు. దీనినే బహువ్రీహి సమాసం అని అంటున్నారు. "నారాః అయనం యస్య సః". దీని ద్వారా చెప్పబడినది అంతర్యామిత్వం అని మన పూర్వాచార్యులు తెలియజేస్తున్నారు.

## 18) శారీరక శాస్త్రోపోద్ఘాత విచారం

గ్రంథారంభంలో గ్రంథారంభహేతువులుగా అనుబంధచతుష్టయం చూపబడడం గ్రాంథిక సరణి. "స్వజ్ఞానమను ముముక్షుం గ్రంథేన బధ్నాతీతి అనుబంధః" అని అనుబంధాన్ని వివరిస్తారు. స్తంభాలు చక్కగా లేకపోతే మండపం నిలువదు. ఆ విధంగానే, అనుబంధ చతుష్టయం లేకపోతే ఎవరికి గ్రంథంలో ప్రవృత్తి ఏర్పడదు. అందుచేత అనుబంధ చతుష్టయం చూపాలి. విషయం, ప్రయోజనం, సంబంధం, అధికారి అనేవి ఈ నాలుగు అనుబంధాలు. "విషయాదిత్రికస్యోక్తిః ప్రథమం ప్రతిపాద్యతే", "అథాతో బ్రహ్మజిజ్ఞాసా సూత్రమాద్య మిదం కృతమ్, ధర్మాఖ్యం విషయం వక్తుం మీమాంసాయాః ప్రయోజనమ్", "బ్రహ్మేతి తావత్ విషయం ప్రాప్యత్వేన ప్రయోజనమ్, జిజ్ఞాసా కర్మభావేన సంబంధమపి చోబ్రవీత్", "శాస్త్రారంభేషు సర్వత్ర సంబంధః పద్యతేబుతాయి అసంబద్ధప్రలాపత్వే న ప్రవర్తేత బుద్ధిమాన్"అనే మొదలైన దేశికుల తత్త్వటీకా వచనాలు ఇక్కడ స్మరణీయాలు.

కర్మఫల విరక్తుడైన ముముక్షువు అనే అధికారి జిజ్ఞాసాధికరణంలో చెప్పబడ్డాడు. విషయమైన బ్రహ్మం జన్మాద్యధికరణంలో జగజ్జన్మాది కారణంగా చెప్పబడింది. బ్రహ్మకు, శాస్త్రానికి మధ్య ఉండే సంబంధం ప్రతిపాద్య ప్రతిపాదక భావం. ఇది శాస్త్రయోనిత్వాధికరణ సారం. అక్కడే బ్రహ్మం శాస్త్రైకవేద్యం, శాస్త్రైక ప్రమాణకం అని కదా నిరూపింపబడింది. ఫలం— భగవత్తత్త్వం— పరమ ప్రయోజనం, పరమ పురుషార్థ భూతం అని నిరూపింపబడింది— సమన్వయాధికరణంలో. అందుచేత అధికారి, విషయం, సంబంధం, ఫలం— అనే అనుబంధి చతుష్టయాన్ని మునుముందుగా నాలుగు అధికరణాలతో వేదవ్యాసులు తెలియజేశారు. ఈ 4 అధికరణాలు శాస్త్రోపోద్ఘాతం అని అంటారు, పెద్దలు. "శాస్త్రారంభార్థా చతుఃసూత్రీ" అని అంటారు

శ్రుతప్రకాశికాచార్యస్వామివారు. తరువాత, "ఈక్షతేః నాశబ్దమ్" అని సూత్రం ఆరంభించి, "అనావృత్తిః శబ్దాత్"అనే చివరి సూత్రం వరకు ఉండే భాగం శాస్త్రం అని భావించారు, మన పూర్వాచార్యులు.

మన సంప్రదాయంలో పలువురు పెద్దలు పలుక పలు గ్రంథాలను అనుగ్రహించారు. మనకు ఈ పెద్దలను గూర్చి ఏమీ తెలియదు. వారు అనుగ్రహించిన గ్రంథాలను గూర్చి ఏమీ తెలియదు. వీటిలో పలు ఈనాడు లోపించి పోయాయి కూడా. మిగిలిన గ్రంథాలలో కూడా ఎన్నో గ్రంథాలు ఈనాడు ప్రకాశంలో లేవు. ఏవో కొన్ని గ్రంథాలు మాత్రం ఈనాడు కొందరికైనా అనుభవ విషయమై ఉన్నాయి. ఇటువంటి గ్రంథాలలో శ్రీ భాష్యానికి వ్యాఖ్యానమై ప్రకాశించే గ్రంథం నయప్రకాశిక అనే గ్రంథం. ఈ గ్రంథాన్ని అనుగ్రహించిన వారు మేఘనాదారిసూరి అనే ఒక పెద్దల. వీరు దేశికుల కంటే కూడా ముందుగా వేంచేసి ఉన్నవారు. మేఘనాథుడు అని ఇంద్రజిత్తుకు పేర. మేఘనా దారి అని అంటే ఇంద్రజిత్తును జయించిన లక్ష్మణముని అని అర్థం. అందువల్ల వీరు భగవద్రామానుజుల తిరునామాన్ని కలవారు అని అర్థమవుతున్నది.

నయప్రకాశిక అనే ఈ శ్రీభాష్య వ్యాఖ్యాన గ్రంథంలో ఈ పెద్దలు, పూర్వకాండలో దానికి మొదటి సూత్రమైన "అథాతో ధర్మ జిజ్ఞాసా" అనేది ఉపోద్ఘాతమై ఉండేటట్లే, ఉత్తరకాండనికి కూడా "ఆథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే మొదటి సూత్రం మాత్రమే ఉపోద్ఘాతమై ఉన్నది అని భావిస్తున్నారు. "చతుః సూత్ర్యాః ఉపోద్ఘాతత్వాభావాత్ పచ్చ ఇతర పాదాదిషు అస్మాబిరుక్తమ్", "అథాతో ధర్మ జిజ్ఞాసా ఇతి సూత్రవత్ ఏకమేవ వేదాంతసూత్రం శాస్త్రోపోద్ఘాతః" అని వారు తమ గ్రంథంలో అనుగ్రహించారు. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణావతారికాబాష్యంలో ఉండే "శారీరక మీమాంసాశ్రవణం ఆరభతే ఇత్యుక్తమ్, శాస్త్రారంభసిద్ధయే" అనే సూక్తిని జాగ్రత్తగా నిశితంగా గమనించి చూచినపుడు, నయ ప్రకాశిక నిర్వాహానికి అనుకూలంవలె తోస్తుంది. అయినా, ఈ విషయంలో శ్రుతప్రకాశికా

భట్టర్ మూడు విధాలయిన నిర్వాహాలను చూపి, సూత్రచతుష్టయం కూడా శాస్త్రోపోద్ఘాతం అనే పక్షాన్ని స్థాపించారు.

"శాస్త్రారంభార్థా చతుఃసూత్రీ" అనే మార్గం"ఔచిత్యానేక భాష్య స్వరసగతిమతీ ప్రాక్తనీ వర్తనీయమ్" అనే దేశికుల అధికరణ సారావళి శ్రీసూక్తి క్రమంలో అఖండ రాజమార్గం అనే విధంగా సాధారణంగా ఈ నాలుగు అధికరణాలలో ఇది స్పష్టమవుతున్నది. బ్రహ్మం శాస్త్రవేద్యం కాదు, శాస్త్రం బ్రహ్మప్రతిపాదకమూ కాదు– అని ఒక్కొక్క విధంగా అక్షేపాలు లేవగా, వానికి తర్క సమాధానాలను చెప్పి, బ్రహ్మం శాస్త్రవేద్యంగా స్పష్టమవుతున్నది అని జిజ్ఞాసా ఉపపత్తిని నాలుగు అధికరణాలలో వ్యాసులు స్థాపించారు. అందుచేత ఈ నాలుగు సూత్రాలే శాస్త్రోపోద్ఘాతం అవుతాయి. ఇక్కడ శాస్త్రం అనే పదం చేత మీమాంసాశాస్త్రసామాన్యం వివక్షితం కాదు. తదేకదేశభూతమైన శారీరకమీమాసా శాస్త్రం వివక్షితం. అందులో కూడా, ఈక్షత్యధికరణం నుండి ఆరంభమవుతున్న శాస్త్రమే వివక్షితం. అందుచేత చతుఃసూత్రీ భాగం 20 అధ్యాయాలను కల మీమాంసలకు ఉపోద్ఘాతం కాదు. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే సూత్రంనుండి ఆరంభమయ్యే గ్రంథానికి కూడా ఉపోద్ఘాతం కాదు. "ఈక్షతేః నాశబ్దమ్" అని ఆరంభించి, "అనావృత్తిః శబ్దాత్ " అనే సూత్ర పర్యంతం కల శారీరక విశేషానికే ఉపోద్ఘాతం– అని అర్థం.

ఈ నాలుగు అధికరణాలను రెండు పేటికలుగా విభజించారు, దేశికులు. సిద్ధబ్రహ్మ విషయక ప్రతీతిని స్థాపించేవి మొదటి రెండు అధికరణాలు. "సిద్ధవస్తు సామాన్యాన్ని శబ్దసామాన్యం బోధించదు" అనే అక్షేపాన్ని మొదటి అధికరణంలో నిరసించారు. "సిద్ధ విశేషమైన బ్రహ్మాన్ని శబ్దవిశేషమైన బ్రహ్మశబ్దం బోధిస్తుంది" అని అన్నారు, రెండవ అధికరణంలో. జిజ్ఞాసాధికరణ విషయ వాక్యంలో "స గురు మేవాభిగచ్ఛేత్" అని సామాన్యంగా గురుభక్తి చెప్పబడింది. జన్మాద్యధికరణ విషయ

వాక్యంలో శిష్యవిశేషమైన పుత్రునకు భృగువునకు తండ్రి అయిన వరుణుడు ఆచార్యుడు ఉపదేశించాడు అని చెప్పబడడం విశేషం అవుతుంది. మొదటి అధికరణంలో నిరీశ్వరవాది నిరాకరణం, రెండవ అధికరణంలో నిర్విశేషవాది నిరాకరణం— అని విభజించి చెప్పవచ్చు. రెండవ అధికరణం కూడా నిరీశ్వరవాది నిరాసకం అనే చెప్పవచ్చు, ఎందుకంటే, నిర్విశేష వస్తువు ఈశ్వరుడై ఉండడం సాధ్యం కాదు కనుక— అని అన్నారు, మన పెద్దలు. శారీరకం మొదటి అధ్యాయంలో చెప్పబడిన అర్థాన్ని మొదటి సూత్రంతోనూ, రెండవ అధ్యాయంలో చెప్పబడిన అవిరోధాన్ని రెండవ అధికరణంలోను వేదవ్యాసులు తెలియజేస్తున్నారు— అని అంటారు, మన పెద్దలు. ఇది చతుఃసూత్రిలోని మొదటి పేటిక.

తరువాత ఉండే రెండు అధికరణాలు రెండవ పేటిక. తాత్పర్య లింగ సమర్థన పరత్వం ఉత్తరపేటికకు ఉన్నది. అప్రాప్తత్వ లక్షణమైన తాత్పర్య లింగం మూడవ సూత్రంతోనూ, సఫలత్వ లక్షణ తాత్పర్య లింగం నాల్గవ సూత్రంతోనూ సమర్థింపబడుతున్నది. మానాంతర ప్రాప్తం బ్రహ్మతత్త్వం అనుమానంతోనే ఈశ్వరుని సాధించవచ్చు, వేదాంతాధ్యయనం ద్వారా ఏర్పడిన ఆపాత ప్రతీతి ఈశ్వరానుమానాంతరంతోనే నిశ్చయబుద్ధిగా ఏర్పడుతుంది. దీనివల్ల శాస్త్రం ఆవశ్యకం కాదు —అనేది పూర్వపక్షం. శాస్త్ర యోనిత్వాధికరణంలో దీనిని నిరసిస్తున్నారు, వేదవ్యాసులు. బ్రహ్మ విషయంలో శాస్త్రమే ప్రమాణం అని పలికి, బ్రహ్మం మానాంతర గోచరం కానందున, శాస్త్రైకవేద్యమైనందున శాస్త్రానికి అప్రాప్తత్వ లక్షణ వైభవం ఉన్నది— అని అంటున్నారు. పరమాత్మయొక్క పరమ పురుష రూపపరత్వం స్థాపించడం నాలుగవ అధికరణలో జరిగింది. త్రయ్యన్తాః సత్యనిత్యాద్భుత పరమ సుఖబ్రహ్మనిష్ఠాః" అని దేశికులు అనుగ్రహించారు. ఈ అధికరణంలో సాఫల్యలక్షణ తాత్పర్య లింగ సమర్థనం చేయబడుతున్నది.

ఈ విధంగా, బ్రహ్మ సిద్ధ వస్తువు అయినా శాస్త్రం దానిని తెలుపుతున్నది అని, బ్రహ్మ జగజ్జన్మాది కారణత్వరూపలక్షణ లక్షితమని, బ్రహ్మం మానంతర ప్రాప్తం కాదు శాస్త్రైక గోచరం అని, బ్రహ్మం సాక్షాత్ ఫలభూతం అని మొదటి నాలుగు సూత్రాలలో తెలిపి, బ్రహ్మ విచార కర్తవ్యత్వాన్ని స్థాపించారు, వేదవ్యాసులు. ఇదే అవతారిక. ఇక, ఈక్షత్యధికరణంనుండి ఆరంభించి శాస్త్రం ఆరంభం అవుతున్నది. పరమాత్మ కళ్యాణ గుణాలు శాస్త్ర ప్రతిపాద్యాలు, సత్యాలు, నిత్యాలు, కల్యాణాలు, అనంతాలు, నిరతిశయాలు, నిరుపాధికాలు అవుతున్నాయి. వీటిని, తరువాత 16 పాదాలతో శ్రీ వేదవ్యాసులు స్థాపిస్తున్నారు. "అధికరణగుణైః తద్గుణాన్ న్ ఉద్గృణాతి" అని దేశికులు అధికరణ సారావళిలో అనుగ్రహించారు.

ఈ విధంగా బ్రహ్మ జగజ్జన్మాదికారణం, చేతనాచేతన విశిష్టం, సమస్త కళ్యాణ గుణాకరం, ప్రాప్య ప్రాపక భూతం, ముక్త భోగ్యం, అపునరావృత్తి లక్షణ ముక్తి ప్రదం అనే విషయమే వేదాంత వేద్యం– అనేది శారీరక మీమాంసాశాస్త్రసారం.

## 19) బ్రహ్మ మీమాంసా విషయం నిరూపణం

ఇరవై అధ్యాయాలను కల, కాండత్రయత్మకమైన మీమాంసా శాస్త్రం ఏకశాస్త్రం అనేది మన పెద్దలు దర్శించిన క్రమం. దీని మొదటి సూత్రం "అథాతో ధర్మ జిజ్ఞాసా" అని ఉన్నది. ఇది దీనిని గూర్చి పలుకుతూ, శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు ఆశ్చర్యకరంగా ఒక అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. "అథాతో ధర్మజిజ్ఞాసా"– "ధర్మాన్ని విచారిస్తున్నాను" అని జైమిని మహర్షి శాస్త్రాన్ని ఆరంభించారు. ఇక్కడ ధర్మం అంటే ఏమని విచారిస్తున్నారు? అని చూడాలి. సాధారణంగా ధర్మం అంటే –అది యజ్ఞ దాన తపస్సులవంటివాటిని తెలియజేస్తుంది. ఇవి అన్నీ సాధ్య ధర్మాలు అనబడుతున్నాయి. అంటే, మనం చేసే ప్రయత్నాల ద్వారా సాధింపబడవలసినవి. ఈ

విధంగా మన ప్రయత్నాల ద్వారానే సాధింపబడ వలసిన ధర్మాలుగా ఉండడం వల్ల ఇవి సాధ్య ధర్మాలు అనబడుతున్నాయి.

అయితే, ఈ సాధ్య ధర్మాలకు పైన భగవంతుడే పరమధర్మంగా ప్రకాశిస్తున్నాడు. ఇతడే సిద్ధ ధర్మం అనబడుతున్నాడు. ఈ విధంగా సాధ్య ధర్మమైనవాటికి పైన సిద్ధధర్మంగా వెలిగేవాడు భగవంతుడు ఒక్కడే. ధర్మశబ్దం "ధ్రియతే ప్రీయతే అనేనేతి ధర్మః, కరణార్థే మనిన్" ధృతిసాధనం ధర్మం, ప్రీతి సాధనం ధర్మం —అని సిద్ధ ధర్మమైన ఈశ్వరుని, సాధ్య ధర్మాలైన యాగదాన హోమాదులను తెలుపుతుంది.

పూర్వభాగం అయిన వేదం సాధ్య ధర్మ పరం, ఉత్తర భాగమైన వేదాంతం సిద్ధధర్మపరం. పూర్వభాగంలో ద్రవ్యాదులు చెప్పబడినప్పటికీని, క్రియా ప్రాధాన్యాన్ని బట్టి వేదభాగం సాధ్య ధర్మపరం అని చెప్పబడుతున్నది. ఉత్తర భాగంలో ఉపాసనాదులు చెప్పబడినప్పటికీ బ్రహ్మ ప్రాధాన్యాన్ని బట్టి వేదాంతం సిద్ధ ధర్మ పరం అని చెప్పబడుతున్నది. "సిద్ధం సాధ్యం చ ధర్మం ప్రభవతి కథితుం ధర్మశబ్దః, అథవా ఆర్థాత్ ఆరాద్యాతేః విచారాః స్ఫురతి నిగదితః కృత్స్నచింతోద్యమశ్చ" అని భగవంతుడే సాక్షాధర్మ ప్రవర్తకుడు అనేది సంప్రదాయ సిద్ధమైన విషయం. దీనికి రెండు వచనాలను శ్రుతప్రకాశికాకారులు ఉదాహరిస్తున్నారు. శ్రీరామాయణంలో మారీచుని వచనంగా ప్రస్తావింపబడిన "రామో విగ్రహవాన్ ధర్మః" అనేది ఒక వచనం. ఇంకొకటి, "కృష్ణం ధర్మం సనాతనమ్" అనేది, వేదవిద్వాంసులు అందరూ, వేదాంతార్థాన్ని చక్కగా హస్తగతంచేసికొన్నవారు అందరూ "సాక్షాధర్మం కృష్ణుడే" అని అని భావిస్తున్నారు అంటే, దానికి అభిప్రాయం ఏమి?

భగవద్గీతలో "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని 18వ అధ్యాయంలో భగవంతుని వచనం. శ్రీ పిళ్లైలోకాచార్యులవారు ముముక్షుప్పడి అనే గ్రంథంలోని చరమ శ్లోక ప్రకరణలో

"సర్వ ధర్మాన్ పరత్యజ్య" అనే చోట వ్యాఖ్యానంలో ఆశ్చర్యకరమైన ఒక అభిప్రాయాన్ని తెలియజేశారు. అది ఏమంటే, గీతలో నాలుగవ అధ్యాయంలో అవతార రహస్య ప్రకరణంలో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అని ధర్మాలను స్థాపించడం కోసం తాను అవతరిస్తున్నట్లు భగవంతుడు తెలియజేశాడు. ఇక్కడ 18 వ అధ్యాయంలో చరమ శ్లోక ప్రకరణలో "ధర్మాలను విడిచిపెట్టు" అని అంటున్నాడే? దీనికి అభిప్రాయం ఏమి? అని ప్రశ్నించి, భగవంతుని మనస్సులోని అభిప్రాయాన్ని వివరించారు. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని "అన్ని ధర్మాలను విడిచిపెట్టు" అని చెప్పేటప్పుడు "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అని మాత్రం చెప్పలేదు, భగవంతుడు వెంటనే "మామేకం శరణం వ్రజ" అని తనను ఆశ్రయించమని కూడా చెప్పాడు. దీనికి అర్థం ఏమి? అంటే, మిగిలిన ధర్మాలను ధర్మంగా ఆశ్రయించకుండా, తనను ఒక్కని మాత్రమే ధర్మంగా ఆశ్రయించాలి– అనేదే. అందుచేత, మొదట "ధర్మాలను విడిచిపెట్టు" అని పలికి, వెనువెంటనే ధర్మంగా తనను అశ్రయించాలి అని చెప్పినందున, "సాక్షాత్ ధర్మపదవాచ్యుడు భగవంతుడే "అనేది భగవంతుని అభిప్రాయం ద్వారా చక్కగా వ్యక్తమవుతున్నది. ఈ విధంగా అతనిని ధర్మంగా భావించే భావనయే శరణాగతి అని అనబడుతున్నది. అందుచేత ధర్మసంస్థాపనం అని అంటే సిద్ధ ధర్మమైన తనను స్థాపించడం కోసం తానే అతడు ఇక్కడికి వచ్చి జన్మిస్తున్నాడు– అనేది స్పష్టమవుతున్నది. ఈ విధంగా ధర్మ శబ్దానికి సాధ్య ధర్మాలు అర్థమే, సిద్ధ ధర్మాలు అర్థమే. సాధ్యసిద్ధోభయ సాధారణమైన శబ్దమే ధర్మ శబ్దం.

అందుచేత "అథాతో ధర్మజిజ్ఞాసా" అని ఆరంభించిన జైమిని మహర్షి మనసులోని తాత్పర్యం ఏమిటంటే, 'సాధ్య ధర్మం, సిద్ధ ధర్మం అనబడే అన్ని ధర్మాలను విచారిస్తున్నాను' అనేదే. దీనినే శ్రుతప్రకాశికాచార్యస్వామి వారు "సాధారణ ప్రతిజ్ఞా" అని అంటూ తెలియజేశారు మొదట కర్మదేవత ఓచరమైన 16 అధ్యాయాలు తరువాత

బ్రహ్మగోచరమైన నాలుగు అధ్యాయాలు ఈ విధంగా మొత్తం 20 అధ్యాయాలను కల మీమాంసా శాస్త్రం ఉన్నతమైన శాస్త్రం అని అంటున్నారు, మన పెద్దలు. "ధర్మాన్ని విచారిస్తున్నాను" అని 12 అధ్యాయాలలో ధర్మాన్ని విచారించారు జైమిని మహర్షి. తరువాత, నాలుగు అధ్యాయాలలో దేవతా విచారాన్ని చేశారు. ఈ విధంగా సాధ్య ధర్మాలను ఇంతవరకు విచారించి, తరువాత సిద్ధ ధర్మాన్ని గూర్చి విచారించడానికి ఆరంభించేటప్పుడు వేద వ్యాసులు "సిద్ధధర్మమైన బ్రహ్మాన్ని గూర్చి నేను విచారిస్తున్నాను" అని "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అని బ్రహ్మవిచారాన్ని తాము చేయగోరిన కర్తవ్యాంశంగా నిశ్చయించి, ఆరంభించారు– అనేది మన పూర్వాచార్యులు చేసిన అర్ధనిర్వాహం. అందుచేత, ఇది కూడా ధర్మమే, అది కూడా ధర్మమే. సాధ్యధర్మాలను గూర్చి శిష్యులైన జైమిని విచారించారు. సిద్ధ ధర్మాన్ని గూర్చి జైమినికి ఆచార్యులైన వేద వ్యాసులు విచారించి, ఈ మీమాంసా శాస్త్రాన్ని పూర్తి చేశారు– అని వివరిస్తున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. ఈ విధంగా బ్రహ్మ సూత్రాలు సిద్ధోపాయమైన, (అంటే, సిద్ధధర్మమైన) సాక్షాత్ ధర్మమైన, చేతనోపాయమైన భగవంతుడనే విషయాన్ని గురించినది అనేది సత్ సంప్రదాయం.

### 20) శారీరకంలో ద్వికభేద విషయనిరూపణం–1

దీనికి పిమ్మట, బ్రహ్మ మీమాంసా శాస్త్రంలోని నాలుగు అధ్యాయాలలోనూ వేదవ్యాసులు సిద్ధ ధర్మాన్ని గూర్చే విచారించారు అని గ్రహించాలా? ఈ నాలుగు అధ్యాయాలలోనూ సాధ్య ధర్మాలను గూర్చి ఏమాత్రం విచారించలేదా? అనే ప్రశ్నలు ఇక్కడ కలుగుతాయి దీనికి సమాధానంగా శ్రుతప్రకాశికాచార్య స్వామివారు ఏమి చెప్పారు? అంటే, ఈ నాలుగు అధ్యాయాలలోనూ సాధ్య ధర్మాన్ని గూర్చి కూడా వేద వ్యాసులు వర్ణిస్తున్నారు. ఈ నాలుగు అధ్యాయాలను రెండు ద్వికాలుగా విభజించవచ్చు. మొదటి రెండు అధ్యాయాలు పూర్వద్వికం అనబడుతున్నాయి.

వీటిని సిద్ధద్వికం అని కూడా అంటారు. సిద్ధమైన బ్రహ్మాన్ని గూర్చి మొదటి రెండు అధ్యాయాలలో వ్యాసులు వర్ణించారు. సిద్ధవస్తువైన, ఎప్పుడూ ఉండే వస్తువైన, ప్రయత్నంతో సాధించిన అవసరం లేని వస్తువు అయిన, పరమాత్మను గూర్చి మొదటి రెండు అధ్యాయాలు ప్రవర్తించాయి. మూడవ, నాలుగవ అధ్యాయాలు ఉత్తరద్వికం అని, సాధ్యద్వికం అని చెప్పబడుతున్నాయి. మూడవ అధ్యాయంలో– మొదటి రెండు అధ్యాయాలలో వివరింపబడిన పరమాత్మను ఉపాసించాలి –అని అంటున్నారు. నాలుగవ అధ్యాయంలో ఈ విధంగా ఉపాసించేవారికి అర్చిరాది మార్గం లభిస్తుంది అని, అతడు పరమపదాన్ని పొందుతాడు అని, పరమపదంలో పరిపూర్ణ బ్రహ్మానుభవాన్ని పొంది ఆనందిస్తాడు అని, అక్కడనుండి తిరిగి ఈ సంసార మండలం లోపలికి రాకుండా ఎల్లప్పుడూ నిత్యానందానుభవాన్ని పొంది, అక్కడనే ఉండగలడు అని తెలియజేసి, నాలుగు అధ్యాయాలను కల ఈశారీరక శాస్త్రాన్ని పూర్తి చేశారు, వేదవ్యాసులు. మూడవ అధ్యాయం సాధనాధ్యాయం అని, నాలుగవ అధ్యాయం పలాచాయం అని అనబడుతున్నాయి. సాధనమైనా, ఫలమైనా, ఈ రెండూ సాధ్యాలే.

ఈ విధంగా, సిద్ధవస్తువు అయిన పరమాత్మను గూర్చి మొదటి రెండు అధ్యాయాలు ప్రవర్తించాయి. దానికి తరువాత, సాధన మంటే ఏమి? ఆ భగవంతునే మనం ఉపాసన చేయాలి. ఆ భగవంతునే ధ్యానం చేయాలి. ఆ భగవంతుని గూర్చే భక్తి కలిగి ఉండాలి. అతనినే ధ్యానం చేయాలి. అతనిని గూర్చిన ఉపాసనం అనేది మన ప్రయత్నం ద్వారా సాధింపబడవలసిన ఉపాసనంగా ఉన్నందున, అది సాధ్యం. దీనికి తరువాత, పరమపద విశిష్టుడైన పరమాత్మను పొందాలి. భగవంతుడు అక్కడ ఉన్నాడు, ఇక్కడ కూడా ఉన్నాడు, అంతటా ఉన్నాడు, అయినప్పటికీ, అర్చరాది మార్గం ద్వారా వెళ్ళి, పరమ పదాన్ని సమీపించి పొంది, ఆ భగవంతుని పరిపూర్ణమైన అనుభవాన్ని పొంది, ఆ అనుభవం వల్ల కలిగిన ప్రీతి ప్రేరేపించగా, ఈ జీవాత్మ

చేయదగిన కైంకర్యమే పరమ పురుషార్థం అనేది మన సంప్రదాయానుసారం పరిపూర్ణ బ్రహ్మానుభవం అవుతుంది. అనుభవ జనితప్రీతికారిత సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితాశేష కైంకర్యం మోక్షం అవుతుంది. మోక్ష స్వరూపం ఇటువంటిది– అనే విషయాన్ని మన స్వామి భగవద్రామానుజులు అత్త్రాధికరణ శ్రీభాష్యంలో నిర్ణయించారు. ఇది భగవంతుని కృపా సాధ్యంగా ఉన్నందున, మన యత్నసాధ్యం ఉపాసనం అనే విషయాన్ని ఈ రెండిటినే మూడవ అధ్యాయంలోను, నాలుగవ అధ్యాయంలోనూ వ్యాసులు వర్ణించారు. ఈ విధంగా మొదటి రెండు అధ్యాయాలు ధర్మాన్ని గురించినది, తరువాత రెండు అధ్యాయాలు సాధ్య ధర్మాన్ని గురించినది అని శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారైన శ్రీ సుదర్శన భట్టర్ స్వామి అనుగ్రహించారు.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొ*ழி* ప్రబంధం 10 శతకాలతో కూడినది. దీనిని రెండు భాగాలుగా విభజించారు, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యాన కారులైన అ*ழ*గియ మణవాళ జ్జీయర్ స్వామి వారు మొదటి ఐదు శతకాలు సిద్ధ ప్రతిపాదకంగా అమరి ఉన్నాయి అని, తరువాత ఐదు శతకాలు సాధ్య ప్రతిపాదకంగా అమరి ఉన్నాయి అని, ఈ మహాచార్యుల నిర్వాహం. సిద్ధవస్తువైన పరమాత్మను గూర్చి మొదటి రెండు శతకాలు, సిద్ధవస్తువైన జీవాత్మను గూర్చి తరువాత రెండు శతకాలు, పరమాత్మ సిద్ధోపాయం అనే అర్థాన్ని ప్రతిపాదించేదై ఉన్నది ఐదవ శతకం. ఈ విధంగా మొదటి అయిదు శతకాలు సిద్ధపరం అని అంటున్నారు. ఆరవ శతకం ఆ భగవంతుని ఉపాయంగా మనం ఆశ్రయించడం అనే స్వీకారాన్ని గూర్చినది. ఉన్ అడిక్కీ*ழ்* అమర్ న్దు పుగుందేనే" అని అన్నారు కదా ఆళ్వార్లు. ఇది సాధ్యోపాయ. సాధ్యోపాయం అంటే, తమ ప్రయత్న సాధ్యం కాకుండా ఉన్నప్పటికీ, భగవత్ కృపా సాధ్యం కనుక అది సాధ్యోపాయమే. ఉపాయస్వీకారం కూడా సాధ్యోపాయంలో చేరుతుంది. ఏడవ, ఎనిమిదవ శతకాలలో అనిష్ట నివృత్తిని గూర్చి చెప్పడం జరిగింది. తొమ్మిదవ

శతకం, పదవ శతకం ఇష్టప్రాప్తిని గూర్చి చెబుతున్నవిగా ఉన్నవి. ఈ విధంగా ఉపాయస్వీకారం కూడా సాధ్యమే, అనిష్ట నివృత్తి సాధ్యమే, ఇష్ట ప్రాప్తి కూడా సాధ్యమే కనుక, సిద్ధాన్ని గూర్చి మొదటి 5 శతకాలు, సాధ్యాన్ని గూర్చి తరువాత ఉండే ఐదు శతకాలు అనేది క్రమం. మొదటిది సిద్ధపంచకం, రెండవది సాధ్యపంచకం– అని రెండు పంచకాలుగా తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని మన పెద్దలు విభజించారు. ఆ విధంగానే ఇక్కడ కూడా సిద్ధద్వికం, సాధ్యద్వికం– అని రెండు ద్వికాలుగా బ్రహ్మ మీమాంశసాశాస్త్రాన్ని విభజించవచ్చు.

## 21) శారీరకంలో ద్విక భేద విషయ నిరూపణం– 2

శారీరక శాస్త్రంలోని నాలుగు అధ్యాయాలను విషయద్వికం అని, విషయిద్వికం అని రెండు ద్వికాలుగా విభజించవచ్చు. ఇక్కడ విషయం అంటే– జ్ఞానానికి విషయం అని అర్థం. జ్ఞానంలో, లేక, జ్ఞానానికి ఏది విషయమో, ఆ విషయాన్ని ఆశ్రయించి ఉండేది విషయి. ఒకచోట ఒక పుస్తకం ఉన్నది. దానిని పుస్తకం అని మనం తెలుసుకుంటున్నాము. ఈ జ్ఞానానికి విషయి అని పేరు. విషయాన్ని గ్రహించే జ్ఞానానికి విషయి అని పేరు. మన జ్ఞానంతో పలు విషయాలను గ్రహిస్తున్నాము. విషయాలు అన్నీ జ్ఞానాన్ని గూర్చిన విషయాలు. ఆ విషయాలను గూర్చిన జ్ఞానానికి సంప్రదాయంలో విషయి అని పేరు.

ఈ విధంగా విషయమైన పరమాత్మను గూర్చి మొదటి రెండు అధ్యాయాలు అమరి ఉన్నాయి. ఆ పరమాత్మను విషయంగా కలిగిన జ్ఞానం– ఉపాసనం అని, పరిపూర్ణ బ్రహ్మానుభవం– అని రెండు విధాలుగా ఏర్పడి ఉన్నది. ఈ రెండిటిని – శారీరకంలోని మూడు, నాలుగు అధ్యాయాలలో వేదవ్యాసులు వర్ణించారు –అనేది సంప్రదాయం. మూడవ అధ్యాయంలో చెప్పబడిన జ్ఞానం –భక్తి ఉపాసనం, అని అనబడుతున్నది. అంటే, ఉపవాసనాత్మకమైన జ్ఞానం. నాలుగవ అధ్యాయంలో

చెప్పబడిన జ్ఞానం పరిపూర్ణ బ్రహ్మానుభవం. భక్తి అనే ఉపాసనం జ్ఞానమే, పరిపూర్ణ బ్రహ్మానుభవం కూడా జ్ఞానమే. అయితే, ఈ జ్ఞానానికి, ఆ జ్ఞానానికి మధ్య ఉండే విశేషం ఏమి? అనేది మన పూర్వులు విస్తృతంగా నిరూపించారు. ఈ జ్ఞానం శాస్త్ర జన్య జ్ఞానం, ఆ జ్ఞానం స్వాభావికం. స్వాభావికం అయినప్పుడు, అది ఏమి మనకు ఇంతవరకు కలుగలేదు? అంటే, ఇన్నాళ్లు మనకు దానిని పొందనీయకుండా అడ్డుపడుతూ ఉన్నది, మనం చేసుకున్న కర్మ. ఈ కర్మ అనే ఆటంకం తొలగిపోతే స్వాభావికమైన పరిపూర్ణ బ్రహ్మానుభవం లభిస్తుంది. ఈ కారణం చేతనే పరమాచార్యులైన శ్రీ పరాశరభట్టర్ "అవస్థాసు ఆవిః స్యుః మమ సహజ కైంకర్యవిధయః" అని శ్రీరంగనాథుని సమక్షంలో ప్రార్థించారు. భగవంతుని అనుగ్రహం చేత మనకు ఏర్పడదగిన ఆవిర్భావం ఉన్నదే అది లోలోపల మనలో ఎల్లప్పుడూ ఉండేది ఉండే ఆవిర్భావం ఒక కాల విశేషంలో ప్రకాశిస్తున్నదే తప్ప, ఇంతవరకు మనలో ఇది లేదు అని అర్థం కాదు.

ఛాందోగ్యపనిషత్తులో పరమాత్మకు ఒక గుణాష్టకం చెప్పబడింది. దహర విద్యా ప్రకరణంలో "ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకో ౽విజిఘత్సో౽పిపాసః సత్యకామః సత్యసంకల్పః" అని ఏడు విధాలైన కళ్యాణ గుణాలు పరమాత్మకు చెప్పబడ్డాయి. ఈ విధంగానే జీవాత్మకు కూడా ఈ గుణాష్టకం ఉన్నది. "ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకో ౽విజిఘత్సో౽పిపాసః సత్యకామః సత్యసంకల్పః" అని ఈ గుణాలు ముక్తపురుషులకు కూడా ఉన్నట్లు చతుర్ముఖ బ్రహ్మ ఇంద్రుడునకు ఉపదేశించే వాక్యంగా ఉన్నది. తిరోధాయకమైన కర్మచేత ఈ ఎనిమిది గుణాలు ఆవరింపబడి ఉన్నాయి. ఈ కర్మసంబంధాన్ని భగవంతుడు తన శ్రీ సుదర్శనాన్ని ప్రయోగించి ఛేదించి వేస్తాడు. తిరోధాయకమైన కర్మకు నివృత్తి ఏర్పడిన తర్వాత జీవాత్మకు లోలోపల స్వరూపం ఆవిర్భవించి, అతడు పరిపూర్ణ బ్రహ్మానుభవాన్ని పొందుతున్నాడు. అందువల్లనే భగవంతుడు చరమ

శ్లోకంలో "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" – "నీవు నన్ను శరణంగా ఆశ్రయించు. నిన్ను నేను అన్ని పాపాల నుండి విడిపిస్తాను" అని అన్నాడు.

అనిష్ఠ నివృత్తి మాత్రమే భగవంతుడు చరమ శ్లోకంలో చెప్పాడు తప్ప, ఇష్ట ప్రాప్తిని గూర్చి చరమ శ్లోకంలో భగవంతుడు, ఎందుకు? చెప్పలేదు అనేదానికి కొన్ని కారణాలు ఉన్నాయి. ఒక కారణంగా ఏమీ అంటే, అనిష్ఠనివృత్తి కలిగితే, ఇష్ట ప్రాప్తి తనకు తానే కలుగుతుంది అని భావం. దీనినే స్వరూపాభిర్భావం అని చెబుతున్నాము.

అందుచేత ఉపవాసనాత్మకమైన జ్ఞానం కూడా జ్ఞానమే. పరిపూర్ణ బ్రహ్మానుభవం కూడా జ్ఞానమే. అయితే, ఈ రెండిటికీ తేడా ఉన్నది. ఉపాసనాత్మకమైన జ్ఞానం అంటే శాస్త్ర జన్య జ్ఞానం. భగవంతుని గూర్చి చక్కగా శాస్త్రాన్ని అభ్యసించి తెలుసుకోవాలి. శ్రోతవ్యః– ఆచార్య సన్నిధిలో వినాలి, మంతవ్యః– తరువాత ఒకచోట కూర్చుని, చక్కగా మననం చేయాలి, నిధిధ్యాసితవ్యః – దానికి తరువాత, ధ్యానం చేయాలి. అందుచేత మొదట ఆచార్యుని సన్నిధిలో చక్కగా సేవించి శాస్త్రార్థాలను వినాలి. గీతలో నాలుగవ అధ్యాయంలో ఈ క్రమాన్ని అర్జునునకు శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించాడు. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్వదర్శినః" (4–3– 4) అనేది గీతలోని ఆ శ్లోకం, ప్రణిపాతేన – చక్కగా నమస్కరించడం వల్ల, పరిప్రశ్నేన– పరిక్రమించి నిలచి ప్రశ్నించడం వల్ల, సేవయా– కైంకర్యంచేత, తత్త్వ దర్శినః –ఆత్మ స్వరూపాన్ని సాక్షాత్కరించిన జ్ఞానుల దగ్గర నుండి ఆత్మను గూర్చిన జ్ఞానాన్ని పొందాలి–అని ఇక్కడ గీతాచార్యుని ఉపదేశం. ఈ సందర్భంగా దేశికులు ఒక విషయాన్ని అద్భుతంగా అనుగ్రహిస్తున్నారు. అది ఏమంటే, ఇక్కడ ఒక ప్రశ్న కలుగుతున్నది. ఆత్మను గూర్చిన జ్ఞానాన్ని పెద్దల సమక్షంలో ఆలకించాలి –అని ఉపదేశించే భగవంతునకు తాను అర్జునునకు సరిగా ఉపదేశించలేదని అభిప్రాయమా?

లేక, అర్జునుడు భగవంతుడు చేసే గీతోపదేశాన్ని సరిగా వినలేదా? అని అంటే, ఇక్కడ భగవంతుడు శాస్త్రార్థాలను చక్కగానే చెబుతున్నాడు. అర్జునుడు కూడా ఎంతో ఆదరంతోనే వింటున్నాడు. ఇక్కడ భగవంతుని చెప్పబడే, అర్జునునిచే వినబడే అర్థాలు అన్నీ పరమ వేదాంత సారభూతాలైన అర్థవిశేషాలుగా ఉన్నందున, వాటిని ఒకడు ఒకసారి చెప్పగా, ఇంకొకడు ఒకసారి వినేటప్పుడు అవి అర్థమైనట్లే తోస్తుంది. కానీ, ఒకసారి విన్నంతమాత్రంలోనే అవి మనసులో చక్కగా నిలువవు. దీనివల్ల ఈ అర్థ విశేషాలను పలుమార్లు విని, మనసులో ధరించి, చెప్పవలసిన క్రమాన్ని ఇక్కడ అర్జునునకు భగవంతుడు శిక్షిస్తున్నాడు.

పెద్దల సన్నిధిలో వేదాంతార్థాలను వినే కాలంలో వానిని వినడంలో చెప్పబడిన క్రమాన్ని అనుసరించి వినాలి. వాటిని ఏ విధంగా వినాలి? ఏ విధంగా వినకూడదు? అనే విషయాన్ని అంతటిని శాస్త్రజ్ఞులు పలు విధాలుగా తెలియజేశారు. ఉదాహరణకు కొన్ని విషయాలను తెలియజేస్తాను. గోడకు ఆవలి వైపున మరుగున ఉండి శాస్త్రార్థాలను వినకూడదు. ఆ విధంగా వింటే, అవి ఉపయోగపడవు– అని శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేశారు. గ్రంథాలను పఠించి తెలుసుకోవచ్చునా? అని అంటే, అది కూడా తగదు. పలువురు పెద్దలు అనుగ్రహించిన గ్రంథాలు అన్నీ ఈనాడు ప్రకాశింప చేయబడ్డాయి. వాటిని చదువుకొని విషయాలను తెలిసికోవడానికి వీలవుతుందా? అంటే, అది ఆ విధంగా సాధ్యం కాదు.

నంజీయర్ అనే ఆచార్యుల దగ్గర పె*ఱ్ఱి* అనే శిష్యులు ఒకరు ఉండేవారు. వీరు నంజీయర్ సన్నిధిలో పలు గ్రంథాలను కాలక్షేపంగా ఆలకించారు. అయితే, నాచ్చియార్ తిరుమొ*ழி* గ్రంథాన్ని మాత్రం కాలక్షేపం చేయలేదు. నంజీయర్ దగ్గర వీరు ఒక్కసారి "దాసునకు మాటిమాటికి కాలక్షేపానికి అంతరాయం కలుగుతున్నది., నేను ఏ ఊరుకు నేను వెళ్ళినప్పటికీ, మీతో సంబంధం ఉన్నందున, నా దగ్గర పలువురు ప స్తోత్రాలను

అడుగుతున్నారు. వాటికి అన్నిటికి నేను బదులు చెప్పడానికి దేవరవారు దాసునకు అనుమతిని ఇచ్చి అనుగ్రహించాలి "అని ప్రార్థించారు. నంజీయర్ కూడా "ఆ విధంగానే కానివ్వండి" అని అంగీకరించారు. ఒకసారి పెఱ్ఱి ఎక్కడో బయట ఊరు వెళ్ళినప్పుడు, వీరి దగ్గర కొందరు "తలైయల్లాల్ కైమ్మాఱిలేనే" అనే నాచ్చియార్ తిరుమొழி పాశుర సూక్తికి అర్థం వినాలి అని వీరి దగ్గరకు వచ్చి ప్రశ్నించారు. వారు కూడా పండితులు అయినందున, "నాకు తెలియదు" అని చెప్పడానికి సాధ్యం కాక, పూర్ణంగా తగని, ఏమాత్రం పొసగని విధంగా ఒక అర్థాన్ని చెప్పారు. అది ఏమంటే – "శరీరంలో ఉత్తమాంగంగా ఉన్నది తల కనుక, భగవంతుడు వచ్చేటట్లుగా కోకిల కూసినట్లయితే, తన తలను ఖండించి ఆ కోయిలకు సమర్పిస్తాను" అని గోదాదేవి చెబుతున్నట్లుగా ఆ సూక్తికి అర్థాన్ని వివరించారు. ఈ విధంగా వివరించినప్పటికీ, వారి మనస్సు మాత్రం "ఇది సరైన అర్థం కాదు" అని తోచింది. మనసులో తృప్తి కలుగలేదు. తరువాత, "కోకిల కూసి, భగవంతుడు వచ్చినట్టయితే, తన తలను దాని కాలిలో పెట్టి, సేవిస్తాను" అనేది ఉదాదేవి మనస్సుకు అభిమతమైన అర్థం అని ఒక పెద్దల దగ్గర సరైన అర్థాన్ని వారు గ్రహించారు. అప్పుడే వారికి తోచింది ఏమని అంటే, "ఆచార్యుల కటాక్షమాత్రంతోనే అన్ని అర్థాలను తెలుసుకోవడానికి సాధ్యం కాదు. ఆచార్యుల సన్నిధిలో చిరకాలం సేవించి, అర్థ విశేషాలన గ్రహించాలి" —అని. ఈ విధంగా, ఒక అక్షరం కూడా విడువకుండా, ఒక వాక్యం కూడా విడువకుండా, ఆచార్య సన్నిధిలో స్థిరంగా ఉండి, వారి పాదాలను సేవించి, కాలక్షేపం చేసి, అర్థగ్రహణం చెయ్యాలి. ఈ విధంగా ఆలకించడమే "శ్రోతవ్యః"అనేది. ఇది ఒక విధి. ఈ విధంగా ఆచార్య సన్నిధిలో సేవించి ఆలకించిన అర్థ విశేషాలను ఏకాంతంగా ఒక చోట ఉండి, మననం చేయాలి. పూర్వావలోకనం ఆచార్యులకు, ఉత్తరావలోకనం శిష్యులకు ఉండాలి– అని ఒక నియమాన్ని మన పెద్దలు ఏర్పరచారు. శిష్యునకు కాలక్షేపం చెప్పడానికి ముందు ఆచార్యుడు గ్రంథాన్ని

చక్కగా అవలోకించాలి. లేకపోతే, కాలక్షేపం కాలక్షేపంగా జరుగదు. ఆ విధంగానే, శిష్యుడు కూడా, ఆలక్షేపానికి తరువాత ఉత్తరావలోకనం చేయాలి, ఇదే "మంత్రవ్యః" అనేది. దీనికి తరువాత హృదయ కమలంలో దివ్య దంపతులను, వారి కళ్యాణ గుణాలను ధ్యానం చేయాలి. ఈ ధ్యానం పరిణామం చెందితే, దర్శన సమానకారజ్ఞానం ఏర్పడుతుంది— అని అంటారు పెద్దలు.

అందుచేత, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని వేదాంతవాక్యం ఉన్నప్పటికీ, శ్రవణం, మననం, ధ్యానం, దర్శనం— అనే ఈ క్రమంలోనే చక్కగా కృత్యాలు మనకి ఏర్పడాలి. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అని మొదట శబ్దం ఉన్నప్పటికీ, మన ఆచార్యులు దాని క్రమాన్ని మార్చి గ్రహించారు. పాఠక్రమం ఈ విధంగా ఉన్నప్పటికీ, అర్థంలో క్రమాన్ని అనుసరించి పాఠక్రమాన్ని మార్చుకున్నారు, మన పెద్దలు. ఇది పూర్వామీమాంసా న్యాయ సిద్ధమైన విషయం. అర్థ క్రమానుసారం— శ్రవణమనన ధ్యాన దర్శనాలను చెప్పేటట్లుగా ఏర్పడి ఉండే వాక్యం, ఈ బృహదారణ్యకోపనిషత్ వాక్యం. ఈ వచనార్థాన్ని మనస్సులో పెట్టుకొని శ్రుతప్రకాశికాచార్యస్వామి ఒక ఆశ్చర్యకరమైన శ్లోకాన్ని అనుగ్రహించారు. "శ్రుత్యంతేషు శ్రుతం భాష్యే మతం ధ్యాతం హృదంబుజే, లక్ష్మీ ధరం ప్రపద్యే తత్ దృష్టం శ్రీరంగధామని". దీని భావం ఏమంటే— దేనిని గ్రహించి మనం వినాలి? అంటే, వేదాంతాలను గ్రహించి. దేనిని గ్రహించి మనం మననం చేయాలి? అని అంటే, శ్రీ భాష్యాన్ని గ్రహించి. ఎక్కడ దానం చేయాలి? అని అంటే, హృదయకమలంలో. చివరలో శ్రీరంగంలోనే దర్శనం అని అంటున్నారు, మన పూర్వాచార్యులు. శ్రీరంగంలో దర్శనమా? లే, క పరమపదంలో దర్శనమా? అంటే, పరమపదంలో కాదు, శ్రీరంగంలోనే దర్శనం. "అచ్చువై పెఱినుమ్ వేండేన్" (ఆ పరమపద అనుభవాన్ని లభించినా అక్కరలేదు) అనే ఆళ్వార్ల మార్గాన్ని అనుసరించి వర్తించినవారు, మన

పూర్వాచార్యులు. పరమపదలో భగవంతుని సేవించడం అనేది నిత్యమైన పురుషార్థం. అయితే, ఈ భూమండలంలో శ్రీరంగంలోనే రమా దర్శనాన్ని ప్రసరింప చేశారు, మన పెద్దలు. ఈఅభిప్రాయాన్ని అనుసరించి, స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించిన దివ్య గ్రంథమైన వేదాంత సంగ్రహమనే గ్రంథానికి వ్యాఖ్యానంగా వెలసిన తాత్పర్య దీపికలో శ్రుత ప్రకాశికాచార్యులవారు ఈ ఆశ్చర్యకరమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

అందుచేత, ఈ విధంగా శ్రవణం చేసి, దాని మూలంగా జ్ఞానాన్ని పొందుతున్నాము. ఇదే శాస్త్రజన్యజ్ఞానం. శాస్త్రాభ్యాసం చేసి, దానివల్ల పొందవలసినదే శాస్త్ర జన్య జ్ఞానం. ఈ జ్ఞానాన్ని పురస్కరించుకునే తరువాత ఉపాసనను చేయాలి.

ఆదిశంకరులైతే, ఉపాసనకు తరువాత జ్ఞానం అని అన్నారు. శ్రవణం మననం, ధ్యానం అనే అన్నిటినీ వారు అంగీకరించారు. వీటిని చేసినప్పుడే భేదవాసన తొలగిపోతుంది, భేదవాసన తొలగితేనే తత్త్వమసి వాక్యజన్యజ్ఞానం, అద్వైత జ్ఞానం, కలుగుతుంది. ఈ విధంగా వాక్యజన్యజ్ఞానం కలుగక పోతే, భేదవాసన తొలగదు అని, ఎందుకు భేద వాసన తొలగలేదు అంటే, శ్రవణమనన ధ్యానాలను చేయలేదు అని అంటారు, శంకరులు. అందుచేత ధ్యానం ముందు, ధ్యానానికి తర్వాత జ్ఞానం అనేది ఆదిశంకరుల పక్షం.

మన స్వామి భగవద్రామానుజుల మతం ఆ విధంగా కాదు. మన మతంలో ముందు జ్ఞానం, తరువాత ధ్యానం. స్వామి వేదాంత సంగ్రహంలో మొట్టమొదటిలోనే ఈ విషయాన్ని తెలియజేశారు. "జీవపర యధాత్య జ్ఞాన పూర్వక అని జీవాత్మను గూర్చి శాస్త్రం ద్వారా చక్కగా తెలుసుకోవాలి దీనివల్ల కలిగిన జ్ఞానంతో "వర్ణాశ్రమధర్మ ఇతికర్తవ్యతాక పరమ పురుష చరణ యుగళ ధ్యానార్చన ప్రణామాద్యత్యర్థప్రియః తత్ప్రాప్తి ఫలః" అని అంటూ ఇదే పరమ వేదాంత సిద్ధాంతం —అని శ్రీరామానుజులు

వేదాంత సంగ్రహంలో ఆరంభంలోనే తెలియజేశారు. జీవాత్మ పరమాత్మల జ్ఞానం ముందు, జధ్యానం తరువాత అని మన స్వామి భగవద్రామానుజుల పక్షం. అందుచేత శాస్త్ర జన్య జ్ఞానాన్ని పొంది, దానిని పురస్కరించుకొని కర్మయోగాన్ని అంగంగా ఆచరించి, తదనుగుణంగా ధ్యానం చేయాలి. ఈ ధ్యానమార్గమే ఉపాసన మార్గం.

ఈ ఉపాసన మార్గమైన జ్ఞానవిశేషం కరణసాపేక్షం. మనస్సు అనేది లేకపోతే ధ్యానం చేయడం సాధ్యం కాదు. పరమాత్మను తెలిసికొంటున్నాము. పరమాత్మను ధ్యానం చేస్తున్నాము. ఇవి అన్నీ మనస్సును ఆధారంగా చేసికొని చేయాలి. అందుచేత, ఈ మూడవ అధ్యాయంలో చెప్పబడిన విషయి అనే భగవదుపాసనం– జ్ఞానం– కరణ సాపేక్షం. ఇది ఎవరిని గూర్చినది? అని అంటే, పరమాత్మను గూర్చినది. సద్విద్య, దహరవిద్య, శాండిల్య విద్య, భూమ విద్య మొదలైన విద్యలలో ఆయా విద్యలలో ఉపాసింపబడే పరమాత్మ యొక్క ఆయా కళ్యాణగుణాలే ఉపాస్యాలు.

ఒక్కొక్క బ్రహ్మ విద్యలోనూ ఒక్కొక్క కళ్యాణ గుణంతో కూడినవాడుగా భగవంతుడు ఉపాసింపబడుతున్నాడు. అందుచేత ఒక్కొక్క విద్యకు, ఆ విద్యకు ఉండే అసాధారణమైన కల్యాణ గుణమనేది ప్రత్యేక ప్రత్యేకంగా చెప్పబడింది. దీనికి అర్థం ఏమి అని అంటే, ఉపాసింపబడే గుణ భేదంచేత ఉపాసన భేదమే తప్ప అన్ని ఉపాసనాలు నారాయణుని గూర్చినవి అతనిని ఆ స్వామిని హశ్రయించే 32 విధాలయిన భక్తి మార్గాలు ఏర్పడ్డాయి, "లింగభూయస్త్వాత్" అని ఇందుకోసమే ఒక సూత్రాన్ని రచించారు, వేదవ్యాసులు. ఏ యే శబ్దాలతో వేదాంతం జగత్కారణాన్ని చెప్పినప్పటికీ, ఆయా శబ్దాలచేత చెప్పబడేవాడు నారాయణుడే –అనేది వేదాంతార్థాన్ని హస్తగతం చేసుకున్నవారి సిద్ధాంతం.

ఈ విధంగా బ్రహ్మవిద్యలలో భేదం ఉన్నప్పటికీ, అందరూ ఈ విద్యల మూలంగా నారాయణునే ఉపాసించేటప్పుడు విద్యాభేదాన్ని ఏ విధంగా గ్రహించడం? ఒకే భగవంతుని కదా అందరు ఉపాసిస్తున్నారు? ఒకే భగవంతుడే కదా అనుగ్రహిస్తున్నాడు. ఆ భగవంతుని అనుగ్రహం చేతనేకదా అందరికీ మోక్షం కలుగుతున్నది! మరి, విద్యాభేదం ఏమి? అని అంటే, ఇక్కడ భేదం అనేది ఉపాస్యభేదం. సద్విద్యా నిష్ఠుడు ఏ కళ్యాణ గుణాలతో కూడినవాడైన భగవంతుని ఉపాసిస్తున్నాడో, దహరవిద్యానిష్ఠుడు భగవంతుని అటువంటి కళ్యాణ గుణాలతో కూడిన వాడుగా ఉపాసించడం లేదు, దహరవిద్యానిష్ఠుడు ఏ కళ్యాణ గుణాలతో కూడినవాడుగా భగవంతుని ఉపాసిస్తున్నాడో, భూమ విద్యా నిష్ఠుడు భగవంతుని అటువంటి కళ్యాణ గుణాలతో కూడినవాడుగా ఉపాసించడం లేదు.

అందుచేత ఆయా ఉపాసనలకు తగినట్లుగా ఉపాస్య భేదం ఉంటుంది, వేద్యకారం ఉంటుంది అని ఉపాస్య గుణ భేదాన్ని ఆశ్రయించి ఉపాసన భేదమే తప్ప, వేరొకటి కాదు. పరమాత్మ విషయంలో ఇతడు చేయవలసిన ఉపాసనం కరణ సాపేక్షంగా ఉన్నది. నాలుగవ అధ్యాయంలో పరమపదంలో లభించే పరిపూర్ణ బ్రహ్మానుభవం చెప్పబడుతున్నది. ఇది కూడా ధ్యానమే. ఇది కూడా విషయియే. అయితే ఏమిటి తేడా? అంటే, ఇది కరణసాపేక్షంగా ఉంటుంది. పరమపదానికి వెళ్లినట్లయితే, అక్కడ భగవంతుని అనుభవించే కాలంలో ఈ జీవాత్మ శరీరంతో కూడినవాడై పరమాత్మను అనుభవించాలా? లేక, శరీరం లేకుండానే అనుభవించాలా? సశరీరత్వం మోక్షమా? లేక, అశరీరత్వం మోక్షమా? అని విచారిస్తారు, వేదవ్యాసులు.

పరమపదంలో శరీరం ఉన్నది అంటారు, ఒకరు. పరమపదంలో శరీరం ఉండదు అని అంటారు, ఇంకొకరు. ఈ రెండిటినీ కూడా అంగీకరిస్తున్నాను –అని అంటున్నారు, వేదవ్యాసులు. పరమపదంలో ముక్త జీవాత్మ శరీరంతో కూడినవాడై పరమపదంలో

భగవంతుని అనుభవించవచ్చు. పరమపదంలో శరీరం లేకుండా కూడా ఉండవచ్చు. పరమపదంలో శరీరం లేదు– అని వేదాంతం చెప్పడంలో ఏమి అభిప్రాయం అంటే – ప్రకృతి వల్ల ఏర్పడే హేయమైన శరీరం లేదు అనేదే అభిప్రాయం.

అందుచేత ఉపాస్యం అని చెప్పేటప్పుడు, మనసు అనే ఒక కరణాన్ని పురస్కరించుకునే ఉపాసనం చేయవలసి ఉన్నది. పరమపదంలో ఉండే పరిపూర్ణ బ్రహ్మానుభవాన్ని కరణ నిరపేక్షంగా కూడా పొందవచ్చు, . కరుణ సాపేక్షంగాను పొందవచ్చు. అంతేకాకుండా, ఈ లోకంలో ఉపాసించేవాని ఉపాసనకు భగవంతుని అన్ని కళ్యాణ గుణాలు వివక్షితాలు కావు. కొన్ని కల్యాణ గుణారే విషయం అవుతున్నాయి. అయితే, పరిపూర్ణ బ్రహ్మానుభవం లభిస్తున్నప్పుడు, ఉపాసన కాలంలో విషయం కాని కళ్యాణ గుణాలు కూడా అనుభవ విషయం అవుతున్నాయి. పరిపూర్ణ బ్రహ్మానుభవంలో విషయం కాని కళ్యాణ గుణాలేమీ ఉండవు.

ఈ విధంగా మూడవ అధ్యాయంలో చెప్పబడిన ఉపాసనం ఈ లోకంలో చేయబడుతున్నది. నాల్గవ అధ్యాయంలో చెప్పబడిన పరిపూర్ణ బ్రహ్మానుభవం పరమపదంలో పొందబడుతున్నది. అది కరణసాపేక్షం, ఇది కరణ నిరపేక్షం. అది ఒక్కొక్క కళ్యాణ గుణ విశిష్టుడైన పరమాత్మను విషయంగా కలిగినది, ఇది సమస్త కల్యాణ గుణ విశిష్ఠుడైన పరమాత్మను అనుభవిషయంగా కలిగినది. మూడవ, నాలుగవ అధ్యాయాలలో ఇది చెప్పబడింది. విషయీ అనే జ్ఞానం అన్నా, ఉపాసనాత్మకమైన జ్ఞానానికి, పరిపూర్ణ బ్రహ్మానుభవమైన జ్ఞాన విశేషానికి ఉండే తేడా ఏమిటో తెలుసుకోవాలి.

## 22) బ్రహ్మం జిజ్ఞాస్యం అనే విషయం

శ్రీ వేదవ్యాసులు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"– "బ్రహ్మాన్ని విచారిస్తున్నాను" అని శారీరక మీమాంసను ఆరంభిస్తున్నారు. ఇక్కడ వీరు జిజ్ఞాసా అనే పదప్రయోగాన్ని చేయడంలో పరమార్థంఏమి? అనే విషయాన్ని గమనించి చూడాలి. ఇక్కడ బ్రహ్మాన్ని వి విచారించడం సాధ్యమా? అనే ప్రశ్న కలుగుతున్నది. బ్రహ్మం అనేది "చిన్మాత్రస్య స్వయం ప్రకాశత్వేన", అంటే, జ్ఞానమే రూపంగా ఉండడం. జ్ఞాన స్వరూపమైన బ్రహ్మం తానే ప్రకాశిస్తున్నందున, దానిని మనం విచారించి తెలుసుకోవడం అనేది ఎటువంటిది? మన విచారం లేకుండానే, విచారాన్ని అపేక్షించకుండానే బ్రహ్మం స్వయం ప్రకాశక వస్తువుగా ఉన్నందున, దానికి విచార్యమాణత్వం ఏవిధంగా సిద్ధిస్తుంది? బ్రహ్మం విచారణీయం అని వ్యాసులు చెప్పినందున, బ్రహ్మంష చిన్మాత్రమే కాదని, అందుచేత బ్రహ్మం జ్ఞానానికి విషయం అని తెలుస్తుంది.

భగవద్రామానుజులు శ్రీభాష్యం ఆరంభంలోనే ఈ విషయాన్ని వివరించి తెలియజేశారు. నాథమునుల కారిక అనబడే నాథమునుల వచనాన్ని అంతటినీ ఉదాహరించి చూపారు. "జ్ఞాన స్వరూపం పరం బ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకమ్, అజ్ఞానం చేత్ తిరస్కుర్యాత్ కః ప్రభుః తన్నివర్తయేత్?" అనేది మొదటి శ్లోకం. జ్ఞానం ద్వారా తొలగించుకొనవలసిన, నశించే అజ్ఞానమనేది జ్ఞానస్వరూపమైన బ్రహ్మాన్ని ఏ విధంగా ఆవరిస్తుంది? ఇక్కడ అజ్ఞానం పరమాత్మ కా? లేక, జీవాత్మకా? అనేది విచారణ. మన సంప్రదాయానికి, అద్వైత సంప్రదాయానికి మధ్య ఏమి తేడా? అజ్ఞానాన్ని వారు ఎవరికి చెబుతున్నారు? మనం ఎవరికీ చెబుతున్నాము? అని గమనించాలి. పరమాత్మకు అజ్ఞానం అనేది అద్వైతుల వాదం. సంసారి జీవనకు అజ్ఞానం అనేది మన సంప్రదాయం. జ్ఞాన స్వరూపమై ఉండే పరమాత్మకు అజ్ఞానాన్ని ఏ విధంగా చెప్పడం వీలవుతుంది? సూర్యుడు చక్కగా ఉదయించే ప్రకాశించేటప్పుడు అక్కడ

చీకటి ఏ విధంగా ఉండగలదు? దీనిని “సహానవస్థాలక్షణ విరోధం” అని అంటారు. తేజస్సు, చీకటి అనేవి ఒకే చోట ఏ విధంగా ఉండగలవు? ఇదేమి అబద్ధవాదం? అని అంటారు, మన పూర్వాచార్యులు. అద్వైతులలోనే రెండు పక్షాలు ఉన్నాయి. ఒకటి పరమాత్మకు అజ్ఞానం చెప్పే పక్షం. ఇంకొకటి జీవాత్మలో కల్పితుడుగా ఉండే పరమాత్మకు మాత్రం అజ్ఞానాన్ని అంగీకరించే పక్షం. వీటిలో పరమాత్మకు అజ్ఞానాన్ని చెప్పే పక్షాన్ని ఖండించారు, నాథమునులు. “జ్ఞానరూపం పరం బ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకమ్,” జ్ఞాన స్వరూపమైన బ్రహ్మను, జ్ఞానంతో నిరసింపవలసిన అజ్ఞానం ఆవరించేదై ఉన్నట్లయితే, తన వద్దకు వచ్చిన అజ్ఞానాన్ని బ్రహ్మం తతన చేతనే పోగొట్టుకోవడం సాధ్యం కాదు అంటే, ఇక, ఆ అజ్ఞానాన్ని ఎవరు పోగొట్టగలరు? అని ప్రశ్నిస్తున్నారు, ఇక్కడ నాథమనులు. దీనికి అద్వైతులు ఏమని సమాధానం చెబుతారు? అని అంటే, అజ్ఞానంతో వచ్చి చేరాడే కల్పితుడైన జీవాత్మ, ఇతడు తనకు ఏర్పడిన శాస్త్రజన్య మైన అద్వైత జ్ఞానంతో పరమాత్మకు గల అజ్ఞానాన్ని పోగోడుతున్నాడు– అని వదులు పలుకుతారు. ఇది అబద్ధం లో కూడా పరమ అబద్ధమైన వాదం ఈ వాదానికంటే పరమాత్మకు అజ్ఞానం చెప్పే వాదమే మేలు అని చెప్పవచ్చు. పరమాత్మకు ఉండే అజ్ఞానాన్ని జీవాత్మ పోగొడుతున్నాడు అనేదానికంటే అబద్ధమైన కుతర్కమైన వాదం ఇంకోటి ఉంటుందా? ఉండే అవకాశం ఉన్నదా? ఇందులో సంసారం ఎవరికి? మోక్షం ఎవరికి?

భగవద్రామానుజుల మతానుసారం జీవాత్మకే సంసారం, అజ్ఞానం, మోక్షం అనేవి ఉన్నాయి. పరమాత్మ యొక్క కారుణ్యం చేత మనకు కల అజ్ఞానం తొలగుతున్నది. అందుచేత, “బ్రహ్మం జిజ్ఞాస్యం” విచారించదగినది –అని వ్యాసులు అనుగ్రహించినందున, మన జ్ఞానానికి విషయం పరమాత్మ అని తెలుస్తున్నది. బ్రహ్మ అవేద్యం, అవాచ్యం అనే అద్వైతవాదంవలె కాకుండా, బ్రహ్మ జ్ఞానానికి విషయమై

ఉన్నది, వాక్కుకు విషయమై ఉన్నది అనేది ఆళ్వారులు, వారి మార్గాన్ని అనుసరించిన మన పూర్వాచార్యులు తమ తమ సూక్తుల ద్వారా విస్తృతంగా నిరూపించి అనుగ్రహించారు.

"యతో వాచో నివర్తంతే" అనే వేదాంతవాక్యానికి అభిప్రాయం ఏమి? అని అంటే, ఆనందమయుడైన పరమాత్మ యొక్క ఆనందాన్ని పరిచ్ఛేదించి చూచి, "అది వాక్కుకు, మనస్సుకు అందనిది" అని పలికి నివృత్తిని పొందింది, వేదం –అని అర్థం. అద్వైత మతాచార్యులు ఎందుకు వేదాంతంలో పరమాత్మ యొక్క ఆనందాన్ని పరిచ్ఛేదించి తెలియడం సాధ్యం కాలేదు అనేదానికి వ్యాఖ్యానం చేశారు? బ్రహ్మ నిర్గు అంటే, బ్రహ్మ నిర్గుణం. వారి మతంలో ఆనందం అనే గుణమే బ్రహ్మకు లేదు. ఆ గుణం ఉంటే కదా, వాక్కుకు అందనిది అని వారిచే వాదం చేయబడే అవకాశం ఉన్నది. వాక్కుకు ఎందుకు అందలేదు? అంటే, ఏమీ లేదు, అందువల్ల వాక్కు అందలేదు– అని అనేది అద్వైతుల వాదం.

అయితే, మన ఆచార్యులు ఈ విధంగా వ్యాఖ్యానం చేయలేదు. వారు చెప్పే వివరణం ఏమంటే, బ్రహ్మయొక్క ఆనందం అనే కల్యాణ గుణం "పరిచ్ఛేదరాహిత్యాత్" అని చెప్పేటట్లుగా ఇంత అని లెక్క కట్టి తెలియడానికి సాధ్యం కాలేదు అనే విధంగా ఉన్నందున, వేదాంతంచేత భగవంతుని ఆనంద గుణం పరిచ్ఛేదించి తతెలియబడలేదు. ఆ గుణం అపారంగా ఉన్నందున, వాక్కుకు మనసుకు అందలేదు– అనేది మన పూర్వాచార్యులు చూపే పరమార్థం.

వేదాంతంలో ఈ వాక్యం ఎక్కడ ఉన్నది? అనే విషయాన్ని గమనించాలి. వేదాంతంలో ఇది ఉత్తరోత్తరంగా ఆనందాన్ని వృద్ధి చేస్తూ పోయే ప్రకరణలో ఉన్నది. ఇది మనుష్యానందం, దానికంటే పెద్దది దేవానందం, దానికంటే గొప్పది ఇంద్రుని ఆనందం,

దానికంటే గొప్పది బ్రహ్మ యొక్క ఆనందం, దానికంటే పెద్దది పచతుర్ముఖ బ్రహ్మ ఆనందం, అని ఆనందాన్ని వృద్ధి చేస్తూ, ఉత్తర ఉత్తరంగా ఎక్కువ చేస్తూ పలికి, చివరకు బ్రహ్మానందం వాక్కుకు, మనస్సుకు అందనిది అని తెలియజేసే ప్రకరణం ఇది. ఈ విధంగా లేకుండా, అద్వైతులు చెప్పేదే వేదాంత సిద్ధాంతమై ఉన్నట్లయితే, ఈ ప్రకరణం ఏవిధంగా ఉండి ఉండాలి? అని చూడాలి గమనించి చూడాలి. అంటే నూటిలో ఒక భాగం ఈ ఆనందం, అంతకంటే నూటిలో ఒక భాగం ఆ ఆనందం, అంతకంటే నూటిలో ఒక భాగం ఆ ఆనందం –అని ఆనందాన్ని క్రమక్రమంగా చిన్నది చేస్తూ, చివరిలో బ్రహ్మానందం శూన్యం అని ముగించి ఉండాలి. ఈ ప్రకరణం అయితే, ఆ విధంగా కనబడడం లేదు. ఇది పరమాత్మకు అపకర్షను చెప్పే ప్రకరణమా? లేక, ఉత్కర్షను చెప్పే ప్రకరణమా? అని ప్రశ్నిస్తున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. పరమాత్మ అపరిమిత వైభవ శాలియై ఉన్నందున, అతని గొప్పతనం వాక్కుకు, మనస్సుకు చెప్పడానికి కానీ, భావించడానికి కానీ సాధ్యం కానిది –అనేదే అర్థం– అని ఈ వేదాంతవాక్యానికి అర్థం తెలియజేశారు, మన పూర్వాచార్యులు. ఆ సూత్ర ప్రబంధ ఆరంభంలోనే బ్రహ్మ జిజ్ఞాస్యం అని శ్రీ వేదవ్యాసులు అనుగ్రహించడం అనేది అద్వైత సిద్ధాంతానికి ఎంత మాత్రం పొసగేది కాదు అని స్పష్టపడుతున్నది.

## 23) బ్రహ్మవిచారవేద్యత్వ నిరూపణం

శ్రీభాష్యారంభంలో "అధీతసాంగసశిరస్కవేదస్య అధిగత అల్పాస్థిర కేవలకర్మజ్ఞానతయా సంజాతమోక్షాభిలాషస్య అనంతస్థిరఫల బ్రహ్మ జిజ్ఞాసా హ్యనంతరభావినీ" అనే ఒక వాక్యం అనుగ్రహింపబడింది. ఈ వాక్యాన్ని శ్రీ భాష్యం చివరి వాక్యం వరకు మనం మనసులో గ్రహించాలి. మరువనే కూడదు. మరువకూడని చాలా ముఖ్యమైన వాక్యం ఇది. దీని అర్థాన్ని మొదట వివరిస్తాను.

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అని అధ్యయనాన్ని వేదం విధిస్తున్నదీఈ అధ్యయనం సాంగ సశిరస్క వేదాధ్యయనం కావాలి. అంగాలతో పాటుగా వేదాన్ని అధ్యయనం చేయాలి వేదసిరస్సు అంటే వేదాంతం. దానిని కూడా అధ్యయనం చేయాలి. "శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధి, యుక్తః ఛందాంస్యధీయీత మాసాన్ విప్రః అర్ధ పంచమాన్" అని, "అథ ఊర్వ్వం తు ఛందాంసి శుక్లే తు నియతః పఠేత్, వేదాంగాని చ సర్వాణి కృష్ణపక్షే తు సంపఠేత్" అని మనుభగవానుడు పలికాడు. ఒక సంవత్సరంలో ఐదున్నర మాసాల కాలం వేదాధ్యయనాన్ని చేయాలి. వేదాధ్యయనాన్ని ఈ కాలంలో ఆరంభించాలి, ఈ కాలంలో పూర్తి చేయాలి– అని ఈ విధంగా కాలనియమాలు ఉన్నాయి. వేదాధ్యయన కాలారంభం. ఉపాకర్మ దినంనాడే వేదాధ్యయనం అవుతుంది. మనం ఈ విధంగా ఈ కాల నియమానుసారంగా ఇప్పుడు నడుచుకోవడం లేదు– అనే కారణంచేతనే దీనికి ప్రాయశ్చిత్తంగా గాయత్రీమహామంత్ర జపం, కామోకార్షీత్ మంత్ర జపం అనే ఇవి అన్నీ శాస్త్రంలో విధింపబడ్డాయి. వేద వేదాంతలను అధ్యయనం చేసేటప్పుడు ఈ పక్షాలలో చేయాలి అనే నియమాలు ఏర్పరచబడ్డాయి.

ఈ క్రమంలో ఒకడు వేదాధ్యయనం చేశాడు. సాంగ వేదాధ్యయనం చక్కగా చేశాడు, అంటే, వేదాన్ని మాత్రమే అధ్యయనం చేయలేదు, వేదాన్ని, వేదాంతాలతో పాటు అధ్యయనం చేశాడు. వేదవేదంతాలను మాత్రమే అధ్యయనం చేయలేదు, అంగాధ్యనాన్ని కూడా చేశాడు. "అధీతవేదస్య, అధీత సాంగవేదస్య, అధీత సాంగ సశిరస్కవేదస్య" అని అంటున్నారు, మన స్వామి భగవద్రామానుజులు.

శీక్షా, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం– అని ఆజు వేదాంగాలు. శ్రీ రంగరాజస్తవంలో పరాశరభట్టర్ ఈ ఆరు అంగాలకు ఏమి ప్రయోజనం అని అనుగ్రహించారు? దీనిని అనుసరించి దేశికులు కూడా ఒక శ్లోకాన్ని

అనుగ్రహించారుకూడా. శిక్షా మొదలైన ఆరు అంగాలతో ఒకడు వేదాధ్యయనం చేసినవాడే అయితే, అతనికి వేద వేదాంత భాగాలలో ఆపాత ప్రతీతి కలుగుతుంది. ఆపాత ప్రతీతి అంటే– నిశ్చయబుద్ధి లేని, సంశయ విపర్యలకు అనుగుణమైన, వాటితో చేరిన, జ్ఞానం– అని అర్థం. వేద భాగమైన పూర్వభాగం కానీ, ఉత్తర భాగమైన వేదాంతంగాని, ఈ రెండిటిని అధ్యయనం చేసి ఉన్నందున, దానికి తగిన అంగాధ్యయనం చేసి ఉన్నందున, దీనివల్ల ఏర్పడవలసిన జ్ఞానమనేది యథార్థమైన జ్ఞానంగా కలుగకుండా, ఆపాత ప్రతీతిగా కలిగింది. ఇటువంటి అపాత ప్రతీతి కలిగినవానికి వెంటనే ఒక ఆశ కలుగుతుంది. "ఏదో కొంచెంతెలిసింది, చక్కగా ఏఏది ఏమని పూర్తిగా తెలుసుకుంటే మంచిది కదా!" అని తోచి, మీమాంసలో, అంటే, విచారణలో, అతడు ప్రవేశిస్తాడు.

ఈ విధంగా విచారణలో ప్రవేశించడం అనేది విధిప్రయుక్తంగా కాకూడదు. "రాగాత్ మీమాంస్యతే" అనే విధంగా అనురాగంతో విచారణలో ప్రవేశించాలి, అంటే, రాగ ప్రయుక్తంగా ఈ ప్రయత్నం కలగాలి– అని అంటున్నారు, మన పెద్దలు. అందువల్లనే శ్రీవేదవ్యాసులు మొదటి సూత్రంలో "జిజ్ఞాసా" అనే పదప్రయోగాన్ని చేశారు. "జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా", అంటే, తెలుసుకోవాలి –అనే ఆశ అని మన పూర్వాచార్యుల నిరూపణం. ఈ విధంగా ఆశకు అనుగుణమైన జిజ్ఞాస అనే పదప్రయోగాన్ని చేసినందున, విచారం చేయడానికి ఆరంభించడం ఆశ వల్లనే, నిర్బంధం వల్ల కాదు– అనితెలుస్తుంది. ఈ విధంగా ఆపాత ప్రతితి ఎవరికి కలిగిందో, అతడు విచారం చేయడానికి ఆరంభిస్తున్నాడు. అతడు రాగ ప్రయుక్తంగా విచారం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఎవరికి ఆపాత ప్రతీతి కలుగుతుంది? అంగాలతో క్రమంగా వేద వేదాంతాధ్యయనం చేసినవానికే కలుగుతుంది– అనేది సంప్రదాయ సిద్ధమైన అర్థం.

ఇందులో మొట్టమొదట ఏ విచారణలో ప్రవేశిస్తున్నాడు? అని అంటే, కర్మ విచారణలోనే ప్రవేశిస్తున్నాడు, బ్రహ్మ విచారానికి మొదట ప్రయత్నించడం లేదు. ఆచార్యుని వద్ద విషయాలను వింటున్నాడుస్వామి. ఇతడు వేద భాగాన్ని అధ్యయనం చేశాడు. వేదాంత భాగాన్ని కూడాఅధ్యయనం చేశాడు. ఈ విధంగా సాంగాధ్యనాన్ని చేసినవానికి వేదభాగమైన కర్మ భాగంలో ఆపాత ప్రతీతి కలిగింది, ఆ విధంగానే, వేదాంతభాగమైన బ్రహ్మ భాగంలో కూడా ఆపాత ప్రతీతి కలిగింది. ఈ విధంగా రెండు భాగాలలోనూ ఆపాత ప్రతీతి కలిగితే, మరి, అతడు కర్మ విచారాన్ని మొదటచేయడానికి కారణమేమి? బ్రహ్మవిచారాన్నే కమొదట చేస్తే ఏమి? అనేది ఇక్కడ ప్రశ్న. అంటే, కర్మ విచారానికి తరువాతనే బ్రహ్మ విచారం అని చెప్పడం ఎందుకు? మొదట కర్మ విచారాన్నే ఎందుకు చేస్తున్నాడు? అనేది ఇక్కడ ప్రశ్న.

దీనికి తగిన సమాధానాన్ని వేదాంతదేశికులు చాలా అందంగా, అద్భుతంగా అనుగ్రహించారు. ఈ విధంగా రాగంతో విచారం ప్రసక్తం కావడం ఇతనికి కల అనాది సంసార సంబంధంచేతనే. మునుముందుగా, త్రివర్గంలో, అంటే, ధర్మార్థ కామాలలో, ప్రావణ్యం ప్రసక్తమైనందున, వాటిలో ప్రతిపాదింపబడినవాటిని తెలియజేసే వేద భాగాన్ని మొదట విచారిస్తున్నాడు– అని అంటున్నారు, దేశికులు. ధూళి పడితే మనం కన్ను వెంటనే మూసికోవడాన్ని గమనిస్తున్నాం. ఒకడు ఇంకొకరిని ఎవరిని అయినా కొట్టడానికి వస్తే, రెండవ వాడు దూరంగా పారిపోవడానికి ప్రయత్నం ఆరంభిస్తాడు. దీనికి అంతటికి అనాదికాలంగా అనువర్తిస్తూ వస్తున్న వాసనయే కారణం. ఇది రుచి వాసన, అవిద్యావాసన అని ఈ విధంగా చెప్పబడుతున్నది. ఇది అనాది కాలంగా సంసారి జీవునకు ఏర్పడిన వాసన. బిడ్డ జన్మిస్తున్నది. తరువాత వెంటనే ఆకలితో అది ఏడుస్తున్నది. ఈ విధంగా బిడ్డకు ఆకలి కలిగి అది దానికి తెలిసింది అంటే, అది అనాదికాలంగా అలవాటు పడిన విషయమే కదా.

మొదట కర్మ విచారానికి ఎందుకు ప్రయత్నం చేస్తున్నాడు? అంటే, అనాదికాలంగా పుత్రపశ్వన్నాదులనే అనుభవించి అనుభవించి, జన్మ పరంపరలో అభినివేశాన్ని పొంది, ఇతడు ఏ నాడూ మోక్షం విషయంలో ఆసక్తిని పొందినవాడు కాడు. మోక్షంలో ఏనాడైనా అభినివేశం కలవాడై, అలవాటు పడి ఉంటే కదా, అందులో రుచివాసన కలుగుతుంది, ఇతనికి. అనాదికాలంగా ప్రవృత్తి మోక్షఫలంలో లేదు. శబ్ద రసస్పర్శరూపగంధాల రూపంలోని, ఈ లోకంలో ఉండే ఐదు విషయాలనే అనాదికాలంగా అనుభవించి, ఆ కారణంచేత కర్మనుగూర్చి కొంచెం తెలిసికొని ఉన్నవాడు అయినందున, అందులో ఉండే రుచి వల్ల దానిని పూర్తిగా తెలుసుకున్నట్లయితే, పూర్ణఫలాన్ని పొంది, ఆనందించవచ్చు అనే ఆశ చేత మొదట కర్మ విచారణలోనే ఇతడు ప్రయత్నం చేస్తున్నాడు. "నిత్యమైన ఫలంకర్మ వల్ల కలుగదు" అనే నిశ్చయబుద్ధి ఏర్పడిన తరువాతనే బ్రహ్మ విచారణ చేయడానికి ముందుకు వస్తున్నాడు—అని అంటున్నారు సూత్రకారులు.

ఇదే, "అధీతసాంగసశిరస్కవేదస్య అధిగత అల్పాస్థిర కేవలకర్మజ్ఞానతయా" అని అంటూ భగవద్రామానుజులు తెలియజేశారు. అంటే, కర్మవిషయకాల్పాస్థిరఫలకనిర్ణయం ఆవశ్యకమవుతున్నది. మొదట కర్మ విచారాన్ని చేసి, ఈ కేవల (బ్రహ్మజ్ఞాన సంబంధం లేని) కర్మలు అల్పంగానూ, అస్థిరంగానూ నశించేవిగాను ఉండే ఫలాలనే ఇస్తాయి, ఇవ్వగలవు —అనే విషయాన్ని తెలుసుకుంటున్నాడు. తరువాత (అనంతర భావినీ) ఇతనికి "సంజాతమోక్షాభిలాషస్య అనంతస్థిరఫల బ్రహ్మ జిజ్ఞాసా" కలుగుతున్నది. అంటే, మోక్షాన్ని పొందాలి అనే కోరిక కలుగుతున్నది, అనంతంగానూ, స్థిరంగానూ, ఫలరూపంగానూ ఉండే బ్రహ్మను తెలియాలి— అనే కోరిక కలుగుతున్నది.

అందుచేత కర్మ విచారం పూర్వ వృత్తం. దీనికి కారణం సాంగసశిరస్క వేదస్య ఆపాతప్రతీతి". బ్రహ్మ విచారం ఉత్తర కృత్యం. అంటే, "కర్మవిచారానికి" తరువాత చేయదగినది. దీనికి హేతువు "కర్మణామ్ అల్పాస్థిరపలత్వనిర్ణయ సహితానంత స్థిరఫలాపాత ప్రతీతిః" అని నిర్ణయింపబడినది.

ఈ విధంగా బ్రహ్మ విచారణలో ప్రయత్నించే అధికారికి ఉండవలసిన స్వభావాలు ఏవి? అంటే,

1)కర్మ విచారాన్ని చేసిఈ కర్మలుఅల్పాస్థిరపలకేవలకర్మలు అనే జ్ఞానం కలగాలి. "ఎన్ని కర్మలను ఎన్ని సంవత్సరాలు చేసినా, దానివల్ల నిత్యమైన మోక్షపురుషార్థం లభించదు" అనే నిశ్చయబుద్ధి, సాంసారిక ఫలాలలో నిర్వేదం, అంటే, వైరాగ్యం కలిగినవాడై ఉండాలి.

2)అనంత స్థిరఫలమైన మోక్షంలోఇచ్ఛను కలిగినవాడు కావాలి. అనంత స్థిరపల ఆపాత ప్రతీతిని పొందినవాడై ఉండాలి. అంటే, బ్రహ్మను గూర్చిన ఆపాత ప్రతీతి, బ్రహ్మను గూర్చిన కొంతవరకు జ్ఞానం. ఏదో కొంచెం అర్థం తెలిసినందువల్ల, నిరతిశయానంద స్వరూపుడైన, ఆనందమయుడైనపరమాత్మను పరిపూర్ణంగా పొంది, అనుభవించాలి అనే ఆశ.

ఇతనిని విశిష్ట అధికారి అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. ఈ విధంగా పూర్వకాండలో చెప్పబడిన అర్థాన్ని గూర్చిన నిశ్చయబుద్ధి (కర్మలు అల్పాస్థిరఫలాలను ఇస్తాయి– అనే నిర్ణయం)తో కూడినది, ఉత్తరకాండంలో చెప్పబడి ఉండే అర్థాన్నిగూర్చిన ఆపాత ప్రతీతి (అనంత స్థిరఫల ఆపాత ప్రతీతి)అనే ఈ రెండు స్వభావాలను మొదటి సూత్రంలో ఉండే "అథ, అతః" అనే రెండు శబ్దాల పరమార్థంగా

శ్రీరామానుజుల పైన ప్రస్తావించిన సూక్తి తెలుపుతున్నది అని అంటున్నారు, శ్రుత ప్రకాశికాచార్య స్వామివారు. నేను పూర్వం సూచించిన శ్రీ రామానుజుల ఈ సూక్తి చాలా ముఖ్యమైనది.

శ్రీరామానుజులు చూపించిన ఈ అర్థ విశేషాలను శ్రీవేదవ్యాసులు "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే మొదటి సూత్రంలో అభిప్రాయపడిన అర్థాలే. అథ–కర్మ విచారానికి తరువాత, అతః– కర్మ విచారాన్ని చేసినందు వల్ల, బ్రహ్మజిజ్ఞాసా బ్రహ్మ విచారణను, "కర్తవ్యః" (చేయాలి) అనే పదాన్ని ఇక్కడ అధ్యాహరించుకొని, చేయదగినది అనే ప్రతిజ్ఞా వాక్యం అవుతున్నది. పక్షసాధ్యాలను తెలిపే వాక్యం ప్రతిజ్ఞా వాక్యం అనబడుతుంది. సాధ్య విశిష్టపక్ష బోధకవచనం కదా, ప్రతిజ్ఞా వాక్యం. "బ్రహ్మజిజ్ఞాసా అథ "అనేది ప్రతిజ్ఞ. ఇక్కడ "బ్రహ్మ విచారం కర్తవ్యం" అనేది ప్రతిజ్ఞ కాదు, కర్మ విచారానికి తరువాత కర్తవ్యం అనేదే ప్రతిజ్ఞ అని అంటారు, పెద్దలు. దానికి హేతువును తెలియజేస్తున్నది, "అతః" అనే పదం. "కర్మ విచారహేతుత్వాత్" అని అర్థం. ఈ విధంగా కర్మ విచారానికి ఏ విధంగా వేదాధ్యయనం పూర్వ వృత్తమో, ఆ విధంగానే బ్రహ్మ విచారానికి కర్మ విచారం నియమేన పూర్వ వృత్తం అవుతున్నది– అని తాత్పర్యం.

ఈ విషయాన్ని కొంచెం వివరిస్తాను. ఇది శ్రీశ్రుతప్రకాశికాచార్య స్వామివారు అనుగ్రహించిన అర్థవిశేషమే. అది ఏమంటే, సూత్రం అంటే ఒక అనుమాన ప్రకారం చెప్పాలి. "పర్వతం నిప్పుతో కూడినదిగా ఉన్నది, ఎందుకంటే, పొగ ఉన్నందున" అని చెప్పినట్లే, ఇక్కడకూడా, సూత్రంలో పక్షం ఏది? సాధ్యం ఏది? అని ఈ విధంగా చూపించాలి. "వేదార్థమ్ అఱుదియిడువదు స్మృతిహాస పురాణంగల

ళాలే "అని శ్రీ వచన భూషణ సూత్రం. ఈ సూత్రంలోఅనుమానాలను అన్నిటిని చూపుతున్నారు, మన పూర్వాచార్యులు. వేదార్థం అంటే –ఏమి? నిశ్చయించుకోవడం అంటే ఏమి? ఇతిహాసాలను, ధర్మశాస్త్రాలను పురస్కరించుకొని అంటే ఏమి? పక్షం ఏది? సాధ్యం ఏది? హేతువు ఏది? అనే ఈ విషయాన్ని తెలియజేస్తున్నారు. ఆ విధంగానే, అథ అతః, బ్రహ్మజిజ్ఞాసా అనేది అంతాఏమి అర్థాన్ని ఇస్తున్నది? అనే విషయాన్నిని రూపించాలి. ఈ సూత్రంలో "కర్తవ్యః" అనే పదాన్ని చేర్చుకోవాలి. "బ్రహ్మ జిజ్ఞాసా, బ్రహ్మ విచారః కర్తవ్యః, అతః, కర్మ విచారంఇంతకుముందు జరిగినందువల్ల –అనేది అర్థం. అథ అనేది సాధ్య సమర్పకం. బ్రహ్మ జిజ్ఞాసా అనేది పక్షవాచకం. అతః అనేది హేతువాచకం –అని అంటూ ఈ మూడిటిని సంగతంగా శ్రుతప్రకాశికాచార్య స్వామివారు అనుమాన ప్రకారంగా శ్రుత ప్రకాశికలో చూపించారు.

శ్రుతప్రకాశికాచార్య స్వామివారు ఇంకా ఈ విధంగా తెలియజేస్తున్నారు. "బ్రహ్మ విచారం కర్తవ్యం" అనేది మాత్రమే కాదు, బ్రహ్మ విచారం అనంతరంకర్తవ్యం. అనంతర కర్తవ్యత్వం సాధ్యమే తప్ప, కర్తవ్యమాత్రం సాధ్యం కాదు –అని అంటున్నారు, వారు. కర్మ విచారం ఇంతకు ముందే జరిగినందు వల్ల, కర్మ విచారానికి తరువాత బ్రహ్మ విచారం, దీనికి అర్థమేమి? ఒకడు కర్మ విచారంచేసిన 50 సంవత్సరాలకు తరువాత బ్రహ్మవిచారం చేయడానికి వస్తున్నాడు అంటే, ఆ విధంగా కాదు– అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. కర్మ విచారణ చేసిన వెంటనే బ్రహ్మవిచారం. ఎందుకని అంటే, కర్మ విచారం ద్వారా కర్మలు అన్నీ అనిత్యమైన ఫలాలను మాత్రమే ఇస్తాయి అనే నిశ్చయబుద్ధిని అతడు పొందాడు. బ్రహ్మ విషయంలో ఏర్పడిన ఆపాత ప్రతీతిని నిశ్చయబుద్ధిగా చేసుకోవడం కోసం వెంటనే బ్రహ్మవిచారం చేయాలి తప్ప, ఎప్పుడో ఒక కాల విశేషంలో కర్మ విచారాన్ని చేసి, ఇంకొక కాల విశేషంలో బ్రహ్మ విచారణలో ప్రవేశించడం అనేది కూడదు. "అథ కర్తవ్యః" అనేదే ఈ చోట ముఖ్యమైన సాధ్యాంశం. ఈ

అర్థాలను తెలియజేసే విధంగా ఉన్నది– "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే మొదటి సూత్రం.

అద్వైతులు బ్రహ్మవిచారానికి కర్మ విచారాన్ని పూర్వవృత్తంగా అంగీకరించరు. వారు, సాధన చతుష్టయాన్ని బ్రహ్మ విచారానికి పూర్వవృత్తంగా పలుకుతారు. అధికరణ సారావళిలో దేశికులు అద్భుతంగా ఒక విషయాన్ని తెలియజేస్తారు. కొందరు రాహు మీమాంసకులుగా ఉన్నారు., మరికొందరు కబంధమీమాంసకులుగా ఉన్నారు– అని అంటూ మీమాంసకులను రెండు వర్గాలుగా విభజించారు. తలను మాత్రమే గ్రహించేవాడు ఒకడు, అతడు రాహుమీమాంసకుడు. శరీరాన్ని మాత్రం గ్రహించేవాడు ఇంకొకడుఅతడు కబంధ మీమాంసకుడు. వేదభాగాన్ని మాత్రం ఒప్పుకొని, వేదాంత భాగాన్నివిడచి పెడుతున్నాడు, కబంధ మీమాంసకుడు. వేదాంత భాగాన్ని మాత్రంఒప్పుకొని, వేద భాగాన్ని పెడుతున్నారు, శంకరులవంటి రాహు మీమాంసకులు. ఈ విధంగా కాకుండా, తలను, శరీరాన్ని అంతటినీ, గ్రహించి, ఆరాధన విశిష్టమైన ఆరాధ్యమైన బ్రహ్మన్నే మీమాంసా శాస్త్రం కీర్తిస్తున్నది అని ఏకార్థత్వాన్ని నిరూపించడానికి ఉద్యమించినవారు, శ్రీయామునుల వంటి మహాచార్యులు.

"అధాతశబ్దభాష్యేణ రాహుమీమాంసకో జితః" అనే ఒక వచనం ఈ వాస్తవాన్ని తెలుపుతున్నది. అథ–కర్మ విచారానికి తరువాత, అతః–కర్మవిచారం ప్రవర్తించినందున– అనే ఈ రెండు శబ్దాలతో వ్యాసులు ఎవరిని జయించారు? అని అంటే, రాహు మీమాంసకులను జయించారు. "కర్మ విచారానికి తరువాత "అని వారు అనుగ్రహించినందున. "కర్మమాంసయే ఆవశ్యకం కాదు– అని పలికే రాహుమీమాంసకులైన అద్వైతులవంటివారి పక్షాన్ని వారు నిరాకరించారు –అనే విషయం స్పష్టమవుతున్నది.

జిజ్ఞాసాధికరణ శ్రీ భాష్యం చాలా విపులంగాఏర్పడి ఉన్నది. ఇందులో మొత్తం 24 విషయాలు మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహిస్తున్నారు అని ఒక లెక్క ఉన్నది. సాధారణంగా అధికరణం అని అంటే, దాని భాష్యంలో అధికరణ ప్రతిజ్ఞ, సూత్రం, ఉపోద్ఘాతం, సూత్రార్థం, పూర్వపక్షం, సిద్ధాంతంఅనే ఇవి అన్ని ఏమేమి? అనే విషయాన్ని తెలియజేయాలి. శ్రీ రామానుజులు ఒక్కొక్క అధికరణ భాష్యంలోనూ అధికరణార్థాన్ని, సూత్రార్థాన్ని తెలియజేసిన వెంటనే, ఆ అధికరణంలో ఏది విషయ వాక్యం? ఏది సందేహం? ఏమి పూర్వపక్షం? ఏది సిద్ధాంతం? అని ఇవి అన్నీ క్రమంగా అనుగ్రహించారు. అయితే ఈ మొదటి అధికరణంలో మాత్రం ఈ క్రమాన్ని అనుసరించలేదు. ఈ మొదటి అధికరణంలో ఉపోద్ఘాతం, సూత్రార్థం తెలియజేసిన వెంటనే, సూత్రకారుడుఈ సూత్రాన్ని రచించేటప్పుడు పూర్వపక్షిగా ఎవరిని ఉద్దేశించారు? వారు చేసే పూర్వపక్షం ఏమి? వ్యాసులు చెప్పే సిద్ధాంతం ఏమి? అనే ఇటువంటి విషయాలన్నీ ఉండాలి. అయితే, మన స్వామి ఈ విషయాలను ఈ అధికరణ భాష్యంలో చివరిలోతెలియజేశారు.

ఈ అధికరణంలో పూర్వపక్షి ఎవరు? అనేది ప్రశ్న. ప్రాధాకరుడు అనే మీమాంసకులలో ఒకడు పూర్వపక్షి. అతనిని పూర్వపక్షిగా ఉద్దేశించి అతనికి సమాధానాన్ని శ్రీ వేదవ్యాసులు తెలియజేస్తున్నారు. పారాశర్య విజయంఅనే బ్రహ్మ సూత్ర వ్యాఖ్యాన గ్రంథంలో చోడళసింహపురం చండమారుతం దొడ్డయాచార్య స్వామివారు ఈ మొదటి సూత్రంద్వారా వేదవ్యాసులు ప్రాభాకరుని మాత్రమే ఖండించలేదు, మాయవాదిని, శైవుని కూడా ఖండిస్తున్నారు– అని తెలియజేశారు. ఇది ఏ విధంగా తెలుస్తుంది? అని అంటే, మీమాంసకులను ఖండించడం అనేది సూత్రార్థాన్ని గమనించేటప్పుడు స్పష్టంగా తెలుస్తుంది. సూత్రంలో బ్రహ్మ శబ్దం ఉన్నందున, ఇందులో మాయవాదులకు అవకాశం ఏమీ లేదు అని, ఆ కారణంచేతనే శైవునకు కూడా ఇందులో

అవకాశం లేదు అని తెలుసుకోవచ్చు అని అంటున్నారు, దొడ్డయాచార్య స్వామి. అందుకే శ్రీవేదవ్యాసులు చేసిన బ్రహ్మ శబ్ద ప్రయోగంచేత మాయవాదుల పక్షం, శైవుల పక్షం కూడా ఖండింపబడింది– అని తెలుస్తుంది. శ్రీభాష్య. మంగళశ్లోక వ్యాఖ్యానంలో శ్రుతప్రకాశికాచార్యులవారు "శ్రీనివాసశబ్దేన పాశుపతాదివ్యుదాసః" (శ్రీనివాస శబ్దాన్ని ప్రయోగించడం వల్ల పాశుపతవాదులు మొదలైన వారు ఖండింపబడ్డారు) అని అన్నారు. అంటే, "బ్రహ్మణి శ్రీనివాసే" అనే చోట ఉండే శ్రీనివాస శబ్దంద్వారా పాశుపతులు మొదలైనవారు నిరాకరింపబడ్డారు అని అక్కడ వ్యాఖ్యానం.

మీమాంసకులలో ప్రభాకరుడు " సిద్ధార్థాన్ని శబ్దం. తెలియజేయలేదు, అందుచేత వేదాంతవాక్యాలు సిద్ధవస్తువైన బ్రహ్మను బోధించవు. అందుచేత సాంగ సశిరస్కవేదాధ్యయనం చేసినవానికి వేదాంత భాగంలో ఆపాతప్రతీతియే కలుగదు. అందుచేత విశిష్ట హేతువు సిద్ధించదు. అందుచేత బ్రహ్మ విచారం ఆరంభించదగినది కాదు– అని పూర్వపక్షాన్ని చేశాడు. కర్మవిషయంలో నిశ్చయబుద్ధి ఏర్పడినప్పటికీ, బ్రహ్మవిషయమైన ఆపాత ప్రతీతి ఉంటే కదా, విచారానికి అవకాశం ఉంటుంది. విశిష్ట హేతువులో విశేషణాంశం ఉన్నప్పటికీ, విశేష్యం లేకపోయినట్లయితే బ్రహ్మ విచారం కర్తవ్యం కాదు. సిద్ధ బ్రహ్మలో శబ్దానికి ఉత్పత్తి లేదు –అనేది పూర్వపక్షి చేసే వాదం.

ఇక్కడ వేద వ్యాసులు "సిద్ధవస్తు బోధకత్వం శబ్దానికి ఉన్నది" అనే సిద్ధాంతాన్ని పలుకుతున్నారు. అందుచేత సిద్ధబ్రహ్మపరమైన పరమైన వేదాంత భాగంలో బ్రహ్మవిషయక ఆపాత ప్రతీతి ఉన్నది. అందులో నిశ్చయ బుద్ధి ఏర్పడాలి–అని రాగంతో విచారంలో ప్రవేశిస్తున్నాడు. అందుచేత బ్రహ్మ విచారం కర్తవ్యం–అని తెలుస్తున్నది. శ్రీవేదవ్యాసులు అభిప్రాయబడిన పూర్వపక్ష సిద్ధాంతాలు ఇవే– అని శ్రీరామానుజులు శ్రీభాష్యంలో తెలియజేశారు. ఈ విషయం శ్రీభాష్యంలో "బ్రహ్మజిజ్ఞాసా, అథ, అతః" అనే సూత్రశబ్దస్వారస్యం ద్వారా స్పష్టమవుతున్నది.

శ్రీ జైమిని వేదభాగాన్ని విచారించి, న్యాయకలాపాలను చూపి, వేదభాగార్థాన్ని నిర్ణయించి, కర్మ మీమాంస అనే సూత్ర గ్రంథాన్ని అనుగ్రహించారు. దానిని మనం సేవించి, " కర్మం అల్పాస్థిరఫలకం" అనే నిర్ణయం పొందడం తగినది అయినా, జైమిని అనుగ్రహించిన సూత్రప్రబంధానికి ముందు ఉన్నవారు కర్మ విషయకాల్పాస్థిరఫలక నిర్ణయాన్ని ఏ విధంగా పొందారు? అనే ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది. దీనికి తగిన పరిహారాన్ని మన పూర్వాచార్యులు తెలియజేశారు. శ్రీ జైమినివంటి ప్రతిభాశాలులు పూర్వం మీమాంసాశాస్త్రం లేకపోయినప్పటికీ, తమ ప్రతిభా విశేషంతో వేదాంతార్థాలను గ్రహించగలిగారు. వారికి వేదం స్వతః ప్రమాణం. అది నిరపేక్ష ప్రమాణం. మీమాంసాదిశాస్త్ర నిరపేక్షంగానే అది సమస్తార్థాలను ప్రకాశింప జేస్తుంది. ఆ విధంగానే, అందరూ ఇప్పుడు మీమాంసాశాస్త్ర నిరపేక్షంగానే వేదార్థాలను నిశ్చయించుకోవచ్చు కదా –అని చెప్పడానికి సాధ్యం కాదు. అందరూ జైమిని వంటివారు కాలేరు కదా. గ్రహించేవారి బుద్ధిలోని మాద్యంచేత వేదార్థాలు విపరీతంగా స్ఫురించవచ్చు. అందుచేత, సంసారుల విషయంలో కరుణ చేత జైమిని మహర్షి, జైమిని అమ్మకు తరువాత జన్మించే వారు కర్మవిషయకమైన నిశ్చయబుద్ధిని పొందడం కోసం సూత్ర ప్రబంధాన్ని అనుగ్రహించారు. "విచారసాగరే సంప్లవమానానాం కర్ణధారాయితం స ఏష క్షమ్యతా మపరాధః "అని శతదూషణిలో దేశికులు పలికిన సూక్తి గమనించి, శ్లాఘించదగినది. "ప్రజ్ఞాపరాధప్రశమన రుచిభిః సూరిభిః సూత్రక్లుప్తైః" అని మీమాంసాపాదుకలో కూడా దేశికులు అనుగ్రహించారు.

కర్మలు అనంతస్థిరపలకాలు –అని పూర్వపక్షం చేసి, కర్మలు అల్పాస్థిరపరకాలు అని కర్మకాండలో ఎక్కడ సిద్ధాంతం చేయబడింది? అని అంటే, ప్రతిసంవత్సరం చాతుర్మాస్య ఆవృత్తి విధింపబడింది. దీనివల్ల తెలుస్తున్నది ఏమి?

అంటే, కర్మల ఆవృత్తి చేత కర్మలకు అక్షయఫలత్వం లేదు అని. కర్మలకు అక్షయపత్వం ఉండి ఉంటే, ఆవృత్తి వ్యర్థం కదా. అందుచేత, క ర్మం అల్పాస్థిరపలకం అనే బుద్ధి కలుగుతున్న ది, పూర్వకాండ విచారం ద్వారా— అని భావం. వీటిని అన్నిటిని మొదటి సూత్రంలో "అథ"అనే శబ్దం ద్వారా వేదవ్యాసులు తెలియజేశారు.

దీనివల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, వేదాంతాలు సిద్ధబ్రహ్మను తెలుపుతున్నందున, సిద్ధబ్రహ్మ విషయకమైన ఆపాత ప్రతీతి కలవాడు, కర్మ అల్పాస్థిరపలకం అనే నిశ్చయబుద్ధిని కలవాడు, బ్రహ్మవిషయక నిర్ణయం పొందడం కోసం బ్రహ్మ విచారం చేయాలి —అనేది తెలుస్తున్న ది. అందుచేత, "అథ" అనే పదానికి "కర్మ విచారానికి తరువాత" అనే అర్థం తెలుస్తున్న ది. కర్మ బ్రహ్మ విచారాలకు పౌర్వాపర్యం ఈ విధంగా చెప్పబడింది.

పూర్వ మీమాంసలో పౌర్వపర్య నిర్ణయప్రమాణాలు శ్రుతి, అర్థ, పాఠ, స్థాన, ముఖ్య, ప్రవృత్తి, క్రమాలు అని ఆరు విధాలుగా చెప్పబడ్డాయి. అవి ఏవి? అంటే,

1) పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠం, తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ, ఏనాక్షరం పురుషో వేద సత్యం తత్త్వలో బ్రహ్మ విద్యామ్" అనే ముండ కోపనిషత్ (1–1–12, 13) వాక్యాలు కర్మ విచారం పూర్వవృత్తం, బ్రహ్మవిచారం ఉత్తర కృత్యం అనే విషయాన్ని తెలుపుతున్నాయి ఇది శ్రౌతక్రమం.

2) సంసారులకు త్రివర్గ ప్రావణ్యం స్వరసం. కనుక, దానిని నిర్ణయించడం కోసం మునుముందుగా కర్మ విచారంలో ప్రవేశిస్తున్నాడు. ఇది కర్మ అల్పాస్థిరఫలం అనే

నిర్ణయాన్ని కలిగిస్తున్నది తరువాత బ్రహ్మ విచారానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది అర్థ క్రమం.

3) "వేద వేదాంతాలు" అనే పాఠం ఉన్నందున, వేదార్థ విచారం ముందు, వేదాంతార్థ విచారం తరువాత అనేది పాఠక్రమం.

4) "ఇషేత్వా" అని ఆరంభించి, "బ్రహ్మణో మహిమాన మిత్యుపనిషత్ "అనే పర్యంతం కదా అధ్యయనం ఉన్నది. ఈ వ్యాఖ్యేయానికి ఈ విధంగా క్రమం ఉన్నది కనుక, ముఖ్యంగా దీని క్రమాన్ని అనుసరించి, దీనికి వ్యాఖ్యానమైన పూర్వోత్తర మీమాంసలకు కూడా ఇదే క్రమం అనుసరించదగినది. వ్యాఖ్యేయశేషం (అంగం) కదా వ్యాఖ్యానం. అందుచేత ముఖ్యక్రమాన్ని చూసినా, కర్మ విచారం పూర్వం, బ్రహ్మ విచారం తరువాత అనేది స్పష్టమవుతుంది. ఇది ముఖ్య క్రమం.

5) ధర్మ ప్రమాణమైన వేదాన్ని అధ్యయనం చేయడంకోసం మునుముందుగా గురుకులానికి వెళుతున్నాడు. అధ్యయనం చేస్తున్నాడు. అక్షర రాశిని గ్రహిస్తున్నాడు. ఈ ప్రవృత్తికి తరువాత బ్రహ్మ విచారానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది ప్రవృత్తిక్రమం.

6) వేదాధ్యయనానికి అనంతర కాలం ధర్మ విచారకాలం. దానికి స్థానం అక్కడే. దానికి తరువాతే బ్రహ్మవిచారానికి స్థానం. ఇది స్థాన క్రమం.

ఈ విధంగా ఆరు విధాలైన క్రమనియామకప్రమాణాలతో పౌర్వాపర్యం సిద్ధిస్తున్నది. కనుక, "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే చోట ఉండే అథ శబ్దానికి కర్మవిచారానంతర్యాన్ని అర్థంగా చెప్పడం చాలా తగినది అని తెలుస్తున్నది.

తత్కాలంలో కర్మ విచారణ చేసే బ్రహ్మవిచారంచేయాలి అని అనుష్ఠానం కనబడలేదు— అని ఒక ఆక్షేపం ఇక్కడ కలుగుతుంది. దీనికి సమాధానాన్ని మన పెద్దలు మూడు విధాలుగా అనుగ్రహించారు.

1)మీమాంసా ప్రకరణ గ్రంథాలలో పూర్వ మీమాంసా గ్రంథాలను ముందు తెలుసుకొని, తరువాత బ్రహ్మ విచారానికి రావచ్చు,

2) లేక, సూక్ష్మ బుద్ధి కలిగిన శిష్యులు ఆచార్యుని వద్దనుండి కర్మకాండార్థాలను సంగ్రహంగా తెలుసుకొని, బ్రహ్మవిచారం చేయవచ్చు,

3) శారీరకార్థం ఉపదేశించే కాలంలోనే ఉపయుక్త పూర్వ మీమాంసాశాస్త్రార్థాలను కూడా చేర్చి, ఉపదేశించడం జరగవచ్చు. వీరు అముఖ్యాధికారులు. మొదట చెప్పబడినవాడే క్రమమే ముఖ్యాధికారి అవుతున్నాడు.

ఏ విధంగా అయినా కర్మ బ్రహ్మ వికారాలకు నియతమైన పౌర్వాపర్యం, పూర్వోత్తర శాస్త్రాలకు ఐక్యం, బ్రహ్మ విచార ఆరంభణీయత్వం అనే అర్థత్రయం అక్షతం అని ఏర్పడుతున్నది. "అర్థైకత్వాత్ ఏకం వాక్యం, సాకాంక్షం చేత్" అని అన్నారు, జైమిని. పూర్వ మీమాంసలో. సాకాంక్షమై, ఏకార్థ ప్రతిపాదకాలు, పూర్వోత్తరకాండలు అని భావం. పూర్వభాగాన్ని సేవించేటప్పుడు, అక్కడ చెప్పబడిన కర్మలకు ఆరాధ్యుడు ఎవరు? అనే ఆకాంక్ష కలుగుతుంది. దానికి సమాధానం ఉత్తరకాండవిచారంతో తొలగుతుంది. అంతేకాక, పూర్వకాండలో చెప్పబడిన కర్మలకు అంగి ఎవరు? అనే సందేహం పూర్వకాండ మాత్ర దర్శనం వల్ల, ఉత్తరకాండలో చెప్పబడిన బ్రహ్మవిద్యకు అందం ఏది? అనే సందేహం ఉత్తరకాండ మాత్రదర్శనం వల్ల కలుగుతుంది. ఈ సందేహాలకు శాంతి కాండద్వయపరామర్శ చేత కలుగుతుంది. అందుచేత ఈ రెండు పరస్పరసాపేక్షాలుగా గ్రహించి ఏకార్థ ప్రతిపాదకాలు అవుతున్నాయి అని

చెప్పబడుతున్నది. కర్మరాధ్యత్వ విశిష్టబ్రహ్మ ప్రతిపాదకం అని కానీ, కర్మాంగత్వ విశిష్టబ్రహ్మ విద్యా ప్రతిపాదకం అని కానీ ఐకార్థ్యం చెప్పవచ్చు. అందుచేత మీమాంసాశాస్త్రం ఒకటే అయినట్లయినది. ఈ విధంగా శారీరక ప్రథమ సూత్రప్రథమపదమైన అథసబ్దానికి కర్మ విచారానంతరం అనే అర్థం– అని అనుగ్రహించారు, మన స్వామి భగవద్రామానుజులు, శ్రీభాష్యంలో.

**24)బ్రహ్మ శబ్దార్థ నిరూపణం**

బ్రహ్మసూత్ర ప్రబంధంలో మొదటి సూత్రం "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనేది. ఈ సూత్రంలో "యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్వతో బ్రహ్మవిద్యామ్" అనే శ్రుతివాక్యంలోని అర్థాన్ని శ్రీవేదవ్యాసులువ్యక్తం చేశారు. క్రమానుసారంగా తనను ఆశ్రయించిన శిష్యునకు ఆచార్యుడు, రూపంలో వ్యత్యాసం, స్వభావంలో వ్యత్యాసం లేని పురుషుని తెలుసుకుంటున్నాడో, ఆ బ్రహ్మవిద్యను ఉపదేశించాలి " అనేది ఈ శ్రుతివాక్యంలోని అర్థం. దీనిని చూసేవారికి బ్రహ్మ శబ్దార్థం పరమ పురుషుడు అనేది వ్యక్తమవుతున్నది. "పురుషః "అనే పదం శ్రీకృష్ణుడైన నారాయణునే తెలుపుతుంది. అందుచేత ఈ మొదటి సూత్రంలో కూర్చబడిన బ్రహ్మ అనే శబ్దం ఈ సూత్రానికి విషయమైన "యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్వతో బ్రహ్మ విద్యామ్"అనే శ్రుతివాక్యంలో ఉండే బ్రహ్మ శబ్దం దేనిని తెలుపుతున్నదో, ఆ అర్థాన్నే తెలుపుతుంది. అందుచేతమొదటి సూత్రంలో ఉండేబ్రహ్మ శబ్దం నారాయణునే తెలుపుతుంది –అని సారార్థంగా తెలుస్తున్నది.

ఈ విధంగా మొదటి సూత్రంలో ఉండే బ్రహ్మ శబ్దం నారాయణునే తెలుపుతున్నందున, నారాయణుని తెలిపే శాస్త్రం బ్రహ్మసూత్రాలు అనే విషయాన్ని తెలియవచ్చు. ఈ విధంగా కర్మ విచారం తరువాత, "ఆ విధంగా కర్మవిచారం చేసేవాడు

నారాయణుని గూర్చి విచారించదగినవాడు" అనేది మొదటి సూత్రంలో ఉండే సంగ్రహమైన అర్థం.

స్వామి భగవద్రామానుజులు శ్రీభాష్యంలో మొదటి సూత్రానికి వాక్యాన్వాయాన్ని తెలియజేసే సందర్భంగా "బ్రహ్మశబ్దం నారాయణుని నిర్దేశిస్తుంది" అనే విషయాన్ని ఈ క్రింది విధంగా తెలియజేశారు.

"బ్రహ్మశబ్దేన చ స్వభావతో నిరస్తనిఖిలదోషః అనవధికాతిశయఅసంఖ్యేయ కళ్యాణ గుణగణః పురుషోత్తమోఽభిధీయతే. సర్వత్ర బృహత్వగుణయోగేన హి బ్రహ్మశబ్దః బృహత్వం చ స్వరూపేణ యత్ర అనవధికాతిశయం సోఽస్య ముఖ్యార్థః. స చ సర్వేశ్వర ఏవ. అతో బ్రహ్మ శబ్దః తత్రైవ ముఖ్యవృత్తమ్, తస్మాదన్యత్ర తద్గుణలేశయోగాత్ ఔపచారికః. అనేకార్థకల్పనాయోగాత్ భగవచ్ఛబ్దవత్. తాపత్రయాతురైః అమృతత్వాయ స ఏవ జిజ్ఞాస్యః అతః సర్వేశ్వర ఏవ జిజ్ఞాసాకర్మ భూతం బ్రహ్మ".

ఈ వాక్యాలలోని తాత్పర్యాన్ని ఇక మనం కొంత వివరంగా గమనిద్దాం.

బ్రహ్మ శబ్దం సత్వం రజస్సు సమస్సు అనే మూడు గుణాలు కలిగిన ప్రకృతి అనే అచిత్తులు జీవుని కూడాతెలుపుతుంది అనే విషయం "యః సర్వజ్ఞః సర్వవిత్, యస్య జ్ఞానమయం తపః, తస్మాదేతత్ బ్రహ్మ నామరూపమ్ అన్నం చ జాయతే" అనే శ్రుతివాక్యం వల్ల, "స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి" అనే గీతా వచనం వల్ల తెలుస్తున్నది. పైన తెలిపిన శ్రుతి అన్నిటిని చక్కగాతెలిసినవాడైన పరమ పురుషుని వద్ద నుండిప్రకృతి అనే అచిత్తు, దానినుండి నామరూపాలను కల ఈ ప్రపంచం పుడుతున్నది–< అని తెలుపుతున్నది. ఈ శ్రుతి వాక్యంలో ఉండే బ్రహ్మశబ్దం ప్రకృతి అనే అచిత్తును నిర్దేశిస్తున్నది. ఆ విధంగానే, పైన ప్రస్తావించిన గీతావచనం బాల్య

యవ్వన పరువాలలో పరమ పురుషునితో కొంచెం కూడా సంబంధం లేకుండా, కేవలం లౌకిక విషయాలలోనే కాలక్షేపం చేసేవాడై ఉన్నప్పటికీ, తరువాతి కాలంలో భగవంతుని విషయంలోసంబంధం కలవాడై, తనకు తగిన ధర్మాలను ఆ పరమ పురుషుని ముఖ వికాసానికి తగినట్టుగా చేసేవాడైతే, అతడు పరిశుద్ధుడైన తనను పొందుతున్నాడు అనే అర్థాన్ని కలిగినది. ఈ వచనంలో ఉండే బ్రహ్మ శబ్దం జీవుని సూచిస్తుంది.

కొందరు బ్రహ్మ శబ్దంనిర్గుణ బ్రహ్మను తెలుపుతుందని, ఇంకా కొందరు శివుని నిర్దేశిస్తుందని అంటారు, ఈ విధంగా బ్రహ్మ శబ్దానికి ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థాన్ని చెప్పినందున, వేరు వేరు చోట్ల వేరు వేరు అర్థాలను ఈ పదం తెలుపుతున్నందున, ఈ పదానికి కల వాస్తవమైన అర్థం ఏది? అనే విషయాన్ని తెలుపడం కోసం భగవద్రామానుజులు "బ్రహ్మశబ్దేన పురుషోత్తమోఽభిధీయతే" అని మొదటిలోనే అనుగ్రహించారు.

"పురుషోత్తమః" అనే పదం రూఢిశక్తితోను, యోగశక్తితోను నారాయణుని తెలుపుతుంది. ఏ విధంగా అయితే ఘటః అనే పదం వినబడగానే ఒక నిర్దిష్టమైన రూపాన్ని కలిగిన వస్తువు యొక్క జ్ఞానం కలుగుతున్నదో, ఆ విధంగానే, "పురుషోత్తమః" అనే పదం వినపడగానే నారాయణుని గూర్చిన జ్ఞానం కలుగుతున్నందున, ఈ పురుషోత్తమ శబ్దం నారాయణుడు అనే అర్థంలో రూఢి శక్తిని కలిగినది అని తెలియాలి. "పాచకః" అనే పదంలోని ధాతువు, ప్రత్యయం– అనే వీటి అర్థాలను నిశ్చయించి, విచారించి తెలుసుకున్న తరువాత, దానిని వంట చేసేవాడు అనే అర్థాన్ని ఇచ్చే పదంగా నిశ్చయించుకున్నట్లే, "పురుషోత్తమః" అనే పదంలోని "పురుషః, ఉత్తమః" అనే రెండు పదాల అర్థాలను, వాటిపై వచ్చి లోపించిన ప్రథమావిభక్తి అర్థాన్ని విచారించి తెలుసుకున్న తరువాత, దాని అర్థంగా బద్ధుడు, ముక్తుడు అనే రెండు విధాలైన జీవాత్మ వర్గాలలోను వ్యాపించి, వారిలో నిలచి ఉండి, నియమించే

స్వామియై ఉన్నందున, ఈ జీవాత్మల కంటే భిన్నుడు అనే వాస్తవాన్ని గ్రహిస్తున్నాము. అందువల్ల పురుషోత్తమ శబ్దం పైన తెలిపిన అర్థంలో, అంటే, నారాయణుడు అనే అర్థంలో యోగశక్తిని కలిగినది అనే విషయాన్ని మనం గ్రహిస్తున్నాము.

ఈ యోగ శక్తి వల్ల తెలిసిన సారమైన అర్థం ఏమంటే– భగవంతుడైన శ్రీమన్నారాయణుడు స్వేతర సమస్త వస్తువిలక్షణుడు, అంటే, తనకంటే వేరైన చేతనా చేతన వస్తువులు అన్నిటికంటే విలక్షణమైనవాడు అనేది. తనకంటే వేరైన అన్ని వస్తువుల కంటే విలక్షంగా ఉండడం అనేది చాలా అల్పమై ఉండే గడ్డి మొదలైన ఒక్కొక్క వస్తువుకు ఉండే ఒక స్వభావం. గడ్డి స్వభావం గడ్డికే ఉండే ఒక స్వభావం అవుతున్నది. ఆ స్వభావంతో ఆ తృణందాని కంటే వేరైన మిగిలిన వస్తువుల కంటే అందంగా ఉండడాన్ని మనం తెలిసికొంటున్నాము.

ఈ విధంగానే హేయప్రత్యనీకకత్వ విశిష్టకల్యాణగుణైకతానత్వం భగవంతునికి ఉండే ఒక విలక్షణమైన స్వభావం. ఆ స్వభావంతో అతనినేకంటే వేరైనా అన్ని వస్తువుల కంటే అతడు భిన్నుడు అని మనం తెలియవచ్చు. సహజంగానే, పరమ పురుషుడు ఏ దోషం లేనివాడు. అంతేకాదు, తనను ఆశ్రయించినవారి దోషాలను అన్నిటిని పోగొట్టేవాడు. ఇదే భగవంతునకు కల హేయప్రత్యనీకత్వం అవుతున్నది. సహజంగానే గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి వంటి లెక్కలేనన్ని కళ్యాణ గుణాల సమూహానికి సముద్రమై ఉండేవాడు. ఇదే భగవంతుని కల్యాణ గుణైయకతానత్వం అనబడుతుంది. ఈ విధంగా ఉండే స్వభావం భగవంతునకు ఒక్కనికి మాత్రమే ఉండే ఒక స్వభావం. ఈ స్వభావంతో భగవంతుడు అన్ని వస్తువులలో కంటే విలక్షనణుడై ఉండేవాడు అవుతున్నాడు. ఈ వాస్తవాన్నిమన స్వామి భగవద్రామానుజులు "స్వభావతః నిరస్తనిఖిలదోషైః అనవధికాతిశయాసంఖ్యేయకళ్యాణ గుణగణః "అని అనుగ్రహించారు.

**బ్రహ్మ శబ్దం –శబ్ద సామర్థ్యం**

బ్రహ్మ శబ్దం శబ్దసామర్థ్యంతో నారాయణుని ముఖ్యార్థంగా కలిగినది– అనే విషయాన్ని గూర్చి కొంచెం విజ్ఞాపన చేస్తాను. బ్రహ్మ శబ్దంలోని ధాతువు, ప్రత్యయం అనే వీటి అర్థాలను పరిశీలించి చూచినప్పుడు, గొప్పతనాన్ని కలిగినది అనే అర్థంవస్తుంది.

నైయాయికులు యథార్థమైన వస్తువులలో చాలా చిన్నది పరమాణువు అని, రెండు పరమాణువులు చేరితే అది ద్వ్యణుకం అని, ఒకటిగా కలసిన మూడు ద్వ్యణుకాలు త్రసరేణువు అని అంటారు. ఈ త్రసరేణువు కంటికి కనిపించే వస్తువులలో చాలా చిన్నది అయినా, ద్వ్యణుకం కంటే పెద్దది. ఈ విధంగా ఇది ఒక విధంగా గొప్పతనాన్ని కలిగినదే. అయినా త్రసరేణువు అనే అర్థంలో బ్రహ్మ శబ్దం చెప్పబడడం లేదు.

బ్రహ్మ శబ్దం యోగశక్తి ద్వారా గొప్పతనాన్ని కలిగిన ప్రకృతిని చెప్పేదిగా ఉన్నట్లయితే, ఆ శక్తి చేతనే పైన తెలిపిన త్రసరేణువును కూడా చెప్పవచ్చు. అయితే త్రసరేణులో బ్రహ్మ శబ్దం ప్రయోగింపబడడం లేదు. ఇందు చేత, పెద్దతనాన్ని కల వస్తువులు అన్నిటిని (బృహత్, మహత్ అనే పదాలు చెప్పినట్లుగా), బ్రహ్మ శబ్దం చెప్పదు అనే విషయాన్ని తెలియవచ్చు. బ్రహ్మ శబ్దం నారాయణుని ముఖ్యంగానూ, ప్రకృతి, జీవుడుఅనే వీటిని అముఖ్యంగానూ తెలుపుతుంది అనే సంగతిని ఇక తెలియజేస్తాను.

1)ఎవడు ఇతరులు తెలియలేనట్లుగా అంతటా వ్యాపించి ఉన్నాడో అతని విషయంలో ఒక గొప్పతనం ఉన్నది. ఈ గొప్పతనాన్ని స్వరూప బృహత్త్వం అంటారు.

2)ఎవని ఏ గుణం అంతటా సంబంధాన్ని కలిగి ఉన్నదో, అతని ఆ గుణానికి ఉండే గొప్పతనాన్ని గుణ బృహత్త్వం అని అంటారు.

3)తన సంకల్పంతో ఎవడు అన్ని వస్తువులను, అంటే, ప్రకృతి, జీవుడు అనే వీటిని గొప్పతనం కలిగినవానినిగా చేస్తున్నాడో, అతనికి కల ఆ గొప్పతనాన్ని బృంహణత్వం అని అంటారు.

1) "నారాయణః "అనేపదానికి "నారాః అయన యస్య సః నారాయ ణః" అనే విగ్రహ వాక్యాన్ని చెబుతారు. ఈ సమాసంలో ఉండే నారాః అనే పదం (శరీరాన్ని), చేతనాచేతన వస్తువులు అయిన ఈ ప్రపంచాన్ని, "అయన" పదం ఆత్మను (ఈ ప్రపంచానికి తనకు ఆశయంగా కలిగిన వస్తువును) తెలియజేస్తుంది. ఈ విధంగా చేతనా చేతన వస్తువులు అన్నిటిలోనూ వ్యాపించి ఉండేవాడైన భగవంతుడైన నారాయణుడు పదవాచ్యుడు అని తెలుస్తుంది. దీని చేత బ్రహ్మ శబ్దానికి అర్థమైన మొదటి గొప్పతనం నారాయణునకే ఉన్నది అనేది చక్కగా ప్రకాశిస్తున్నది.

2) బ్రహ్మం అనేది– గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి మొదలైన లెక్కలేనన్ని కల్యాణ గుణాలను కలిగినది. ఏ విధంగా ఆ బ్రహ్మం అంతటా వ్యాపించి ఉన్నదో, ఆ విధంగానే ఆ బ్రహ్మం యొక్క గుణాలు అయిన గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి మొదలైనవి కూడా అంతటా వ్యాపించి ఉన్నాయి. అందుచేత ముందు తెలిపిన రెండవ గొప్పతనం, అంటే, గుణ బృహత్వం నారాయణునకు మాత్రమే ఉండే ఒక గొప్పతనం అవుతున్నది. ఈ విషయంలో "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః " "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్", " యః సర్వజ్ఞః సర్వవిత్" అని మొదలైన శ్రుతి వాక్యాలు ప్రమాణాలు అవుతున్నాయి. ఈ ప్రమాణ వాక్యాలను జాగ్రత్తగా, నిశితంగా, లోతుగా పరిశీలించి చూస్తే, నారాయణుడు– బ్రహ్మ, శివుడు మొదలైన వారివలె కాకుండా, జన్మ, మరణం

మొదలైనవి లేకుండా ఉండేవాడు, బ్రహ్మ, శివుడు మొదలైనవారిని సృష్టించి, వారికి జ్ఞానాన్ని ఇచ్చేవాడు అని, దీనికి తగిన గొప్ప జ్ఞానాన్ని, గొప్ప శక్తిని కలవాడు అని ప్రకాశిస్తున్నది.

ఈ సందర్భంగా "అందమిల్లాద అంబగవన్ " అనే ఆళ్వారుల శ్రీసూక్తిని వివరిస్తూ పలికే "ఎల్లారుక్కుమ్ ఉత్పత్తి వినాశంగళాలే ఇఱే జ్ఞాన సంకోచమ్ పిఱప్పదు. ఇవనుక్కు అవై ఇల్లామైయాలే అకర్మవశ్యన్ ఎన్గిఱదు" (అందరికీఉత్పత్తి వినాశాల వల్ల కదా జ్ఞాన సంకోచం కలుగుతుంది. భగవంతుడైన నారాయణునకు ఇవి లేనందు వల్ల ఇతడు కర్మలకు వశుడు కాడు అని తెలుపబడుతున్నది)అనే ఈడు వ్యాఖ్యాన శ్రీసూక్తి అనుభవించదగినది.

3) ప్రకృతి లెక్కలేనన్ని బ్రహ్మాండాలుగా, ఆ, అండాల లోపల దేవ శరీరం, మానవ శరీరం మొదలైన వస్తువులుగాను పరిణామాన్ని పొందుతున్నది. ఈ విధంగా పలు వస్తువులుగా పరిణామం చెందే ప్రకృతికి కల గొప్పతనాన్ని ఒక విధంగా చూస్తున్నాము. జీవుడు అణువై ఉన్నప్పటికీ, మోక్షాన్ని పొందినప్పుడు భగవంతుని వలే జ్ఞాన బృహత్వాన్ని పొందినవాడవుతున్నాడు. ఇది జీవునకు ఉండే బృహత్వం.

ఈ విధంగా ప్రకృతి, జీవుడుఅనే ఈ రెండు వస్తువులకు ఈ రెండు విధాలైన గొప్పతనాలను తన సంకల్పంతోనే కలిగిస్తున్నాడు కనుక నారాయణునకే ఇంతకు ముందు చెప్పబడిన మూడవ గొప్పతనం, అంటే, బృంహణత్వం ఉన్నదని మనం తెలిసి కోవాలి.

"తస్మాద్విరాడజాయత, విరాజో అధిపూరుషః " అనేది పురుష సూక్త వాక్యం. "అనిరుద్ధ నారాయణునుండి బంగారు మయమైన అండం పుట్టింది. అందులో నేను ముందుగా పుట్టాను" అనే అర్థాన్ని కలిగినది. ఈ అర్థాన్ని జాగ్రత్తగా గమనిస్తే,

నారాయణుడే ఈ అండాలను, అండాధిపతులను, బ్రహ్మలను కూడా సృష్టించి, వీటి ద్వారా ప్రకృతిని గొప్పతనం కలిగినదానినిగా చేస్తున్నాడు అని స్పష్టమవుతున్నది. "యథా పశ్యః పశ్యతేః రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్, తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" అనే ముండకోపనిషత్ వాక్యం "తన గొప్పతనానికి తగినట్లుగా అప్రాకృత దివ్య మంగళరూపాన్ని కలిగిన వాడు, ఈ ప్రపంచాన్ని సృష్టించేవాడు, నియమించేవాడు, గొప్పతనాన్ని కలవాడు, ఉపాదాన కారణమై ఉండేవాడైన నారాయణుని. ఎవడు అన్ని కాలాలలో ప్రత్యక్షంగా దర్శిస్తున్నాడో, ఆ కాలంలో అతడు పుణ్య పాపాలు అనే రెండు విధాలైన కర్మలను లేనివాడై, ఆ పరమ పురుషునితో సామ్యాన్ని పొందుతున్నాడు– అనే అర్థాన్ని ఇస్తున్నది. ఈ అర్థాన్ని చూచేవారికి పురుష శబ్దార్థమైన నారాయణుని చేతనే మోక్షఫలం పొందేటప్పుడు జీవునకు జ్ఞాన బృహత్వం కలుగుతున్నది అనే వాస్తవం తెలుస్తుంది.

ఇంతవరకు చెప్పిన దానిని బట్టి నారాయణుడు స్వరూప బృహత్వం, గుణబృహత్వం, బృంహణత్వం– అనే మూడు విధాలైన గొప్పతనాలను కలిగి ఉన్నాడు, అతడు బ్రహ్మ శబ్దానికి ముఖ్యమైన అర్థం అనే వాస్తవం, ప్రకృతి, జీవుడు క్రమంగా స్థూలస్థితిని (నామరూపాలతోకూడి ఉండే స్థితిని), జ్ఞానబృహత్వాన్ని పొందినవాడైనా నారాయణునివలె మూడు విధాలైన గొప్పతనాలను పొందనందున, బ్రహ్మ శబ్దానికి అముఖ్యమైన అర్థమై ఉన్నాడు– అనే వాస్తవాన్ని గ్రహించినవారం అయినాము.

దోషం కొంచెం కూడా లేనివాడు, జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరు గుణాలను కలవాడు అయిన పరమ పురుషుని ముఖ్యంగా తెలుపే "భగవాన్" అనే పదం మిగిలిన వస్తువులలో ముఖ్యంగా ప్రయోగింపబడుతున్నది అని శ్రీ పరాశర మహర్షి

అనుగ్రహించారు. భగవాన్ అనే శబ్దం వలె, బ్రహ్మ అనే శబ్దం కూడా, పైన తెలిపిన మూడు గొప్పతనాలను కల పరమ పురుషుని విషయంలో ముఖ్యంగాను, మిగిలిన వస్తువులలో ఆముఖ్యంగాను వ్యవహరింపబడుతున్నది.

మన స్వామి భగవద్రామానుజులు ఈ విధంగా శబ్దసామర్థ్యంవల్ల బ్రహ్మ శబ్దార్థం నారాయణుడే అనే విషయాన్ని చక్కగా నిరూపించారు.

## బ్రహ్మ శబ్దం –అర్థసామర్థ్యం

బ్రహ్మ శబ్దం హరి శబ్దం వలె అనేక అర్థాలను ఇస్తుంది. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే శారీరక మీమాంసలోని ఈ మొదటి సూత్రంలో ఉండే బ్రహ్మ శబ్దం నారాయణుని సూచిస్తుంది అనే విషయాన్ని గ్రహించాలి. పుణ్యం, పాపం అనే కర్మల మూలంగా ఆయా శరీరాలలో జన్మించి, సుఖదుఃఖాలను కలసిన అనుభవాన్ని అనుభవించే జీవాత్మలు సంసారి జీవులు అనబడుతున్నారు. ఈ సంసారి జీవులు శరీరంతో ఈ లోకంలో ఉండేటప్పుడు, ఎన్నో దుఃఖాలను అనుభవించడం మనం గమనిస్తున్నాము. శరీరాన్ని, మనస్సును ఆశ్రయించి వచ్చే దుఃఖాలు పులి, సింహం మొదలైన దుష్ట జంతువుల కారణంగా వచ్చే దుఃఖాలు. వర్షాలు, పిడుగులు మొదలైన వాని వల్ల వచ్చే దుఃఖాలు అని ఈ విధంగా పలు రకాలుగా దుఃఖాలు కలగడం మనకు అనుభవ సిద్ధమే. ఈ విధంగా పలు విధాలయిన దుఃఖాలు పూర్తిగా తొలగిపోయి, మహానందాన్ని పొందడానికి సంసారి జీవులు లక్ష్మీనాథుడైన నారాయణుని ఆశ్రయించి సేవించాలి. తరించడానికి ఇంకొక మార్గం లేదు.

ఈ వాస్తవాన్ని "తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే" అనే వేదవాక్యం స్పష్టంగాతెలియజేస్తున్నది. "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్" అనే వచనాన్ని ఇక్కడ స్మరించడం తగినది. ఈ విధమైన అర్థసామర్థ్యం వల్ల ఏర్పడే

అర్థాన్నితాయ" తాపత్రయాతురైః అమృతత్వాయ స ఏవ జిజ్ఞాస్యః" అనే వాక్యం ద్వారా భగవద్రామానుజులు అనుగ్రహించారు.

## 25)బ్రహ్మ శబ్దార్థ నిరూపణం–2

తత్వ హిత పురుషార్థాలను నిర్ణయించే అర్థ విశేషాలను మన స్వామి భగవద్రామానుజులుఏ విధంగా తమ శ్రీ భాష్యం మొదలైన గ్రంథాలలో తెలియజేశారు అని పలు శీర్షికలలో మనం ఇంతవరకు అనుభవిస్తూ వస్తున్నాము. ఇటువంటి పరమార్థాలలో ఇప్పుడు చాలా ముఖ్యంగా తెలియవలసిన అర్థం ఒకటి ఉన్నది. బ్రహ్మ శబ్దార్థ నిరూపణమే అది. ఇక్కడ చెప్పబడ వలసిన విషయాలు పలు పలు ఉన్నాయి. వీటిని సుస్పష్టంగా మనసులో పొందికగా పెట్టుకోవలసిన అవసరం చాలా ఉన్నది. బ్రహ్మ శబ్దాన్ని వివరించడం ఆరంభించిన మన స్వామి భగవద్రామానుజులుఏ విధంగా ఏ ఏ సూక్తులను అనుగ్రహించారు, వారు అభిప్రాయపడిన ఆ అర్థవిశేషాలను ఏ విధంగా మన పూర్వాచార్యులు వివరించారు అని మనం జాగ్రత్తగా గమనించాలి. ఈ బ్రహ్మ శబ్దం శాస్త్రాలలో ఏ విధంగా వివరింపబడింది అనే విషయాన్ని కూడా జాగ్రత్తగా గమనించాలి. దివ్య సూరులు అనబడే అళ్వారులు తమ దివ్య సూక్తుల మూలంగా బ్రహ్మశబ్దవాచ్యుని ఏ విధంగా అనుభవించి పలికారు అని కూడాచూడాలి. శ్రీరామానుజులు తాము చేసిన నిరూపణలకు ఏ ప్రమాణ వచనాలను ఆధారంగా వారు చూపించారు ఆధారంగా చూపించారు అని కూడా గమనించాలి. మనం ఈ అర్థవిశేషాలను జాగ్రత్తగా మనసులో పెట్టుకొని, వీటిని నిత్యం చింతన చేయాలి. విస్తృతికి భయపడకుండా మనచే అనుభవింపబడవలసిన విషయాలు ఇవి. అందుచేత, విస్తర భయం లేకుండా వీటిని మనం వివరంగానే అనుభవించడం ప్రాప్తం(తగినది).

బ్రహ్మ శబ్దానికి అర్థం ఏది? అని అంటే, "బృహతి బృంహయతి తస్మాత్ పరం బ్రహ్మ "అని వేదం, " బృహత్వాత్ బృంహణత్వాచ్చ తద్బ్రహ్మేత్యుపగీయతే" అని స్మృతి (శ్రీవిష్ణుపురాణం) తెలుపుతున్నవి. బ్రహ్మశబ్ద నిర్వచనాన్ని అవి ఈ విధంగా చేశాయి. ఈ వచనాలను ఆధారంగా చేసికొని బ్రహ్మ శబ్దానికి అర్థాన్ని మూడు విధాలుగా మన పెద్దలు అనుగ్రహిస్తున్నారు. దానిని కొంచెం వివరిస్తాను.

పైన తెలిపిన ప్రమాణాల ప్రకారం బ్రహ్మకు 1) స్వరూపంతో గొప్పతనం స్వరూప బృహత్త్వం చెప్పాలి. 2) గుణాలతో గొప్పతనం గుణబృహత్వం చెప్పాలి, 3) బృంహణత్వం చేత, అంటే, తనను ఆశ్రయించినవాడైన జీవాత్మ కూడా పెద్దవాడుగా అయ్యేటట్లు చేయగలిగిన మహిమను కలిగి ఉండే స్వభావం చేత గొప్పతనాన్ని కలిగి ఉన్నది అని చెప్పాలి.

వీటిలో, 1) స్వరూప బృహత్వం అంటే–భగవంతుని ఆత్మ స్వరూపం తన కంటే వేరైన అన్ని పదార్థాలలోనూ పూర్ణంగా వ్యాపించి ఉండే స్థితి. 2) గుణ బృహత్వం అంటే– మూడు కాలాలలోనూ ఉండే సకల పదార్థాలను తెలియడం. భగవానునకు ఉండే ఈ గుణ బృహత్వాన్ని (జ్ఞానానికి కల సర్వ విషయకత్వాన్ని) మన పూర్వాచార్యులలో ఒకరైన శ్రీనాథములు " యోవేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేన సదా స్వతః" అని తెలియజేశారు. 3) బృంహణత్వం అంటే– నామరూపాలను కోల్పోయి, ఒక వస్తువు అని చెప్పేట్లుగా సూక్ష్మంగా ఉండే ప్రకృతికి మహత్, అహంకారం మొదలైన స్థూలమైన అవస్థలను కలిగించే భగవంతుని సంకల్ప విశేషం. భగవంతుని నిగ్రహరూపమైన, తన కర్మ చేత ఏర్పడిన జ్ఞాన సంకోచాన్ని కల జీవుడు భగవంతుని కృప చేత ఒక కాల విశేషంలో భక్తి ప్రపత్తులలో ఒక ఉపాయాన్ని ఆచరించినప్పుడు, ఇతని జ్ఞాన సంకోచం తొలగిపోయి, జ్ఞాన బృహత్వం కలిగేటట్లు చేసే భగవంతుని సంకల్ప విశేషం.

ఈ విధంగా బ్రహ్మ శబ్దం చేత చెప్పబడే విషయాలు మూడు. బ్రహ్మం అనే శబ్దం స్వరూపంతో ఎవరికిబృహత్వం ఉన్నదో అతనిని తెలియజేస్తుంది. బ్రహ్మ శబ్దం గుణాలతో బృహత్వం ఎవరికి ఉన్నదో అతనిని తెలియజేస్తుంది. స్వరూపంతో వ్యాపకుడై ఉన్నందుచేత స్వరూపేణ బృహత్వం. బ్రహ్మ శబ్దం అంతు లేని కళ్యాణ గుణాలు ఎవరికి ఉన్నవో అతనిని తెలియజేస్తుంది. ఇదే గుణతః బృహత్వం. ఈ విషయాన్ని శ్రుత ప్రకాశికాచార్య స్వామివారు "నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ మవ్యయః" అనే సూక్తి ద్వారా తెలియజేశారు.

భగవంతునకు అనంతుడనే నామం ఒకటి ఉన్నది. అతని కళ్యాణ గుణాలకు అంతు లేదు. "కూఱుదల్ ఒన్డారా కుడక్కూత్త అమ్మానై" అని అంటూన మ్మాళ్వార్లు కూడా అన్నారు. "భగవంతుని గుణయోగాన్ని గూర్చి పలికి పూర్తి చేయడం" అనేది వేదాంతాలకు కూడా సాధ్యం కాని పని అని, "యతో వాచో నివర్తంతే" అని ఉపనిషత్తు ప్రయత్నం చేసి నిర్ణయించింది. అయితే, ఈ ఉపనిషత్ వాక్యంవలె భగవంతుని పరత్వ గుణ యోగాన్ని గూర్చి పూర్తిగా పలికి, పూర్తి చేయడం వీలు కాదు అని చెప్పడం కాకుండా, శ్రీకృష్ణావతారంలో భగవంతుడు కుంభ నృత్యాన్ని చేశాడే, ఆలీలా విశేషాన్ని ఒక్కటిని కూడా ఎన్ని వేల వేల సంవత్సరాలు పలికినప్పటికీ పూర్తిగా ఫలుకడం సాధ్యం కాదు –అని అన్నారు, నమ్మాళ్వారులు.

ఈ విషయం మహాభారతంలో స్పష్టంగా చూపబడింది. "వర్షాయుతైః యస్య గుణా న శక్యా వక్తుం సమేతైరపి సర్వలోకైః, మహాత్మనః శంఖ చక్రాసిపాణేః విష్ణోః జిష్ణోః వసుదేవాత్మజస్య" కానీ కర్ణపర్వంశ్లోకం ఈ విషయాన్ని తెలియజేస్తున్నది. పంచాయుధాలను ధరించినవాడైన, జయశీలుడైన, వసుదేవ కుమారుడైన, అంతటా వ్యాపించి ఉండేవాడైన శ్రీకృష్ణుని కల్యాణ గుణవిశేషాలను, గుణ చేష్టితాలను అతనిచే సృష్టింపబడిన అన్ని లోకాలు కలసి వేలాది సంవత్సరాలు, అంటే, కాలం అంతా

చెప్పినప్పటికీ, చెప్పి ముగించడం సాధ్యం కాదు –అనే అర్థాన్ని ఇచ్చే ఈ శ్లోకాన్ని ఉదాహరించి, వాక్కుకు అందని వైభవం కృష్ణునకు ఉన్నది– అ నే పైన ప్రస్తావించిన నమ్మాళ్వారుల అభిప్రాయాన్ని నంబిళ్ళై వివరించి చూపించారు.

శ్రీ శ్రుతప్రకాశికాచార్య స్వామివారు వేడుకగా అయినా, యథార్థమైన ఒక విషయాన్ని అనుగ్రహించారు. అది ఏమంటే, మనం మన గుణాలను కీర్తించుకోవడం సాధ్యం కాదు. భగవంతుని గుణాలను కూడా కీర్తించడం సాధ్యం కాదు. మన గుణాలను మనం కీర్తించడం ఎందుకు సాధ్యం కాదు అని అంటే, మనకు గుణాలే లేవు కదా. భగవంతుని గుణాలనుఎందుకు కీర్తించలేము అని అంటే, ఆ స్వామి గుణాలు అనంతాలు కనుక. వాటికి అంతు లేదు, వాటిని కీర్తించి ముగించడం సాధ్యం కాదు. అందుచేత భగవంతుని కల్యాణ గుణాలు అపారంగా ఉన్న కారణంచేత, అతనికి గుణాలవల్ల బృహత్త్వం సిద్ధించింది.

ఇంత మాత్రమే కాదు, అతనిని ఆశ్రయించినవాడు అల్పుడైన, అణుస్వరూపుడైన, జీవాత్మ. ఇతని భగవంతుడు ఏమి చేస్తున్నాడు? అని అంటే, భక్తి మార్గం కానీ, ప్రపత్తి మార్గం కానీ, శరణాగతి మార్గం కానీ, దేనిని ఆచరించినా ఆనంత్యాన్ని పొందుతున్నాడు, అంటే, జీవాత్మ గొప్పవాడు అవుతున్నాడు. ఆ విధంగా అంటే ఏమి అర్థం? మన సంప్రదాయ ప్రకారం జీవాత్మ ఇక్కడ ఉన్నప్పటికీ, పరమపదంలో ఉన్నప్పటికీ, అణుస్వరూపుడే. అణుమాత్ర స్వరూపుడైన జీవాత్మకు అణుత్వానికి విరుద్ధమైన బృహత్త్వం ఈనాడు కొత్తగా కలుగదు. ఆ విధంగా అయితే, బృంహణత్వం అనే పదానికి ఏమి అర్థం? అని అంటే, అన్ని విధాలైన దోషాలను పోగొట్టి, పరిమితి లేని ఆనందాన్ని ఈ సంసారి జీవాత్మకు, అతనిని ముక్త జీవుని చేసి, అనుగ్రహించడమే బృంహణత్వం, "స చానంత్యాయ కల్పతే" అని వేదాంతవాక్యందీనిని తెలుపుతున్నది. అందుచేత సకల సంకోచవివృత్తిపూర్వక నిరవధికజ్ఞానవికాస

రూపానందాన్ని ఇవ్వడమే బృంహణత్వం అని విషయాన్ని శ్రుతి సిద్ధమైన అర్థాన్ని తెలియజేశారు, మన పెద్దలు. దీనివల్ల ఏమి సిద్ధిస్తుంది? అని అంటే, ఈ సంసారి జీవాత్మ కు కర్మాధీనమైన జ్ఞానసంకోచం ఉన్నది. భగవంతుని అనుగ్రహంచేత ఇతనికి ధర్మభూత జ్ఞాన వికాసం ఏర్పడుతుంది. జ్ఞానవికాసమైన ఈఆనందాన్ని చాలా చిన్నవాడైన జీవాత్మకు భగవంతుడు సంకల్పించాడు. ఈ విధంగా ధర్మభూత జ్ఞానవికాసమైన ఆనందాన్ని సంకల్పించే భగవానునకే బృంహణత్వాత్ బృహత్వం ఉన్నది.

అందుచేత, బ్రహ్మ శబ్దంచేత స్వరూపంతో బృహత్వం పొందినవాడైన, గుణాలతో బృహత్త్వం పొందినవాడైన, చాలా చిన్న వానిని కూడా పెద్దవాడు అయ్యేటట్లు చేయగలిగిన సామర్థ్యాన్ని కలవాడైన పరమాత్మ చెప్పబడుతున్నాడు అని స్పష్టపడినది.

## 26)బ్రహ్మసగుణత్వనిరూపణం

ఈ విధంగా పూర్వం తెలిపిన మూడు బ్రహ్మ శబ్దానికి అర్థాలుగా వేదాంతలాలో చెప్పబడినందున స్వరూప బృహత్వాదిగుణ విశేష విశిష్టంగా బ్రహ్మం తోస్తుందే తప్ప, శుద్ధంగా స్ఫురించదు. పైన తెలిపిన విశిష్ట వస్తు ప్రతిపాదక బ్రహ్మ శబ్దాన్ని మొదటి సూత్రంలో కూర్చిన వ్యాసుల అభిప్రాయం ఇదే. ఈ విధంగానే వ్యాసమహర్షి అనుగ్రహించిన అన్ని సూత్రాలను ఒక్కొక్క సూత్రంగా చూసినా, బ్రహ్మం సగుణం గానే తోస్తుందే తప్ప, అద్వైతులు చెప్పినట్లుగా నిర్గుణంగా తోచదు. అయినా, ఇక్కడ కొన్ని అధికరణాలను మాత్రం ప్రస్తావించి విచారించి, బ్రహ్మ సగుణత్వం మన పెద్దలు చూపిన దారిలో నిరూపింపబడుతున్నది.

మూడవ అధ్యాయంలో వచ్చే విషయం ఇది. అయినప్పటికీ, ఈ విషయాన్ని గూర్చి కొంచెం విజ్ఞాపన చేస్తా అది ఏమంటే మూడవ అధ్యాయంలో మూడవ పాదం గుణోపసంగుణపసంహార పాదం అనబడుతుంది. భూమ విద్య, దహర విద్య, శాండిల్య విద్య వంటి వేదాంత విద్యలలో భగవంతుని అపరిమితమైన కళ్యాణ గ గుణాల నుండి ఏ ఏ గుణాలు గ్రహించాలి –అనే విచారంలో ప్రవేశిస్తున్నట్లుగా ఈ పాదం ఏర్పడి ఉన్నది. దేశికులు ఇది గుణోపసంహార పాదమా? లేక, గుణ సంహార పాదమా? అని అద్వైతులను చూచి ప్రశ్నిస్తున్నారు.

ఇంకా, ఒక విచారంఈ పాదంలో ప్రస్తావింపబడుతున్నది. అది ఏమంటే, వేదాంతాలలో ఒక విద్యయే పలు చోట్ల చెప్పబడడం మనం చూడవచ్చు. తైత్తిరీయ ఉపనిషత్తులో దహరవిద్య ఉన్నది. చాందోగ్యంలోను ఈ విద్య ఉన్నది. ఇవి రెండు ఒకటేనా? లేక, వేరు వేరా? అని గమనించాలి. వైశ్వానరవిద్య వేదాంతంలో పలుకోట్ల ప్రసాదింపబడింది. ఇవి అన్ని ఒకటే విద్యా? వేరు వేరు విద్యలా? అనే విచారం ఏర్పడుతున్నది. అందుచేత విద్యాభేదం పలుచోట్ల ఉన్నప్పటికీ, నఈ విద్యలకు భేదాన్ని చెప్పవచ్చునా? లేక, అభేదాన్ని చెప్పాలా? అనే విచారం ఈ గుణోపాసంహార పాదంలో చేయబడుతున్నది.

ఈ విచారణ ద్వారా ఏమి ప్రయోజనం? అనే ప్రశ్న ఇక్కడ వస్తున్నది. ఈ రెండు విద్యలు (ఉదాహరణంగా దహరవిద్య) ఒకటే అంటే అక్కడ చెప్పబడని గుణం ఇక్కడ ఉన్నప్పటికీ, ఇక్కడ చెప్పబడని గుణం అక్కడ ఉన్నప్పటికీ, రెండిటినీ చేర్చి చెప్పుకోవచ్చు. విద్యలకు భేదం ఉన్నది అని అంటే, అక్కడ చెప్పబడిన గుణాన్ని ఇక్కడ, ఇక్కడ చెప్పబడిన గుణాన్ని అక్కడ చెప్పకూడదు. ఈ విధంగా గుణాలను గూర్చిన విచారణను చేస్తున్నారు, వేదవ్యాసులు. అద్వైత మతంలో చెప్పినట్లుగా

బ్రహ్మకు గుణం అనేదే లేదు అంటే, సూత్ర ప్రబంధంలో శ్రీ వేదవ్యాసులు ఈ విచారాలను అన్నిటిని ఎందుకోసం చేస్తున్నారు? అని ప్రశ్నిస్తున్నారు, మన పూర్వాచార్యులు.

అన్నిటికీ మించి ఒక సారార్థం ఇక్కడ ఉన్నది. బ్రహ్మకు ఉండే లక్షణం అనేది ఏమి? అనే ప్రశ్న రాగా, " జన్మాది అస్య అతః" జగజ్జన్మాదికారణత్వం బ్రహ్మ లక్షణం అని అంటున్నారు, వేదవ్యాసులు, ఈ విధంగా బ్రహ్మకు లక్షణాన్ని చెప్పినట్టయితే నిర్విశేషమైన బ్రహ్మకు లక్షణం ఏర్పడుతున్నది, తరువాత నిర్విశేషం కావడం అద్వైతుల సిద్ధాంతానుసారంగాఏ విధంగా సాధ్యం? అనే ప్రశ్న కలుగుతున్నది. బ్రహ్మం సవిశేషమా? లేక, నిర్విశేషమా? బ్రహ్మం నిర్విశేషం అంటే, బ్రహ్మకు జగజ్జన్మాదికారణత్వం లక్షణం అని స్పష్టంగా శ్రీ వేదవ్యాసులు చెప్పడం పొసగదు.

లక్షణం అంటే ఏమి? అనే విషయాన్ని దేశికులు శతదూషణిలో వివరించి చూపించారు. లక్షణం అనేది అసాధారణ ధర్మం, అంటే, బ్రహ్మకు ఉండే అసాధారణమైన ధర్మాలు బ్రహ్మకు లక్షణం అవుతాయి. బ్రహ్మకు అసాధారణంగా లేని ఆకారం అనేది దానికి లక్షణం కాబోదు. బ్రహ్మకు అసాధారణంగా ఉండే ధర్మాన్ని, దానికి లక్షణంగా చెప్పగలం తప్ప, దానికి అసాధారణంగా లేని ధర్మాన్ని దానికి లక్షణంగా చెప్పడం వీలుకాదు. రెండవ అధికరణంలో జన్మాది అస్య యతః" అనిజగజ్జన్మాది కారణత్వాన్ని బ్రహ్మ లక్షణంగా వ్యాసులు చెప్పినందున లక్షణ విశిష్టం బ్రహ్మ అనేది ఏర్పడుతున్నది తప్ప, "నిర్విశేషం బ్రహ్మ" అనే పక్షంలో ఈ రెండవ అధికరణానికి ప్రసక్తి లేదు– అని అంటున్నారు, మన పూర్వా చార్యులు.

తరువాత ఉండే అధికరణం సమన్వయాధికరణం అనబడుతుంది. ఇక్కడ సమన్వయం అంటే అన్ని కారణ వాక్యాలు బ్రహ్మలో అన్వయిస్తున్నాయి అని అర్థం. సమన్వయం అంటేనే సంబంధం. సంబంధం అంటేనే అది రెండు వస్తువుల మధ్యఉండే

చోటనే ఏర్పడుతుంది. సంబంధి, ప్రతి సంబంధి అనే రెండు తత్వాలను ఒప్పుకోకుండా పోతే సంబంధం చెప్పడం సాధ్యం కాదు. "సమన్వయాత్" అని సూత్రకారులు ఎప్పుడు చెప్పారో, అప్పుడే తత్వాలు రెండుఅని స్పష్టమవుతున్నది. అందుచేత భేద సిద్ధాంతాన్ని గ్రహిస్తేనే"తత్తు సమన్వయాత్" అనే సూత్రాన్ని గ్రహించగలం తప్ప, అభేద సిద్ధాంతానికి ఈ సూత్రం అనుకూలం కాదు. కానే కాదు.

ఈ నాలుగు అధికరణాలు ఉండనివ్వండి. ఇవి శాస్త్రాలకు ఉపోద్ఘాత రూపమై ఏర్పడ్డాయి అనే విషయాన్ని మనం ఇంతకు ముందే అనువదించి పలికాము. "ఈక్షతేః న శబ్దమ్ " అని ఐదవ సూత్రం మొదలుకొని శాస్త్రం ఆరంభమవుతున్నది. దీనినుండి ఆరంభించి ఒక్కొక్క సూత్రంగా పరిశీలించినప్పటికీ. బ్రహ్మం సగుణంగా తోస్తుందే తప్ప, నిర్గుణంగా తోచదు. అయినప్పటికీ, ఈక్షత్యధికరణం, ఆనందమయాధికరణం, అంతరధికరణం మొదలైన కొన్ని అధికరణాలను మాత్రం విచారించి, బ్రహ్మ సగుణత్వం నిరూపింపబడుతున్నది.

**ఈక్షత్యధికరణమ్**

వేదాంతాలు కారణ వస్తువును "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" అని మొదలైన వాక్యాలతో ప్రతిపాదిస్తున్నది. కారణ వస్తువు సత్ అనే శబ్దం చేత చెప్పబడుతున్నది అనేది నిర్వివాదం. ఆ కారణవస్తువు అనుమానిక బ్రహ్మమా? అంటే, అచిత్తత్వమా? సర్వజ్ఞాదిగుణవిశిష్టమా? అనిఇక్కడ సంశయకారం. ప్రత్యక్షపరి దృశ్యమైన అచిత్తును కారణంగా పలికి, "సదేవ" అని ఇప్పుడు కంటితో చూడబడే, నామరూపాలతో కూడినదే కాకుండా, సన్మాత్రమైన నామరూప విభాగానర్హమై, ప్రళయకాలంలో ఉన్నది అనే విధంగా చెప్పబడినందున కార్యము, కారణము ప్రధానమే. ఙ కారణదశలో పరమాత్మకుఒక అవస్థ, కార్య దశలో దానికే ఇంకొక అవస్థ. అందుచేత, ప్రధానమే

జగత్కారణం. ఈ విషయం " యథా సౌమ్య ఏకైన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం భవతి" అనే వాక్యాన్ని దృష్టాంతంగా చూపి స్పష్టంగా తెలుపుతున్నది. అందుచేత, అతీంద్రియమైన పరమాత్మను కారణంగా అంగీకరించడం కంటే, వేదాంతవాక్యస్వారసాన్ని బట్టి అనుమానిక ప్రధానమే జగత్కారణంగా సిద్ధిస్తున్నది అనేది ఇక్కడ పూర్వపక్షం. ఈ మతాన్ని శ్రీ వేదవ్యాసులు "ఈక్ష తేః నా శబ్దమ్" అనే సూత్రంతో ఖండిస్తున్నారు.

ప్రళయ కాలంలో ఆచిత్తత్వం నామరూపాలను కోల్పోయి, భగవంతునిలో కలసి ఉండగా, సృష్టి ఆరంభించిన కాలంలో భగవంతుడు "బహు స్యామ్" అనే విధంగా సంకల్పించి, ఆ సంకల్పానుగుణంగా దేవ, తిర్యక్ మనుష్య స్థావరాల రూపాలుగా ఉండే జగత్తును సృష్టించి, ఈ విధంగా సృష్టించిన జగత్తులో అనుప్రవేశించి, నామరూప వ్యాకరణాన్ని చేసి, వాటికి అంతరాత్మగా నిలచి, సత్తా ధారకుడై ఉన్నాడు అనే ఈ విషయం వేదాంత సిద్ధం. జగత్ కారణ వస్తువుకు సంకల్పాన్ని చెప్పి, సంకల్పించే జగత్తును సృష్టిస్తున్నది అని పలికినందున, అచిత్తత్వమైన ప్రధానానికి సంకల్పం కూడదు కనుక, ప్రధానానికి జగత్కారణత్వం చెప్పడంవేద విరుద్ధం అనేది పైన పలికిన సూత్రంలోని భావ. వేదాంతం జగత్కారణమైన బ్రహ్మకు సంకల్పాన్ని గుణంగా చెప్పినందున, దానిని ఆధారంగా చేసికొని పూర్వం ప్రసాదించిన సూత్రంలో మతాంతర నిరసనాన్ని చేసినందున, సంకల్ప రూప గుణ విశిష్టబ్రహ్మమే వేదాంతంలో ప్రతిపాద్యం అనేది సూత్రకారుల అభిప్రాయం. ఈ విధంగా కూడా ఈ సూత్రంలో బ్రహ్మం సగుణం అని తెలుస్తున్నది.

**ఆనందమయాధికరణం**

ఈక్షత్యధికరణంలో సంకల్ప విశిష్టమైన బ్రహ్మమే జగత్కారణం అనే వేదాంతతాత్పర్యాన్ని తెలియజేసిన సూత్రకారులు ఆనందమయాధికరణంలో ఆనంద విశిష్టం బ్రహ్మ అని అంటున్నారు. చైతన్యం లేని అచిత్తుకు(ప్రకృతికి)సంకల్పం చేయడం వీవీలుకానందున, చేతనుడైన, అంటే, జ్ఞానం కలవాడైన జీవునకు సంకల్పం సాధ్యం కనుక, జీవుడే జగత్కారణం అని చెప్పవచ్చు. అతీంద్రియుడైన పరమాత్మ జగత్కారణం కాదు— అని ఈ అధికరణంలోని పూర్వపక్షం. ఈ మతాన్ని శ్రీవేదవ్యాసులు "ఆనందమయః అభ్యాసాత్" అనే సూత్రం ద్వారా ఖండించారు.

జగత్ కారణ వస్తువునుఆనందమయుడు అని వేదాంతం చెబుతున్నందున, ఆనందమయత్వం, అంటే ఆనంద ప్రాచుర్యత్వం, పరమాత్మకే పుష్కలంగా ఉన్నందున, ఆనందమయుడైన పరమాత్మే జగత్కారణం. అల్పానందం కలిగినవాడైన జీవుడు జగత్కారణం కాదు అని పైన తెలిపిన సిద్ధాంతసూత్రానికి అర్థం. ఈ విధంగాఆనంద ప్రాచుర్యం అనే అర్థంలో "ఆనందమయః"అనే శబ్దం ఉపయోగించబడింది. తప్ప, నిర్గుణుడైన బ్రహ్మం ఈ శబ్దానికి అర్థంగా చెప్పడం వీలు కాదు. ప్రచురానందం అంటే, అపారమైన ఆనందం. పరమాత్మ ఆనందమయుడు అని ఏ కారణం చేత చెప్పబడుతున్నాడు? అని అంటే, ఆనంద ప్రచురుడుగా ఉన్నందువల్ల—అని అంటున్నారు. సూత్రకారులుకూడా "సైషానందస్య మీమాంసా భవతి" అని మనుష్యానందంనుండి ఆరంభించి, బ్రహ్మానందం వరకు ఆనందంలోని గొప్పతనాన్ని పలికి "యతో వాచో నివర్తంతే" అని బ్రహ్మానందం యొక్క అపరిచ్ఛినత్వాన్ని చెప్పినందువల్ల బ్రహ్మం అనే పరమాత్మ జగత్కరణం, జీవుడు జగత్కారణం కాదు— ఈ విధంగా ఆనందం అనే గుణవిశేష విశిష్టబ్రహ్మమే

అని వేదాంతం చెప్పినందువల్ల, దీనిని ఆధారంగా చేసికొని ఇతర మత నిరసన చేసినందున, ఆనందం అనే గుణ విశేష విశిష్టబ్రహ్మమే వేదాంతవాక్యాలకు, పైన తెలిపిన సూత్రానికి విషయం, నిర్గుణ బ్రహ్మం వాటికి విషయం కానే కాదు.

**అత్త్రధికరణమ్**

బ్రహ్మను యథాతథం గా తెలిసికొని, బ్రహ్మోపాసనం చేసే అధికారికి దేశవిశేషంలో బ్రహ్మాన్ని, బ్రహ్మంలోని గుణ విశేషలను అనుభవించడమే పరమ పురుషార్థం అనే విషయాన్ని "సోశ్ను సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అనే వేదాంతవాక్యం స్పష్టంగా తెలియజేస్తున్నది. ఉపాసించదగిన బ్రహ్మమే ఆత్మ అని, ఆత్మయే జగత్కారణమనిఅక్కడే స్పష్టం. ఆత్మ పదార్థం ఏది? అనే విషయాన్ని స్థూలారుంధతీ న్యాయంతో ఉపనిషత్తు తెలుపుతున్నది. స్థూలారుంధతీ న్యాయం అంటే–వివాహ కాలంలో వధూవరులకు అరుంధతీ నక్షత్ర దర్శనం చేయించడం శాస్త్రంలో చెప్పబడినందున, ఆ నక్షత్రాన్ని చూపడంలో ప్రయత్నం చేసే పురోహితుడు, మొదట సూక్ష్మమైన అరుంధతీ నక్షత్రాన్ని చూపించడం సాధ్యం కాదని ఆలోచించి, దానికి సమీపంలో ఉన్నది, ఉజ్వలంగా ప్రకాశిస్తున్నది అయిన ఒక నక్షత్రాన్ని అదే అరుంధతి నక్షత్రం అని చూపించి, వధూవరులకు ఆ నక్షత్రంలోఅరుంధతీనక్షత్రత్వ బుద్ధిని దృఢంగా కలిగించి, ఆ తరువాత, అరుంధతీ నక్షత్రాన్ని చూపిస్తాడు. దీనికే స్థూలారుంధతీ న్యాయం అని పేరు.

ఈ విధంగానే, వేదాంతం మొదట అన్నరసమయమైన శరీరానికి ఆత్మత్వాన్ని చెప్పి, తరువాత ప్రాణమయానికి ఆత్మత్వాన్ని చెప్పి, తరువాత, మనోమయానికి ఆత్మత్వాన్ని చెప్పి, ఆ తరువాత, మనోమయానికి ఆత్మత్వాన్ని చెప్పి, ఆ తరువాత, విజ్ఞానమయుడైన జీవునకు ఆత్మత్వాన్ని చెప్పి, చివరిగా ఆనందమయుడైన జీవునకు

పరమాత్మకు ఆత్మత్వాన్ని స్థాపిస్తున్నది. ఈ సందర్భంగానే, స యశ్చాయం పురుషో యశ్చాసా వాదిత్యే"అనే ఒక వాక్యం కనిపిస్తున్నది. ఈ వాక్యంలో యత్, తత్ శబ్దాలతో ఆదిత్య మండల మధ్యవర్తి అయినపురుషునకు హృదయగుహావాసి అయిన పురుషునకు ఐక్యం తెలుస్తున్నది.

ఛాందోగ్యపనిషత్తులో "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః" అనే వాక్యంతో ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషులనకు శరీర సంబంధం చెప్పబడుతున్నది. కర్మానుగుణంగా సుఖదుఃఖాలను అనుభవించడం కోసమేశరీర సంబంధం అని సహైవ సశరీరస్య యతః ప్రియా ప్రియయోః అపహతిరస్తి" అని మొదలైన వాక్యాలు తెలుపుతున్నాయి. ఈ విధంగా పరమాత్మకు కర్మ సంబంధానికి అనుగుణమైన శరీర సంబంధం కూడదు కనుక, ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషునకు శరీరాన్ని శాస్త్రం చెప్పినందువల్ల, ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషుడు ఉపచిత పుణ్యవిశేషుడైన జీవుడే, ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషునకు జీవవిశేషత్వం స్పష్టమయ్యే పక్షంలో, "సయశ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే " అనే వాక్యానుసారంగా అతనికంటే అభిన్నుడైన, హృదయ గుహలో ఉండే పురుషునకు జీవ విశేషత్వం సిద్ధిస్తుంది. అతనికి జీవవిశేషత్వం సిద్ధించినట్లయితే, హృదయ గుహానిష్ఠునకే ఆనందమయత్వం, ఆత్మజగత్కారణత్వం వేదాంత సిద్ధం కనుక, హృదయ గుహా నిష్ఠుడైన జీవవిశేషునకే ఆనందమయత్వాదులు సిద్ధిస్తాయి. అందుచేత ఉపచిత పుణ్య విశేషుడైన జీవుడే ఆనందమయుడు, ఆత్మ జగత్కారణం అని ఈ అధికరణంలో చేయబడిన పూర్వపక్షంలోని సారం.

ఈ మతాన్ని వేదవ్యాసులు "అంతః తద్ధర్మోపదేశాత్ భేదవ్యపదేశాకచ్చాన్యః" అనే సూత్ర ద్వయంతో ఖండించారు. ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషుడు, హృదయగృహా మధ్యలో ఉండే పురుషుడు పరమాత్మయే తప్ప ఉపచితపుణ్య

విశేషులైన జీవులు కారు, ఎందుకంటే, ఉపచిత పుణ్యవిశేషులకు ఉండడానికి అవకాశం లేని కొన్ని ధర్మ విశేషాలను ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషునకు వేదాంతం చెప్పడం చేత. ఉపచిత పుణ్య విశేషులుశ అని చెప్పబడే ఆదిత్యాదిదేవతల కంటే బ్రహ్మానికి భేదాన్ని "య ఆదిత్యే తిష్ఠన్, యస్య ఆదిత్యః శరీరమ్" అని మొదలైన వాక్యాలతో వేదాంతంచెప్పడం చేత, ఆదిత్య మండలంలో ఉండే పురుషుడు పరమాత్మయే, జీవుడు కాడు– అని పైన తెలిపిన సూత్రాల భావం. ఉపచితపుణ్య విశేషులకు ఉండడానికి సాధ్యం కాని పరమాత్మకు మాత్రమే అసాధారణాలు అయిన ధర్మాలు– పుండరీకాక్షత్వం, అపహత పాపత్వం అనేవి. ఇవి " కప్యాసం పుండరీకమ్ ఏవమ్ అక్షిణీ", " తస్య ఉదితి నామా–––ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యః " ఇత్యాది వాక్యాల వల్ల సిద్ధిస్తున్నాయి.

పైన పలికిన ధర్మ విశేషాల వల్ల ఆదిత్య మండలం మధ్యలో ఉండే పురుషుడు పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడే అని చక్కగా ప్రకాశిస్తున్నది. పుండరీకాక్షత్వం భగవంతునకే అసాధారణం అని శైవుల చేత కూడా అంగీకరింపబడింది. ఋగ్వేద ఖిలం అని ప్రసిద్ధమైన జితంతే స్తోత్రంలో "జితం తే పుండరీకాక్ష" అని భగవంతుని పుండరీకాక్షత్వంతో సంబోధించడాన్ని గమనించవచ్చు. ఛాందోగ్యంలో కూడా "ఏవమ్ అక్షిణీ" అని ద్వివచనం ఉన్నందువల్ల, త్రినేత్రుడైన శివుడు పుండరీకాక్షశబ్దంతో చెప్పబడడు. అందుచేత పుండరీకాక్షత్వం అనేది భగవంతునికే అసాధారణం. ఆవిధంగానే, అపహత పాప్మత్వం కూడా భగవంతునకు మాత్రమే అసాధారణమైన ధర్మం. శివుడు తనను అపహతపాప్మ అని నిర్దేశించుకోవడంకూడా పురాణ ప్రసిద్ధం. అపహత పాప్మా అయినవాడే ఉపాసించదగినవాడు అని శాస్త్ర తాత్పర్యం.

ఆదిత్య మండలంలో ఉండే పురుషునకు వేదాంతాలలో చెప్పబడిన శరీర సంబంధన్ని మాత్రమే పురస్కరించుకుని అతడు పరమాత్మ కాడు, జీవ విశేషమే అని నిశ్చయించడం సాధ్యం కాదు. కర్మానుగుణమైన శరీరాన్ని కలవానికే సుఖదుఃఖాల అనుభవం వేదాంత సిద్ధం. కనుక, "ఇచ్ఛా గృహీతాభిమాతోరుదేహః" అనే విధంగా శరీర సంబంధాన్ని కల భగవంతునకు సుఖదుఃఖాల అనుభవం కలుగదు. అందుచేత, అప్రాకృత దివ్య మంగళ విగ్రహంతో కూడిన, ఆదిత్య మండలం మధ్యలోఉండే పురుషుడు పరమాత్మయే తప్ప, అపహత పాప్మ అయిన జీవుడు కాడు. అపహత పాప్మత్వం అంటే– పాప సంబంధం ఉన్నప్పటికీ, పాప ఫలం తనకు అంటకుండా ఉండడం. అవతార కాలాలలో అశ్వమేధ మహాయాగాదులైన శుభకర్మ లను, స్త్రీవధ, స్వర్ణవలయ చౌర్యం మొదలైన అశుభ కర్మలను భగవంతుడు చేసినప్పటికీ, ఆ శుభాశుభకర్మల చేత ఆ స్వామికి సుఖదుఃఖాలు, హెచ్చుతగ్గులు కలుగవు. అతన్ని సంబంధం చేత పుణ్యం వలె పాపం కూడా అతిశయాన్ని పొంది ప్రకాశిస్తుంది.

అతడు ఒక్కడే అపారపాత్మ. అందుచేత కారణత్వం, పరత్వం, ఉపాస్యత్వం నారాయణనకే అసాధారణం అని వేదాంత శాస్త్రతాత్పర్యం. గుణవిగ్రహప్రతిపాదకాలు అయిన వేదాంతవాక్యాలతో పైన ప్రస్తావించిన సూత్రంలో శ్రీవేదవ్యాసులు ఇతర మత నిరసనం చేసినందు వల్ల బ్రహ్మం ఆనందమయత్వాదిగుణవిశిష్టం అనేది వ్యాస సిద్ధాంతం అని ఏర్పడుతున్నది. ఈ విధంగానే, శారీరకశాస్త్రోపసంహారాన్ని విచారించి చూసినప్పటికీ, బ్రహ్మం సగుణంగానే ప్రకాశిస్తున్నది.

**జగద్వ్యాపార వర్జాదికరణం**

పరమ పురుషుడు స్వతంత్రుడు అనేది "అవాకీ అనాదరః" అని మొదలైన వేదాంతవాక్యాల వల్ల తెలుస్తున్నది. ఆ భగవంతుని విషయంలో భక్తిని కానీ, ప్రపత్తిని

కానీ ఆచరించిపరమపదంలో ఆ స్వామిని సమీపించి, చేరి, దాస్యాన్ని చేస్తూ ఉంటాడు, ముక్తుడు. పుణ్యపాపాలు రెండు నశించినవాడైన పురుషుని దేవతలు స్వర్గలోకం నుండి కిందకు గెంటివేస్తారు, కనుక, తన నిరంకుశస్వాతంత్ర్యంతో భగవంతుడు మళ్లీ సంసారంలోకి ముక్తుని గెంటివేస్తాడా? అనే సందేహం ఏర్పడగా, శ్రీ వేదవ్యాసులు దీనికి సమాధానాన్ని " అనావృత్తిః హి శబ్దాత్"అనే సూత్రం ద్వారా పలుకుతున్నారు.

పరమపురుషుని స్వరూప రూప గుణ విభూతులు, స్వాతంత్ర్యం ప్రత్యక్షంతోను, అనుమానంతోను తెలియడానికి వీలు కానివి. ఏ వేదం చేత ఇవి తెలియబడుతున్నవో, ఆవేదంలోనే "న చ పునరావర్తతే" అని ముక్తుని అనావృత్తి కూడా చెప్పబడింది. కనుక, ముక్తుడు తిరిగి ఈ లోకానికి రాడు– అనేది పైన ప్రస్తావించిన సూత్రంలోని భావం. ఆధ్యాత్మికాదితాపత్రయాల చేత తపి బడినవాడైన అధికారికి పరమానంద రూపమైన మోక్షం కలిగితే, ఆ జీవుడు తానుగా మోక్షాన్ని విడిచి ఈ సంసార మండలానికి తిరిగి రానే రాడు. "వాసుదేవః సర్వ మితి స మహాత్మా సుదుర్లభః" అని జ్ఞాని లాభానికి తపస్సు చేస్తూ ఉండే భగవంతుడు కూడా జ్ఞాని అయిన ముక్త పురుషుని పొంది, తిరిగి అతనిని ఈ సంసారం మండలంలోకి పంపడు అని పైన సూత్రంలోని భాష్యంలో మన స్వామి భగవద్రామానుజులు వ్యాఖ్యానించారు.

ఈ విధంగా శాస్త్రోపసంహారంలో కూడాపరమపదం అని ఒక దేశ విశేషం ఉన్నదని, ఆ దేశంలో నిత్యముక్తానుభావ్యమైన, కల్యాణ గుణాలతో కూడిన భగవంతుడు –బ్రతమా శబ్దవాచ్యుడు ఉన్నాడని, అతనిని అనుభవించే నిత్యముక్తులు ఉన్నారని స్పష్టమవుతున్నందున, విశిష్ట బ్రహ్మ ప్రతిపాదనలోను, తత్ ప్రాప్తిరూపమైన మోక్ష ప్రతిపాదనలోను సూత్రతాత్పర్యం ఉన్నదని తెలుస్తున్నది. నిర్గుణబ్రహ్మబ్రాంతికి వేదాంతం, వేదాంత సూత్రాలు ఆధారంగా కావు. ఆ పక్షం ఉత్సూత్రం (బ్రహ్మసూత్ర ప్రబంధానికి సుతరాం బాహ్యమైనది) అని అంటారు, మన పెద్దలు.

ఈ విధంగా సర్వజ్ఞత్వాది గుణవిశిష్ట బ్రహ్మమే జగత్కారణం అని, బ్రహ్మం నారాయణుడే అని సూత్రాలకు తాత్పర్యం అనేది సిద్ధాంతీకరింపబడింది. శ్రీ వేదవ్యాసుల అపరావతారం అని కీర్తింపబడే నమ్మాళ్వారులు కూడా ఈ విషయాన్ని తాము అనుగ్రహించినతిరువాయ్ మొళ్ళి దివ్య ప్రబంధంలో వ్యక్తం చేశారు. పొయ్ గై అళ్వార్లు "వైయమ్ తకళియా" అని ఆరంభమయ్యే పాశురంలో భగవంతుడు ఉభయ విభూతి యుక్తుడు అనే అర్థాన్ని స్థాపించారు. నమ్మాళ్వార్లు కూడా "ఉయర్వఱ" అనే ఆరంభమయ్యే మొట్టమొదటి పాశురంలో ఆ విధంగానే అర్థాన్ని తెలిపారు. పూదత్తాళ్వారులు "అన్బే తకళియా "అనే ఆరంభం అవుతున్న పాశురంలో "ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్ నారణఱ్కు" అని అంటూ భగవంతుడు నారాయణశబ్దవాచ్యుడు అని తెలియజేశారు. నమ్మాళ్వారులు కూడా"వీడు మిన్" అనే దశకంలో వణ్ పుకళ్ నారణన్" అని ఆ విధంగానే స్థాపించారు. పేయాళ్వారులు "తిరుక్కండేన్" అని ఆరంభించి, ఆ పరమాత్మ నారాయణుడే అని స్థాపించారు. నమ్మాళ్వారులు "పత్తుడై" అనే దశకంలోనిమొదటి పాశురంలో " మలర్ మకళ్ విరుంబుమ్ నమ్ ––– అడికళ్ " అని ఆ విధంగానే స్థాపించారు. తిరుమళ్ళిశై ప్పిరాన్ "తిరువిల్లా ద్దేవరై తేఱేల్ మిన్ తేవు" అని దేవతాంతర పరత్వ నిరసనాన్ని చేశారు. నమ్మాళ్వారులుకూడా "కణ్ణన్ అల్లాల్ దైవమ్ ఇల్లై" అని ఆ విధంగానే స్థాపించారు. ఆ విధంగా ముదలాల్వార్లు, తిరుమళ్ళిశైప్పిరాన్ ప్రసాదించిన, పైన ప్రస్తావించిన సూక్తులను అనుసరించి నమ్మాళ్వారులు, భగవంతుడు ఉభయ విభూతి యుక్తుడు–అని, నారాయణశబ్ద వాచ్యుడు అని, శ్రీమన్నారాయణుడు అని స్థాపించారు.

## 27)బ్రహ్మ శబ్దార్థ నిరూపణం

బ్రహ్మసూత్ర ప్రబంధంలోమొదటి సూత్రం "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే సూత్రం. ఇందులో ఉండే "బ్రహ్మజిజ్ఞాసా" అనే పదం సమస్త పదం. ఈ సమాసంలో అంతర్గతంగా బ్రహ్మ శబ్దానికి ఉండే అర్థవిచారాన్ని శ్రీభాష్యంలో మన స్వామి భగవద్రామానుజులు చేశారు. ఇక్కడ ఉండే శ్రీభాష్య సూక్తులకు శ్రుతప్రకాశికాచార్యులవారు చాలా అద్భుతంగా వివరణను అనుగ్రహించారు. ఈ వివరణాన్ని అనుసరించి, కొన్ని అర్ధ విశేషాలను ఈ వ్యాసం మూలంగా యథామతి విజ్ఞాపిస్తాను.

ముందుగా, బ్రహ్మ శబ్దార్థాన్ని వివరించే శ్రీ భాష్య సూక్తులు ఏ విధంగా ప్రకాశిస్తున్నాయి? అనే విషయాన్ని గమనించాలి. వీటిని మూడు విధాలుగా విభాగించుకోవాలి. శ్రీరామానుజులు మొట్టమొదట, ప్రతిజ్ఞా వాక్యాన్ని అనుగ్రహించారు, తరువాత శబ్దశక్తి చేత బ్రహ్మ శబ్దాన్నివివరించారు. దానికి తరువాత ఉండే సూక్తుల ద్వారా అర్థసామర్థ్యంతోను ప్రతిజ్ఞా వాక్యాన్ని ఉపపాదనంచేస్తున్నారు.

మొదట ప్రతిజ్ఞ వాక్యాన్ని అనుభవంలోకి తెచ్చుకుందాం. "బ్రహ్మశబ్దేన చ స్వభావతో నిరస్త నిఖిల దోషః అనవధికాతిశయాసంఖ్యేయకళ్యాణ గుణగణః పురుషోత్తమోభిధీయతే" – బ్రహ్మశబ్దం చేత సహజంగానే దోషాలు ఏమి లేనివాడు, అంతు లేని కళ్యాణ గుణాల సమూహాన్ని కలిగినవాడైన పురుషోత్తముడు చెప్పబడుతున్నారు– అనేది ఈ వాక్యంలోని అర్థం. ముందుగా దీని వివరణను గమనించి చూద్దాం.

బ్రహ్మ శబ్దం అనేది పురుషోత్తమునే ముఖ్యవృత్తితో నిర్దేశిస్తున్నది అని శ్రీ రామానుజులు ఇక్కడ మొట్టమొదట ప్రతిజ్ఞా వాక్యంగా అనుగ్రహించడానికి మూడు

కారణాలను శ్రుతప్రకాశికాచార్యస్వామివారు తెలియజేశారు. ముందు ఆ మూడు విషయాలను వివరిస్తాను.

1)బ్రహ్మ శబ్దం ప్రధానం అనబడే ప్రకృతి, ముక్త జీవులవంటి అవరతత్త్వాల విషయంలో ప్రయోగింపబడడం గమనించవచ్చు. బ్రహ్మ శబ్దవాచ్యుడు పురుషోత్తముడు అని అన్నందువల్ల వీరు వ్యావర్తింపబడుతున్నారు. వీరికంటే ఉన్నత తత్త్వమైన పురుషోత్తముని బ్రహ్మ శబ్దం నిర్దేశిస్తున్నది అని చూపడం శ్రీరామానుజుల అభిప్రాయం అనేది ఒక కారణం.

2) ఇతర వ్యాఖ్యాతలు తమ తమ వ్యాఖ్యానాలలో ఈశ్వరాతిరిక్తమైన, ఈశ్వరుని కంటే వేరైనవారి విషయాలం కూడా ఈ బ్రహ్మ శబ్దాన్ని ఉపయోగించారు. ఈశ్వరాతిరిక్తమైన తత్త్వమే బ్రహ్మ శబ్దం చేతచెప్పబడుతున్నది అని వీరి అభిప్రాయం. ఇది యుక్తం కాదు అని చెప్పడం కోసం కూడా ఇక్కడ శ్రీరామానుజులు ఈ ప్రతిజ్ఞా వాక్యాన్ని అనుగ్రహిస్తున్నారు అనేది రెండవ కారణం.

3)తరువాత, ఈశ్వరాతిరిక్తం కాదు, అయితే, ఈ బ్రహ్మ శబ్దం దేవతాంతరాలను ఉద్దేశిస్తున్నది అనే ఒక పక్షం ప్రచారంలో ఉన్నది. అంటే, లోకంలోబ్రహ్మ, విష్ణు, శివుడు అనే ముగ్గురు సమానం అనే ఒక వాదం ప్రచారంలో ఉన్నది. శివునకు ఆధిక్యం ఉన్నది అనే పక్షం ఇంకొకటి ఉన్నది. ఈ విధంగా శివునకు పరత్వాన్ని చెప్పే పక్షం పొసగదు అని చూపాలి అని శ్రీ రామానుజులకు అభిప్రాయం. ఇది మూడవ కారణం.

ఈ విధంగా ఈ ప్రతిజ్ఞా వాక్యానికి పైన తెలిపిన ఈ మూడు పక్షాలను వ్యావృత్తి చేసి, బ్రహ్మ శబ్దం పురుషోత్తముడైన శ్రీమన్నారాయణునే నిర్దేశిస్తున్నది అని చూపడం ముఖ్య ప్రయోజనం. అందుకోసం, పురుషోత్తముడైన నారాయణుని గుణాలను చూపి, ఈ

బ్రహ్మ శబ్దం అతని విషయంలోనే పర్యవసిస్తున్నది అని నిరూపిస్తున్నారు, మన స్వామి భగవద్రామానుజులు.

ఇక్కడ మనంశ్రీరామానుజులు పోయే దారిని ముఖ్యంగా తెలుసుకోవాలి. పురుషోత్తముడే బ్రహ్మ శబ్దంచేత చెప్పబడుతున్నాడు అనే విషయం, ఈ పురుషోత్తమ శబ్దం శ్రీమన్నారాయణునే నిర్దేశిస్తున్నది అనే విషయం మనం సారంగా తెలియవలసిన విషయాలు. వీటిని మనం తెలియడం ఏ విధంగా? అనే సంగతిని గమనించాలి. పురుషోత్తమ శబ్దం రూఢిశక్తి చేత నారాయణునే నిర్దేశిస్తున్నది. అందువల్లనే బ్రహ్మ శబ్దానికి దేవదాంతర పరత్వం నిరసింపబడుతున్నది. బ్రహ్మ శబ్దం అనేది అముఖ్యవృత్తి ద్వారా అవరతత్వాలైన ప్రకృతి, దేవతాంతరాలు, ముక్త జీవుడు వంటివారిని నిర్దేశిస్తున్నప్పటికీ, పురుషోత్తమ శబ్దం ఈ మూడింటిని రూఢిచేతగాని, అముఖ్యవృత్తిద్వారాగాని నిర్దేశించదు. అందుచేత, ఇటువంటి పురుషోత్తమ శబ్దవాచ్యుడు బ్రహ్మపదం చేత నిర్దేశింపబడుతున్నాడు అని అన్నందున, బ్రహ్మ శబ్దం కూడా ముఖ్య వృత్తి ద్వారా అవరతత్వాలైన ఇతర తత్వాలను కూడా నిర్దేశించదు అనేది శ్రీరామానుజుల నిరూపణం.

"అవయవ శక్త్యా బద్ధముక్తావస్థచేతనవైలక్షణ్యం యుక్తమ్" అని శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు తర్వాత అనుగ్రహిస్తున్నారు. పురుషోత్తమ శబ్దం యొక్క రూఢిశక్తిచేత దేవతాంతరాలు నిరసింపబడుతున్నాయి అనే విషయం అటు ఉండనివ్వండి. పురుషోత్తమ శబ్దంయొక్క అవయవ శక్తిని గమనించాము అని అన్నా, పురుషోత్తమశబ్దం నారాయణనే నిర్దేశిస్తుంది అనేది కూడా యుక్తం. పురుషోత్తమ శబ్దానికి " పురుష శ్చాసౌ ఉత్తమః పురుషోత్తమః" అని, "పురుషాణామ్ ఉత్తమః పురుషోత్తమః" అని, " పురుషేషు ఉత్తమః పురుషోత్తమః " అని మూడు విధాలుగా విగ్రహాన్ని పలుకుతారు. వీటిలో "పురుషాణామ్ ఉత్తమః పురుషోత్తమః" అనే విగ్రహాన్ని కలిగిన

సమాసం అర్థపుష్టి కలిగినది కనుక గొప్పదిగా భావింపబడుతున్నది. "పురుషాణామ్ ఉత్తమః పురుషోత్తమః" –అంటే పురుషులలో ఉత్తముడు అని అన్నందున బద్ధపురుషుడు అవరుడు అని తెలుస్తున్నది. ఉపచిత పుణ్య విశేషవిశిష్టులైన ఆదిత్యాదిదేవతలు కూడా ప్రకృతి మండలంలో ఉండేవారే. వీరిలో కూడా గొప్పవారైన బ్రహ్మ, శివుడు మొదలైన వారు కూడా కర్మకు వశ్యులే. మీరు కూడా బద్ధ జీవకోటిలో చేరినవారే. వీరందరూ అధమపురుషులే. వీరిలో ఎవరు కూడా పురుషోత్తమశబ్ద వాచ్యులు కాలేరు. అందుచేత, బద్ధ విలక్షణుండు పురుషోత్తముడు అని చెప్పినట్లయినది.

ఇక, బద్ధపురుషులలో కూడా గొప్పవారైన ముక్తుల స్థితి ఎటువంటిది? అని గమనించాలి. వీరు కూడా కర్మవశ్యులుగా ఉన్నవారే. ఒక కాల విశేషంలో భగవంతుని అనుగ్రహం చేత కర్మబంధంనుండి విడుదలను పొంది, ఈ సంసార మండలంనుండి బయటపడి, పరమపదంలో ముక్తులై వర్తిస్తున్నవారు, వీరు. వీరి. కంటే నిత్యులు ఉన్నతులైనా, వీరు కూడా పురుషోత్తమ శబ్దవాచ్యులు అయే అవకాశం లేదు.

అందుచేత బద్ధులు, ముక్తులు అనే రెండు స్థితులలోను ఉండే చేతనులకంటే భగవంతునకు కల వైలక్షణ్యం ఈ పురుషోత్తమ శబ్దంలో అవయవ శక్తిచేత చూపబడుతున్నది. పురుషోత్తముడు బ్రహ్మ శబ్దవాచుడు అంటే, ఈ బ్రహ్మ శబ్దం బద్ధముక్తోభయావసథలలో ఉండే పురుషుల కంటే ఉన్నతమైన ఒక తత్వాన్ని నిర్దేశిస్తున్నది అని తెలుస్తున్నది.

దీనికి తరువాత నిత్యులను గూర్చి ప్రస్తావించాలి. అంటే, వారి కంటే ఒక వ్యావృత్తి పురుషోత్తమ శబ్దవాచ్యునకు చెప్పబడాలి. అయితే, ఈ సందర్భంలో నిత్యులను గూర్చిన ప్రస్తావన శ్రుతప్రకాశికా వ్యాఖ్యానంలో లేదు. "అవయవ శక్త్యా

బద్ధముక్తావస్థచేతనవైలక్షణ్యం యుక్తమ్" అని మాత్రమే శ్రుతప్రకాశికాశార్యస్వామివారు అనుగ్రహించారు. ఇందులోని అభిప్రాయం ఏమి? అనే విషయాన్ని గమనించాలి. నిత్యులను ప్రస్తావించకపోవడానికి కారణ ఎన్నో కారణాలు ఉండవచ్చు. వాటిలో రెండు కారణాలను మాత్రం ఇక్కడ గమనిద్దాం.

1) ఇక్కడ నిత్యుల కంటే ఒక వ్యావృత్తిని బ్రహ్మకు సిద్ధింప జేయాలి అనేది అంత ఆవశ్యకం కాదు. లోకంలో మిగిలిన మతాలలో కూడా జీవులందరూ బద్ధులుగా ఉన్నారు అని, వీరు అందరూ విడుదలను పొందాలి అని బద్ధులు ముక్తులు అనేవారిని గూర్చి చెప్పబడేది వైదిక సంప్రదాయానికి దూరమైన వారు కూడా, ఈ విధంగా అంతా కొంతవరకు తెలిసి కొన్నారు– అనే విషయాన్ని మనం చూస్తున్నాం. అయితే, నిత్యపురుషులను గూర్చి శాస్త్రమే తెలియజేయగలదు. నిత్యపురుషులను గూర్చి పరమ వైదిక సంప్రదాయం లో మాత్రమే చెప్పబడి ఉన్నది. ఇందువల్ల బద్ధముక్తుల కంటే విలక్షణపురుషుడైన పురుషోత్తముడు బ్రహ్మ శబ్దవాచుడు అని చూపడమే ముఖ్యం. స్వగోష్టిలో నిచేత్యుల కంటే విలక్షణుడు పరమ పురుషుడు అనే విషయాన్ని స్థాపించడం పెద్ద విషయం కాదు. ఎందుకంటే, పరమపదంలో నిత్యులకు చెప్పబడే గొప్పతనాలు అన్ని స్వాభావి కావు. కావు. నిత్యుల నిర్దోషత్వం అనే స్వభావమనేది స్వభావంతో వారికి ఏర్పడినది కాదు. అది భగవంతుని నిత్యసంకల్పానుగుణంగానే వారికి ఏర్పడిన ఒక గొప్పతనం. అందుచేత వారికి ఉండే గొప్పతనాలకు అన్నిటికీ భగవంతుని అనుగ్రహమే కారణం. ఆ అనుగ్రహాన్ని చేసేవాడు వారి కంటే గొప్పదనం కలవాడు అనేది చెప్పకుండానే తెలుస్తుంది.

2) తరువాత, "అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణ గుణగణః " అనే శ్రీ రామానుజుల సూక్తిని వివరించే చోట "అనవధికాతిశయ" శబ్దప్రయోగించేత తెలియబడే ముఖ్యమైన ఒక అర్థ విశేషం ఏమంటే, నిత్యులకంటే భగవంతునకు ఉండే వ్యావృత్తియే.

దీనిని పలు విధాలుగా తరువాత చూపబోతున్నారు. అందువల్ల కూడా ఈ సందర్భంలో నిత్యులను గూర్చి శ్రుతప్రకాశికాచార్య స్వామివారు ప్రస్తావించలేదు అని చెప్పవచ్చు.

బద్ధుల, ముక్తుల నిత్యుల కంటే వ్యావర్తింపగల నిరస్తనిఖిలదోషత్వం అనే స్వభావం బ్రహ్మ శబ్దవాచుడైనపురుషోత్తముడనకు ఒక్కనికే సహజంగా ఏర్పడిన గొప్పదనం అనే వాస్తవం స్ఫురింరించడం కోసం ప్రతిజ్ఞా వాక్యంలో "స్వభావతః "అనిశ్రీరామానుజులు అనుగ్రహించారు అని తెలుస్తున్నది. ఈ స్వభావతః అనే పదాన్ని రెండవ విశేషణమైన "అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణగణః" అనేదానితో చేర్చుకోవాలి అని చెప్పబడింది. దీనికి కారణాలు ఉన్నాయి.

1) బ్రహ్మను గూర్చి శంకరభాస్కర యాదవ ప్రకాశమతస్థులు చెప్పే అపార్థాలను నిరసించడం కోసం ఇక్కడ "స్వభావతః" అనే పదాన్ని చేర్చుకుంటే, బ్రహ్మ సహజంగానే అన్ని కళ్యాణ గుణాలు నిండుగా కలిగినది అనే అర్థం లభిస్తుంది అని అంటున్నారు, శ్రుతప్రకాశికా చార్య స్వామి వారు. ఈ విషయం తరువాత వివరింపబడుతుంది.

2) రెండవ కారణం ఏమంటే, ఇంతకు ముందు చూపిన విధంగా నిత్యుల వ్యావృత్తి స్ఫురించడం కోసం"స్వభావతః" అనే పదాన్ని ఇక్కడ చేర్చుకోవాలి. దీనినిగూర్చి కూడా శ్రుతప్రకాశికాచార్యులవారే తరువాత వివరంగా అనుగ్రహించబోతారు.

"బ్రహ్మ శబ్దవాచ్యుడు పురుషోత్తముడు" అనే విషయాన్ని మాత్రం ప్రతిజ్ఞా వాక్యంగా పలుకకుండా స్వామి రామానుజులు ఇక్కడ ఈ రెండు విశేషణాలను చేర్చి పలుకడంలో ఉండే అభిప్రాయాన్ని పలు విధాలుగా శ్రుతప్రకాశికాచార్యులవారు తెలియజేశారు. వీటిని ఒక్కొక్కటిగా వివరిస్తాను.

1) బ్రహ్మ శబ్దవాచ్యుడైన పురుషోత్తముడు స్వేతర సమస్త వస్తువిలక్షణుడు అని అంటే చాలదు. ఎందుకంటే, ఒక తృణం కూడా తనకంటే ఇతరమైన వస్తువుల కంటే

విలక్షణంగా ఉంటుంది. ఈ విధంగా కాకుండా, పురుషోత్తమునకు ఉండవలసిన వైలక్షణ్యం ఏమంటే, అసాధారణ సామర్థ్యాన్ని కలిగి ఉండడం. ఇది పురుషోత్తముడైన భగవంతునకే ఉండే ఒక గొప్పతనం. దీనిని మనకు తెలియజేయడం కోసమే భగవద్రామానుజులు బ్రహ్మ శబ్దవాచ్యుడైన పురుషోత్తమునకు గల "స్వభావతః నిరస్తనిఖిలదోషత్వం, స్వభావతః అనవధికాశయాసంఖ్యేయకళ్యాణ గుణగణత్వం– అనే రెండు ప్రత్యేక స్వభావాలను అనుగ్రహించారు.

2) ఈ రెండు విశేషణాల చేత బ్రహ్మ శబ్దం అనేది శబ్దశక్తి చేత, అర్థసామర్థ్యం చేత పురుషోత్తమునిలోనే పర్యవసిస్తున్నది అని చూపించడం కూడా శ్రీరామానుజలకు అభిప్రాయం అని తెలుస్తున్నది. ఈ రెండు విశేషణాలు బ్రహ్మ శబ్దం పురుషోత్తమపరం అని ప్రతిపాదించడానికి ఉపయోగపడేవి అనే దాని కోసం చెప్పబడ్డాయి తప్ప, ఇవి బ్రహ్మ శబ్దవాచ్యుడైన తత్త్వానికి ప్రవృత్తి నిమిత్తలుగా చెప్పబడలేదు అని, శ్రీశ్రుతప్రకాశికాచార్యస్వామి వారు తెలియజేస్తున్నారు. ఈ రెండు విశేషణాలు బ్రహ్మవిషయంలో ఉండే గుణాలే తప్ప, అంటే, బ్రహ్మ శబ్దవాచ్యుడైన పురుషోత్తముని విశేషాలే తప్ప, ఇవి బ్రహ్మకు లక్షణాలు కావు, అంటే, స్వరూప నిరూపక ధర్మాలు కావు –అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు.

ప్రవృత్తి నిమిత్తం అంటే ఏమి? అనేది మొదట తెలుసుకోవాలి. వృత్తి అంటే బోధనం–తెలుపడంఅని అర్థం. ప్రకృష్టం అయిన బోధనం అంటే, గొప్ప జ్ఞానాన్ని కలిగించడం, ప్రకృష్టమైన జ్ఞానానికి ఏది నిమిత్తంగా, అంటే, కారణంగా ఉన్నదో, అది ప్రవృరత్తి నిమిత్తం అనబడుతుంది. ఒక శబ్దాన్ని పలికితే, ఆ శబ్దం ఏ వస్తువును నిర్దేశిస్తుందో, ఆ వస్తువును గూర్చిన విశిష్టమైన, ప్రకృష్టమైన జ్ఞానాన్ని కలిగించే ధర్మం ఏదో, అది ప్రవృత్తిధర్మం అవుతుంది. " స్వభావతః నిరస్తాఖిలదోషత్వం, స్వభావతః అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణగుణగణత్వం బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తలు

కావు. ఇంతకు మించి బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తం ఏది? అనే ప్రశ్న రాగా, దానినే బృహత్త్వం అని తెలుపుతున్నారు, భగవద్రామానుజులు. ఈ అర్థం తరువాత వివరింపబడుతుంది.

3) ముముక్షువులకు వారికి ఉండే అన్ని దోషాలనులేకుండా చేసి, వారు నిరతిశయానందం పొదించడానికి హేతువుగా బ్రహ్మంఉన్నందున, ఈ రెండు విశేషణాలు బ్రహ్మ విషయంలో చెప్పబడ్డాయి–అని అంటున్నారు, శ్రుత ప్రకాశికాచార్య స్వామివారు.

4) వాద్యంతరోక్తస్య అవిద్యాదిదోషాన్వయస్య నిర్గణత్వస్య వ్యావృత్త్యర్థమ్" అని అంటూ తర్వాత కారణాన్ని శ్రుత ప్రకాశికాభట్టర్ అనుగ్రహిస్తున్నారు. బ్రహ్మ నిర్గుణత్వవాదాన్ని, బ్రహ్మకు అవిద్యాధిదోషసంబంధాన్ని చెప్పే అద్వైతుల మతాన్ని నిరసించడం కోసం ఈ విశేషణాలు ఇక్కడ ప్రయోగింపబడ్డాయి అని అంటున్నారు. బ్రహ్మ శబ్దవాచ్యుడు సహజంగానే ఏ దోషాలను లేనివాడు– అని శ్రీ రామానుజులు పలికినందున, "బ్రహ్మకు అవిద్యాది దోషత్వం యుక్తం" అని చెప్పే అద్వైత మతం నిరస్తం. అద్వైతులు బ్రహ్మ నిర్గుణం, అది సగుణం కాదు– అనే వాదాన్ని చేస్తున్నారు. బ్రహ్మ శబ్దవాచ్యుడు సహజంగానే అనవధికాతిశయా సంఖ్యేయ కళ్యాణగుణగణాలను కలవాడుగా ఉన్నాడు– అని శ్రీరామానుజులు పలికినందున, బ్రహ్మకు సగుణత్వం అనేది అవిధద్యా సంబంధంచేత వస్తుంది అని అద్వైతులు చెప్పే వాదం కూడా నిరస్తమైనది.

5) "ఉపాధ్యుపహిత బ్రహ్మస్వరూపస్యైవ కర్మసంశయ త్వదుఃఖిత్వాదివ్యావృత్త్యమ్" – బ్రహ్మాన్ని గూర్చి భాస్కర మతాన్ని చెందినవారు వేరు విధంగా అర్థాన్ని చెబుతున్నారు. బ్రహ్మమనేది శరీరం, ఇంద్రియాలు అనే

ఉపాధులతో కూడినదై, కర్మవశ్యత్వం, దుఃఖిత్వం వంటివానిని పొందుతున్నది అనే వాదాన్ని వారు చేస్తున్నారు. అవిధ్యాసంబంధంచేత బ్రహ్మకు సకల దోషాలను అద్వైతులు కల్పిస్తున్నారు. ఒక ఉపాధి చేత బ్రహ్మకు సకల దోషాలను కల్పించేవారు, భాస్కర మతస్థులు. అవిద్యను ఒక ఉపాధిగా గ్రహించవచ్చు కదా అని అంటే, ఆ విధంగా కాదంటారు., ఎందుకంటే, అద్వైతుల మతంలో అవిద్య అనేది అసత్యం. భాస్కర మతంలో ఉపాధి సత్యం. ఈ మతాన్ని కూడానిరసించడం కోసం ఏర్పడ్డాయి, భగవద్రామానుజులు అనుగ్రహించిన రెండు విశేషణాలు అనేది మనం సారంగా తెలియవలసిన విషయం.

6) "జ్ఞానాది శక్తి యోగ ఏవాఽస్య స్వాభావికః, సార్వజ్ఞ్యనిరతిశయానందాదియోగస్తు కాదాచిత్కః ఇతి మతస్య చ వ్యావృత్త్యర్థం ఇదం విశేషణద్వయం ఉక్తమ్"—యాదవ ప్రకాశమతంలో బ్రహ్మకు జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు అనే ఆరు గుణాలు మాత్రమే ఉన్నాయని అంటున్నారు. సర్వజ్ఞత్వం, నిరతిశయానందం వంటి గుణాలు అన్నీ జ్ఞానం యొక్క విశేషాలు కదా— అని అంటే, వారు ఒప్పుకోరు. జ్ఞానాది ఆఱు గుణాలు బ్రహ్మ స్వరూపంలో అంతర్భవిస్తాయి అని, అన్యగుణాలు బ్రహ్మస్వరూపంలోఅంతర్భవించకుండా, బ్రహ్మకు గుణాలు అవుతున్నాయి అని, ఇవి కూడా ఎల్లప్పుడూ బ్రహ్మకు సిద్ధించడం లేదు, ఏదో ఒక కాల విశేషంలోమాత్రమే ఇవి బ్రహ్మలో కలుగుతాయి అని వీరు అంటున్నారు. ఈ మతనిరసనం చేసేటట్లే ఈ విశేషణాలు ప్రయోగింపబడ్డాయి.

పూర్వం పలికిన విషయాలను పరిశీలించి చూచినప్పుడు, ఈ రెండు విశేషణాలలోనూ "స్వభావతః " అనే పదాన్ని చేర్చుకోవాలి అనేది, ఈ రెండు విశేషణాలలోనూ ఈ పదం ప్రాణస్థానపదంగా ప్రకాశిస్తున్నది అనే విషయం మనకు బోధపడుతుంది. అయితే, భగవద్రామానుజులు స్వభావతః అనే పద ప్రయోగం

చేయడానికి ఆధారమైనది ఏది? అనే ప్రశ్న ఇక్కడ కలుగవచ్చు. దీనికి ప్రమాణ బలాన్ని రెండు విధాలుగా చూపవచ్చు.

1) ఆనందవల్లిలో బ్రహ్మానందం అనేది మనసుతో, వాక్కుతో లెక్క కట్టడానికి సాధ్యం కాదు –అని చెప్పే చోట ఇటువంటి బ్రహ్మానందానికి ఏ కారణం చెప్పబడలేదు. అందుచేత, బ్రహ్మంయొక్క గుణాలు ఏ ఉపాధిని ఆశ్రయించుకున్నవి కాదు అని, అవి భగవంతునకు సహజంగానే ఏర్పడి ఉన్నవి అని ఇక్కడ సారమైన అర్థంగా తోస్తున్నది.

2) "పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియా చ" (శ్వేతాశ్వతరోపనిషత్– 6 –8) పరమ పురుషునకు చాలా గొప్పది, సహజమైనది, పలు విధాలయినది అయిన శక్తి, జ్ఞానం, బలం, క్రియా అనేవి ఉన్నాయి అని వేదంలో చెప్పబడుతున్నది) అనే శ్రుతియే ఇంకొక చోట స్పష్టంగా తెలుపుతున్నది.

తరువాత, "అనవధికాతిశయ" అని శ్రీరామానుజులు అనుగ్రహించడానికి ఏమి అభిప్రాయం? అని గమనించి చూడాలి. ఆనందవల్లిలో మనుష్యానందం నుండి ఆరంభించి, బ్రహ్మానందం వరకూ కలిగినవారి ఆనందాన్ని లెక్కించాలని చూచినప్పుడు, పూర్వ పూర్వంగా ఉండే గుణాల కంటే ఉత్తరోత్తర గుణాలకు ఉండే అతిశయం అనేది మాటకు అందనిగానే కనబడుతున్నది. తరువాత, బ్రహ్మానందాన్ని గూర్చి చెప్పేటప్పుడు, దానిని " యతో వాచో నివర్తన్తే " అని వాక్కుకు, మనస్సుకు విషయంగా కాదు– అని వర్ణింపబడింది. ఇక్కడ బ్రహ్మానందం అనేది బ్రహ్మ యొక్క అతిశయాన్ని సూచిస్తుంది అనే విషయాన్ని మనం తెలిసిపోవాలి. అంటే ఈ ప్రకరణంలో మనుష్యానందాన్ని చెప్పేటప్పుడు గుణాలు, విభూతి అనే అన్నిటిని చేర్చే ఆనంద శబ్దం చెబుతున్నది. మనం సాధారణంగా గుణాలు విభూతులు అనే వీటి అనుభవం చేత లభించే ఒక జ్ఞానాన్ని ఆనందం అని భావిస్తున్నాము. ఇక్కడ ఇది మాత్రమే వివక్షితం

కాదు. ఇక్కడ గుణవిభూతులే ఆనంద శబ్దవాచ్యాలు అవుతున్నాయి అని ఈ ప్రకరణానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన చోట శ్రుతప్రకాశికాచార్య స్వామివారు అనుగ్రహించారు. దీని ప్రకారం చూస్తే, బ్రహ్మానందంలో గుణాలు, విబూతులు అంతర్భవిస్తాయి అనే విషయం చెప్పకుండానే తెలుస్తుంది. నిజంగా బ్రహ్మానందం లెక్కపెట్టడానికి సాధ్యం కానిది అంటే, ఈ బ్రహ్మానందంలో అంతర్భవించి ఉండే గుణ విభూతులకు కల అతిశయం అనవధికం అనేది స్పష్టపడుతున్నది. ఇక్కడఈ అర్థాన్ని మనసులో పెట్టుకునే "అనవధికాతిశయ" అని మన స్వామి భగవద్రామానుజులు అనుగ్రహించారు అని గ్రహించాలి.

ఇక్కడ ఇంతకు మించి ఒక విషయాన్ని అనుగ్రహిస్తున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు ఇది కూడా మనం తప్పక తెలుసుకొని ఆనందం పొందవలసిన విషయం. అది ఏమంటే, చాందోగ్యంలో పరమాత్మకు గుణాష్టకం చెప్పబడినది. దహర విద్యాప్రకారణంలోకూడా పరమాత్మకు "ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యుః విశోకోఽవిజిఘత్సోఽపిపాసో సత్యకామః సత్యసంకల్పః" అని ఎనిమిది విధాలైన గుణాలు పరమాత్మకు చెప్పబడ్డాయి. ఈ రుణాలలో"సత్య కామః" అని, " సత్య సంకల్పః" అని చెప్పబడిన గుణాలను గమనించి చూద్దాం. "సత్య సంకల్పః" —అప్రతిహత సంకల్పః— అంటే, అప్రతిహతమైన సంకల్పాన్ని కలవాడు అని అర్థం. "సత్య కామః" అని అంటే "కామ్యంత ఇతి కామాః, గుణ విభూతయః " అనే విధంగ కోరబడేవి ఏవో అవి. కామాలు —కోరికలు— ఇక్కడ కామ శబ్దం చేత చెప్పబడడం లేదు. కోరదగిన గుణవిభూతులను కలిగినవాడు పరమాత్మ — అని ఇక్కడ అర్థం. అందుచేత ఎప్పుడు దేనిని భావించినా, అది అతడు వెంటనే సృష్టించి పొందగలడు— అని అర్థం.

ఈ విషయం ఒక వైపు ఉందనివ్వండి. భగవంతునకు వశిత్వం అనే ఒక కళ్యాణ గుణం ఉన్నదని చాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది. అది ఇక్కడ చెప్పబడిందా? అని

అంటే, సత్య సంకల్పత్వం అనే గుణంలో ఇది అంతర్భవిస్తుంది అని చూపుతున్నారు, శ్రుత ప్రకాశికాచార్య స్వామివారు. ఏ విధంగా సత్య సంకల్పత్వం అనే గుణంలో వశిత్వాది గుణాలు చేరుస్తున్నామో, ఆ విధంగానే శ్రుతిచేత మిగిలిచోట్ల ఎక్కడ ఏ ఏ గుణాలు చెప్పబడ్డాయో, వాటిలో సంబంధం కల మిగిలిన గుణాలకుకూడా చేరుతాయి. ఒక గుణంలోనే పలు గుణాలు అంతర్భవిస్తాయి అనే విధంగా ఉండే గుణాలకు ఉండే అంతు లేని గొప్పతనాన్ని మనసులో పెట్టుకొని, ఇక్క రామానుజులు అనవధికాతిశయత్వం అనే విశేషణాన్ని ప్రయోగించారు అనేది మనం విశేషంగా తెలుసుకొని ఆనందించవలసిన వాస్తవమైన విషయం.

ఇక్కడ ఒక చర్చ ప్రస్తుత మవుతుంది. అది ఏమంటే, అనవధికాతిశయ అనే శబ్దం గుణాలకు విశేషణంగా ప్రయోగింపబడిందా? లేక, గణానికి, అంటే, గుణ సమూహానికి విశేషణంగా ప్రయోగింపబడిందా? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. ఇక్కడ ఆక్షేపం ఏమి అంటే, ఈ “అనవధికాతిశయ” అనే శబ్దం గుణాలకు విశేషణమై ఉండే పక్షంలో, ఇక్కడ బహువ్రీహి సమాసాన్ని చెప్పడం సాధ్యం కాదు. ఆ విధంగానే, అనవధికాతిశయ శబ్దాన్ని ఇక్కడ గుణానికి విశేషణంగా చెప్పడంకూడా తగదు. ఎందుకంటే, గుణంయొక్క స్వరూపం అనవధికాతిశయం అని చెప్పడానికి వీలు కాదు. గుణాల స్వరూపమే అనవధికాతిశయంగా ఉన్నది. అందుచేత ఇక్కడ గుణ శబ్దాన్ని ప్రయోగించే ప్రసక్తి లేదు– అనే అక్షేపం వస్తున్నది.

ఈ ఆక్షేపం మనస్సులో బాగా నిలవాలి అనేదానికోసం దీనిని ఇంకా కొంచెం వివరించి తెలుపుతాను. అది ఏమంటే, “అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణగణః” అనే వాక్యం ఉన్నది. ఈ వాక్యానికి అర్థం చెప్పేటప్పుడు “అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణగుణగణత్వాన్ని కలవాడు అనే అర్థం చెప్పాలి. ఇక్కడ అన్యపదార్థంగా భగవంతుడు సిద్ధిస్తున్నందున ఇక్కడ చెప్పబడిన విశేషణం

పరమాత్మకు విశేషణం అవుతున్నది. బహువ్రీహిసమాసం అంట ఏమి? అని కొంచెం తెలుసుకోవాలి. ఒక సమస్త పదంలో ఉండే రెండు అర్థాల కంటే వేరైనా అర్థం ఆ సమాసం వల్ల లభిస్తే, బహువ్రీహి సమాసం అనే పేరు ఆ సమాసానికి చెప్పబడుతుంది. ఉదాహరణంగా, "పీతాంబరః – పీతమ్ అంబరం యస్య సః పీతాంబరః" పచ్చని వస్త్రం ఎవరికి ఉన్నదో అతడు పీతాంబరుడు. ఇక్కడ పీతాంబరః అనే పదం వర్ణాన్ని చెప్పకుండా, వస్త్రాన్ని చెప్పకుండా, పచ్చని వర్ణాన్ని కలవానిని తెలుపుతున్నది. ఆవిధంగానే, "అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణగుణగణః" అని అంటే, అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణగణత్వాన్ని కలవాడు –అని అర్థం. " అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణానాం గణో యస్య సః–అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణగణః" అనే విగ్రహాన్ని ఇక్కడ చెప్పాలి. ఇక్కడ కలయికను పొందే పదాలలో సమానాధికరణ్యం లేకుండా ఉన్నందున, బహువ్రీహి సమాసం రాదు. "సమానాధికరణానాం బహువ్రీహి రిష్యతే"అని అనుశాసనం. ఇదే కాక, అనవధికాతిశయత్వం గుణాలకు మాత్రం విశేషణమై ఉన్నది తప్ప, గణానికి విశేషణంగాగా లేదు. గుణస్వరూపమే కదా అనవధికాతిశయంగా ఉన్నది, గణస్వరూపంఆ విధంగా లేదే. అందుచేత, గణ శబ్దం ఇక్కడ పొసగేటట్లు లేదు అనేది ఇక్కడ ఆక్షేపం.

ఈ ఆక్షేపానికి ఏమి సమాధానం? అని అంటే, ఇక్కడ గణమే విశేష్యం అవుతుంది. "అనవధికాతిశయ "అనే శబ్దం గణానికే విశేషణమై ఉన్నది. ఈ కారణంచేత బహువ్రీహి సమాసం సిద్ధిస్తుంది. దీనివల్ల లభించే అర్థాన్ని గమనించి చూచినప్పుడు, ఈ అనవధికాతిశయత్వం అనే విశేషణం గణంలో అన్వయించినా, ఆళగణంలో అంతర్భవించి ఉండే ఒక్కొక్క గుణంలోనూ అది ఉన్నది అనేది ఫలితంగా సిద్ధిస్తుంది. శబ్దస్వరూపం నుండి గణం అనవధికాతిశయంగా ఉన్నది అని స్ఫురించినప్పటికీ, అర్థ

బలం చేత ఈ విశేషణం అనేది గుణాల విషయంలోనే సిద్ధిస్తుంది అనేది పూర్వం పలికిన ఆక్షేపానికి సమాధానం

దీనికి ఒక ఉదాహరణంతో వివరిస్తాను. "పరిషత్‌అభిజనవతీ శ్రుత శీల శాలినీ" అనేది ఒక వాక్యం. ఈ గోష్టి అభిజనాలను కలిగినది, శాస్త్రంలోపరిణతిని కలిగినది, అంటే, చక్కని శ్రవణం, జ్ఞానం, ఆచారం అనే వీటిని కలిగినది—అనేది ఈ వాక్యానికి అర్థం. ఇక్కడ ఈ గోష్టికి చెప్పబడిన గొప్పతనాలు ఈ గోష్టిలో అంతర్భవించి ఉండే జ్ఞానుల విషయంలోనూ అన్వయిస్తాయి. ఎందుకంటే, ఈ గొప్పతనాలను గల సంబంధం గోష్ఠిలో ఉన్నవారికే ఉన్నది. అందుచేత ఈ గొప్పతనాలు సాధారణంగా గోష్ఠికి చెప్పబడినప్పటికీ, విశేషణాలుగా తోచినప్పటికీ, ఈ గోసష్ఠి లో ఉండే వారికే ఈ విశేషణాలు సిద్ధిస్తున్నాయి. ఈ విధంగా చెప్పకపోతే, ఈ గోష్ఠినుండి విడిపోయినవారికి ఈ విశేషణాలను చెప్పడం సాధ్యం కాదు. వారికి ఈ గోష్టిలో అన్వయం ఉంటేనే, అంటే, ఉండే సమయంలోనే ఈ గొప్పతనాలను చెప్పడం వీలవుతుంది. అయితే, వీరు ఈ గోష్ఠిలో ఉండే కాలంలోనూ, లేని కాలంలో కూడాఈ గుణాలు వీరిలో ఉన్నాయి. అందుచేత, గోష్ఠిని గూర్చి చెప్పబడే విశేషణాలు ఆ గోష్ఠిలో ఉండేవారి విషయంలోనే విశేషణాలు అవుతున్నాయి. ఆ విధంగానే ఇక్కడ కూడా గణాలే విశేష్యం అయినప్పటికీ, ఆ గణాలకు చెప్పబడిన విశేషణం ఆ గణాలలో అంతర్భవించిన ఒక్కొక్క గుణంలోనూ సిద్ధిస్తుంది. అందుచేత గణశబ్దం ఉండడం తగినదే.

అనవధికాశయత్వం అనే విశేషణం ఇంకా ఒక ముఖ్య మైన అర్థాన్నిశతెలుపుతున్నట్లు ఇక్కడ శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు అనుగ్రహిస్తున్నారు. అది ఏమంటే, ఈ అనవధికాతిశయ శబ్దం నిత్యులకంటే భగవంతునకు కల వ్యావృత్తిని బహుముఖంగా తెలుపుతున్నది అనేది ఇక్కడ మనం

గ్రహించవలసిన ముఖ్యమైన అర్థం. శ్రుతప్రకాశికాచార్య స్వామి వారు తెలియజేసే అర్థం ఏమంటే–

1) "అనవధికాతియశబ్దేన నిత్య సిద్ధవ్యావృత్తిశ్చ తగద్గుణానాం జగద్వ్యాపారాననుగుణత్వేన సాతిశయత్వాత్"–అంటే, అనవధికాతిశయ శబ్దం చేత నిత్యసిద్ధుల వ్యావృత్తి సిద్ధిస్తున్నది. నిత్యుల గుణాలు జగద్వ్యాపారానికి అనుగుణంగా ఉండేవి కాదు. అందుచేత భగవంతుని గుణాల కంటే వీరి గుణాలు సాతిశయాలు. అనవధికాతిశయ గుణాలు భగవంతుని విషయంలో మాత్రమే దర్శింపబడుతున్నాయి. ఈ విధంగా నిత్యుల వ్యావృత్తి అనేది భగవంతునిలో సిద్ధిస్తున్నది.

2) తేషాం ఈశ్వరతద్గణ విభూతిసాక్షాత్కారస్య అత్యంతానుకూలస్య నిరవధికాతిశయత్వేఽపి తాదృశాసంఖ్యేయ గుణాభావాత్తద్వ్యవృత్తిః"– భగవంతుని గుణాలు, విభూతులు అనే వీటిని సాక్షాత్కరించుకోవడానికి తగినవిగా అత్యంత అనుకూలమైన గుణాలను కలవారు నిత్యులు అని అన్నందున, వీరి గుణాలకు నిరవధికత్వం వచ్చినప్పటికీ కూడా, భగవంతుని గుణాల వలెనే ఆసంఖ్యేయ గుణలు వీరిలో దర్శింపబడడం లేదు, ఎందుకంటే, అణుస్వరూపులై వీరు ఉండడంచేత వీరికి స్వరూపంతో అనవధికాతిశయత్వం అనేది లేదు. భగవంతుడు స్వరూపంతో, విభువై ఉండేవాడు, స్వరూపంతో అనవధికాతిశయత్వం అనేది ఇతనికి మాత్రమే ఉన్నది. ఇందువల్ల కూడా నిత్య సిద్ధులు ఇక్కడ వ్యావర్తింపబడుతున్నారు.

అయితే, "అనవధికాతిశయాసంఖ్యేయకళ్యాణ గుణగణః " అనే ప్రయోగంలో భగవంతుని గుణాలకు కదా అనవధికాతిశయత్వం శ్రీరామానుజుల చేత అనుగ్రహింపబడింది. భగవంతుని స్వరూపానికి అనవధికాతిశయత్వం చెప్పబడలేదే? అనే ఒక సందేహం ఇక్కడ కలుగవచ్చు. ఇక్కడ మనం ఏ విధంగాఅ ర్థాన్ని గ్రహించాలి

అని అంటే, భగవంతుని స్వరూపవిభుత్వాన్ని ఒక గుణంగా గ్రహించాలి. ఈ విభుత్వం అనేది భగవంతుని అనవధికాతిశయాసంఖ్యేయకళ్యాణ గగుణాలలో ఒకటిగా ఉన్నందున, భగవంతుని స్వరూపానికి అనవధికాతిశయత్వం సిద్ధిస్తుంది. ఇది నిత్యుల విషయంలో లేదు కనుక వారు వ్యావర్తింపబడుతున్నారు అని చెప్పవచ్చు.

3) "అనూషక్తేన ఇతి పదేన వా నిత్యసిద్ధ వ్యావృత్తిః" ఈ అర్థాన్ని ఇంతకు ముందే వివరించడం జరిగింది. అంటే, 'స్వభావతోనిరస్త నిఖిల దోషః, అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణగుణగణః ' –అని శ్రీ రామానుజుల శ్రీ సూక్తి. ఇందులో "స్వభావతః "అనే పదాన్ని రెండవ విశేషణంలో కూడా చేర్చుకోవాలి. "స్వభావతః అనవధికాతిశయాసంఖ్యేయ కళ్యాణ గుణగణః" అని అర్థం. నిత్యసిద్ధుల గుణాలు భగవంతుని ఇచ్ఛకు అధీనాలుగా ఏర్పడినవి. అవి స్వాభావికమైనవి కాదు అనే కారణంచేత కూడా వారు వ్యావర్తింపబడుతున్నారు అని భావం.

ఇంతకు ముందు "బృహత్వం చ స్వరూపేణ గుణైశ్చ" స్వరూపంతోనూ, గుణంతోనూ బృహత్వం బ్రహ్మకు చెప్పబడింది అనిభగవద్రామానుజులు అనుగ్రహించారు. ఇందుచేత స్వరూపంతో వచ్చే బృహత్వం, గుణంతో వచ్చే బృహత్వం అనే ఇవి రెండు భగవంతుని ఒక్కనిలో మాత్రమే దర్శింపబడుతున్నాయి అని ఏర్పడుతున్నది. ఈ స్వభావం నిత్యసిద్ధులలో లేనందు వల్ల వారిలో అనవధికాతిశయత్వం గానీ, అసంఖ్యేయత్వం గాని దర్శింపబడడం లేదు. అందుచేత, వారు వ్యావర్తింపబడుతున్నారు అని చెప్పినట్లయినది.

ప్రసంగం వశం చేత ఒక విషయాన్ని ఇక్కడ విజ్ఞాపన చేస్తాను. "వ్యాపనాత్ భరణాత్స్వామ్యాత్ అన్యః పంచదశోదితః" అని పరమాచార్యులైన భగవద్యాములు

గీతార్థసంగ్రహం 15వ అధ్యాయానికి సంబంధించిన శ్లోకంలో అనుగ్రహించారు. వ్యాపనం, భరణం, స్వామ్యం అని పురుషోత్తముడైన భగవంతునికే ఉండే గొప్పతనాలను ఈ శ్రీసూక్తుల ద్వారా మనకు తెలియజేస్తున్నారు, శ్రీయామునులు. వ్యాపనం అంటే లోపల ప్రవేశించి నియమించడం అని అర్థం. "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా" –సర్వాంతర్యామి అయిన నారాయణుడు జీవుల లోపల ప్రవేశించి, వారిని నియమిస్తున్నాడు–అని శ్రుతి పలుకుతున్నది. ఈ గొప్పతనం భగవానునకు ఒక్కని కి మాత్రమే ఉన్నది. అన్నిటిని ధరించడం భరణం అనబడుతుంది. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః " (బృహదారణ్యకం–5–8– 9) అక్షరడైన భగవంతుని సంకల్ప జ్ఞాన విశేషం చేత సకల లోకాలు ధరింపబడుతున్నాయి అని ఈ శ్రుతి వాక్యం తెలుపుతున్నది. ఇదే అన్నిటినీ ధరించడం అనే స్వభావం, అంటే, భరణం అనబడుతుంది. స్వామ్యం అనేది భగవంతుని స్వామిత్వాన్ని, అంటే, శేషిత్వాన్ని తెలుపుతుంది. నిత్యులకుకూడా భగవంతుడు స్వామి అయి ఉన్నాడు. అందుచేత ఈ మూడు స్వభావాలతో సకలచేతనుల కంటే భగవంతునకు వ్యావృత్తి సిద్ధిస్తున్నది అని అంటున్నారు, శ్రీయామునులు.

అనవధికాతిశయత్వం వలెనే అసంఖ్యేయత్వం కూడా గణానికి విశేషణం అవుతున్నది అని గ్రహించడం పొసగుతున్నది. గణాసంకేయత్వే గుణాసంఖ్యేయత్వం కైముత్యసిద్ధమ్" అని అంటారు. కైముత్యన్యాయంతో గణంలో ఉండే గుణాలకు కూడా అసంఖ్యేయత్వం సిద్ధిస్తున్నది. ఇక్కడ అసంఖ్యేయత్వాన్ని గణానికి కూడా చెప్పవచ్చు, గణంలో అంతర్భవించి ఉండే గుణాలకు కూడా చెప్పవచ్చు.

ఇక్కడ గణ శబ్ద ప్రయోగం ఎందుకు చేయబడింది? అనే ప్రశ్న వస్తుంది. బ్రహ్మ శబ్దం చేత గుణంతో బృహత్వం చెప్పబడింది. పూర్వం తెలిపిన విధంగా బ్రహ్మం యొక్క

పలు ముఖ్యమైన గుణాలు ఒక్కొక్కటిలోనూ వాటి ప్రకార భేదం ఉండే అనేక గుణాలు అంతర్భవించి ఉన్నాయి. అందుచేత గుణాలు అని చెప్పకుండా, "గుణగణ"అని ప్రయోగింపబడింది.

తరువాత ఈ శ్రీసూక్తి లో "అపరిమిత" అని శ్రీరామానుజులు అనుగ్రహించడానికి కల అభిప్రాయాన్ని శ్రుతప్రకాశికా చార్యస్వామి వారు చూపిన రీతిని మనం గమనించి చూడాలి. "అభిధీయతే" అనేదానికి ముఖ్యవృత్తితో బోధింపబడుతున్న ది అని అర్థం. వృత్తి అంటే బోధనం. ఇది ముఖ్యవృత్తి(అభిధావృత్తి) అని, (గౌణ) అముఖ్య వృత్తి అని రెండు విధాలుగా ఉంటుంది. బ్రహ్మ శబ్దం యొక్క సముదాయశక్తితో బ్రహ్మ శబ్దవాచ్యుడు పురుషోత్తముడైన నారాయణుడు అనే దానిని తెలియజేస్తున్నది అనే విషయం ఇక్కడ సారంగా చెప్పబడుతున్న అర్థం.

"యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్వతో బ్రహ్మవిద్యామ్" – ఏ బ్రహ్మ విద్యతో అక్షరుడైన స్వరూప స్వభావ వికారాలు లేనివాడైన పురుషుని తెలుసుకుంటున్నాడో, అటువంటి బ్రహ్మవిద్యను ఆచార్యుడైనవాడు తన దగ్గరకు వచ్చి ఆశ్రయించిన శిష్యునకు ఉపదేశించాలి అని ముండ కోపనిషద్వాక్యం "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే మొదటి సూత్రంలోని అర్థాన్ని అంతర్భవించుకున్నది. ఈ ఉపనిషద్వాక్యంలో బ్రహ్మశబ్దవాచ్యుడు పురుషుడు అని నిర్దేశించినందున శ్రుతియే బ్రహ్మ శబ్దవాచ్యుడు పురుషోత్తముడు అని తెలియజేస్తున్నది అనే విషయం స్పష్టమవుతున్నది. ఈ కారణంచేత ఇక్కడ, అంటే, "బ్రహ్మ శబ్దేన చ స్వభావతో నిరస్త నిఖిల దోషః అనవధికాతిశయ అసంఖ్యేయ కళ్యాణ గుణగణః పురుషోత్తమోభిధీయతే" అని పలికిన చోట స్వామి భగవద్రామానుజులచే ఈ ముండ కోపనిషత్ వాక్యం అనుసంధింపబడినదిగా గ్రహించాలి అని అంటున్నారు, శ్రుతప్రకాశికాచార్య స్వామివారు. ఈ కారణంచేతనే బ్రహ్మ శబ్దాన్ని వివరించే సందర్భంలో బ్రహ్మ శబ్దార్థం

పురుష పదవాచ్యుడైన పురుషోత్తముడే– అనే అర్థం స్పష్టంగా తెలుపడం కోసమే పురుషోత్తమ పదప్రయోగాన్ని శ్రీరామానుజులుచేశారు అని తెలుస్తున్నది. పురుషశబ్దవాచ్యుడు శ్రీమన్నారాయణనుడే అనే విషయం నిర్వివాదం. దీనిని వేదమే మనకు తెలియజేస్తున్నది. ఏ విధంగా అంటే, ఈ అర్థం పురుష సూక్తంలో వ్యక్తం. సకల వైదికులు పురుషసూక్తప్రతిపాద్యుడు శ్రీమన్నారాయణుడే అని అంగీకరిస్తున్నారు.

ఈ విధంగా ప్రతిజ్ఞ చేయబడిన అర్థాన్ని "సర్వత్ర బృహత్త్వగుణయోగేన హి బ్రహ్మశబ్దః, బృహత్త్వం చ స్వరూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయత్వం సః అస్య ముఖ్యోఽర్థః. స చ సర్వేశ్వర ఏవ. అతో బ్రహ్మశబ్దః తత్రైవ ముఖ్యవృత్తః. తస్మాదన్యత్ర తద్గుణలేశయోగాదౌపచారికః, అనేకార్థ కల్పనాయోగాత్, భగవచ్ఛబ్దవత్"అని శబ్దశక్తితో ఉపపాదనం చేశారు, భగవద్రామానుజులు.

"సర్వత్ర బృహత్త్వగుణయోగేన హి బ్రహ్మశబ్దః"– అన్ని చోట్ల బృహత్త్వమనే గుణయోగంతో కదా (గొప్పతనం అనే గుణంయొక్క సంబంధించే కదా)ఈ బ్రహ్మ శబ్దమనేది వ్యవహరింపబడుతున్నది. ఈ బ్రహ్మ శబ్దంఏ వస్తువుల విషయంలో ప్రయోగింపబడుతున్నదో, ఆ వస్తువులలో అంతటా బృహత్త్వం అనే గుణంయొక్క సంబంధం ఉంటుంది

"బృహత్త్వం చ స్వరూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయత్వం సః అస్య ముఖ్యోఽర్థః. "–అయితే ఏ వస్తువు విషయంలో స్వరూపంతోనూగుణంతోనూఅంతులేని అతిశయం తలబృహత్త్వము ఉన్నదోఅదే ఆ బ్రహ్మ సిద్ధం చేతముఖ్యంగా నిర్దేశింపబడుతున్నది.

"స చ సర్వేశ్వర ఏవ. అతో బ్రహ్మశబ్దః తత్రైవ ముఖ్యవృత్తః. "– ఈ విధంగా బ్రహ్మ శబ్దం అనేది ముఖ్య వృత్తితో నిర్దేశించేది సర్వేశ్వరునే. బృహత్త్వం అనే స్వభావం

అంతులేనిదిగా లేకుండా, అవధి కలిగినదిగాఏ ఏ వ్యక్తులలో గమనింపబడుతున్నదో ఆయా వ్యక్తులు, తత్వాలు అన్నీ బ్రహ్మశబ్ద ప్రయోగానికి ముఖ్యార్థంగా చెప్పబడవు. ఇవి బ్రహ్మ శబ్దానికి గౌణమైన అర్థంగానే ఉంటాయి.

"తస్మాదన్యత్ర తద్గుణలేశయోగాదౌపచారికః, అనేకార్థ కల్పనాయోగాత్, భగవచ్ఛబ్దవత్" –భగవచ్ఛబ్దం ఏ విధంగా మిగిలిన కొందరు వ్యక్తులలో ఉపచారంగా వ్యవహరింపబడుతున్నదో, ఆ విధంగానే ఈ బ్రహ్మ శబ్దం కూడా మిగిలిన వస్తువుల విషయంలో గౌణంగా ప్రయోగింపబడుతున్నది.

ఇక్కడ ఒక ఆక్షేపం వస్తున్నది. బ్రహ్మశబ్దం అనేది పురుషోత్తముడైన సర్వేశ్వరుని విషయంలోఎందుకు ముఖ్యంగా, మిగిలినవారి విషయంలో గౌణంగా వ్యవహరింపబడాలి? ఈ బ్రహ్మ శబ్దం పురుషోత్తముని విషయంలో గౌణంగాన, మిగిలినవారి విషయంలో ముఖ్యంగాను వ్యవహరింపబడవచ్చు కదా! అనేది ఆ అక్షేపం. ఈ ఆక్షేపానికి సమాధానంగానే శ్రీరామానుజులు బ్రహ్మ శబ్ద ప్రయోగానికి అర్థాంతరాలలో, అంటే, ప్రకృతి, ముక్తజీవుడు, దేవతాంతరాలు వంటివారి విషయంలో అన్యథా సిద్ధిని, పురుషోత్తముని విషయంలో అనన్యథా సిద్ధిని తెలియజేశారు. దీనికి ఆధారంగా బ్రహ్మకు ఉండే బృహత్వగుణయోగాన్ని చూపుతున్నారు. ఈ అర్థాన్ని చూపేటట్లుగా ఉండే శ్రీసూక్తులే. "బృహత్వం చ స్వరూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయత్వం సః అస్య ముఖ్యోఽర్థః. స చ సర్వేశ్వర ఏవ. అతో బ్రహ్మశబ్దః తత్రైవ ముఖ్యవృత్తః. తస్మాదన్యత్ర తద్గుణలేశయోగాదౌపచారికః, అనేకార్థ కల్పనాయోగాత్, భగవచ్ఛబ్దవత్"అనేవి. అంటే, స్వరూపంతోనూ, గుణంతోనూ అంతు లేని గొప్పతనాన్ని కల స్వభావం బృహత్వం అనబడుతుంది. ఇటువంటి నిరతిశయబృహత్వమే బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తం అవుతున్నది.

భగవచ్ఛబ్దార్థాన్ని వివరించే సందర్భంలో శ్రీ విష్ణు పురాణంలో "తత్ర పూజ్యపదార్థోక్తిః పరిభాషా సమన్వితః, శబ్దోయం నోపచారేణ అన్యత్ర హ్యుపచారతః" —దీని భావం ఏమంటే—పూజ్య పదార్థాన్ని చెప్పడం అనే నియమంతో కూడిన ఈ భగవచ్ఛబ్దం నారాయణని విషయంలో ఉపచార వృత్తి లేకుండా ముఖ్యంగా ప్రయోగింపబడుతున్నది. మిగిలినవారి విషయంలో ఉపచారంగా ప్రయోగింపబడుతున్నది— అని. దీని ప్రకారం చూస్తే సర్వేశ్వరుని విషయంలో మాత్రమే ఈ బ్రహ్మ శబ్దప్రయోగం ముఖ్య వృత్తం, పురుషోత్తముని తప్ప మిగిలినవారి విషయంలో ఈ బ్రహ్మ శబ్దం ప్రయోగింపబడేటప్పుడు అది ఔపచారికమే.

ఈ సందర్భంగాఅన్యధాసిద్ధి, అనన్యధా సిద్ధి అని అంటే ఏమి అని తెలియాలి అని అంటే, వాటిని గూర్చి కొంచెం వివరిస్తాను. నియమాలకు అన్నిటికీ అన్యధా సిద్ధి, అనన్యదాసిద్ధి అనేవి వర్తిస్తాయి అని మనకు తెలియాలి. సాధారణంగా ప్రయోగాలు, ప్రమాణాలు ఇచ్చ వంటిచోట్ల ఇవి వస్తాయి. మన దగ్గర ఒక పుస్తకం ఉన్నది. మన ఇంటిలో ఉండే కుర్రవాడు ఈ పుస్తకాన్ని ఆశతో దానిని చించి ఆడుకోవాలని కోరతాడు. అదే పుస్తకాన్ని, దానిని చదివి దానినుండి జ్ఞానాన్ని సంపాదించుకోవాలి అని ఆశతో మనం కూడా కోరుతున్నాము. ఈ విధంగా ఒకే పుస్తకంవిషయంలో మనకు ఆశ ఉన్నది, కుర్రవానికి కూడా ఆశ ఉన్నది. ఇందులో ఏ ఇచ్ఛా అన్యథాసిద్ధం, ఏది అనన్యధాసిద్ధం అని మనం నిర్ణయించుకోవాలి పుస్తకాన్ని చించి ఆడుకోవాలని కోరే కుర్రవాడు తన ఆశను ఇంకొక పుస్తకం ద్వారా కూడా పూర్తి చేసుకోవచ్చు. అందుచేత కుర్రవాని ఆ ఇచ్ఛ అన్యధాసిద్ధం. కానీ మనం ఈ పుస్తకాన్ని చదివి ఏ జ్ఞానాన్ని సంపాదించుకోవాలని కోరుతున్నామో, ఆ జ్ఞానాన్ని ఈ పుస్తకం మూలంగానే పొందడానికి వీలవుతుంది. ఇంకొక ఏ పుస్తకంవల్ల ఆ జ్ఞానాన్ని పొందడం వీలు కాదు. అందుచేత ఈ పుస్తకాన్ని విషయంలో మనకు కల ఇచ్ఛ ఆనన్యధాసిద్ధం అవుతున్నది.

ఇదే విధంగా ప్రమాణాల విషయంలో కూడా అన్యథాసిద్ధి, అనన్యథాసిద్ధి అనేవి ఏ విధంగా ఉంటాయి? అనేది గమనించాలి. మనకు ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అని మూడు ప్రమాణాలు ఉన్నాయి. కొన్ని సమయాలలో ప్రత్యక్ష ప్రమాణం ఒక విషయాన్ని ఏ విధంగా చూపుతుందో, దానికి విరుద్ధంగా అనుమానం తెలియజేయవచ్చు. ఈ రెండు ప్రమాణాలలో ఏది అన్యథాసిద్ధం, ఏది అనన్యథాసిద్ధం అనేదానిని పరిశీలించి చూచి, అనన్యథాసిద్ధంగా ఉండే ప్రమాణం చూపే అర్థాన్ని మనం అంగీకరించాలి. ఉదాహరణంగా—ఒక చోట దీపం వెలిగింపబడింది. దాని నుండి బయటకు వచ్చే జ్వాల అనేది ఒకటే అని మన కన్ను చూపుతున్నది. అందులో ఉండే జ్వాలాభేదాన్ని మన కన్నులు గ్రహించలేదు. అయితే, దీపం వెలిగేటప్పుడు, అందులో ఉండే నేయి, వత్తి అనే వీటికి తరుగుదల కనిపిస్తున్నందున, జ్వాలాభేదం ఉన్నది అని మనం అనుమాన ప్రమాణం ద్వారా తెలుసుకుంటున్నాము. ఇక్కడ ప్రత్యక్ష ప్రమాణం జ్వాలైక్యాన్ని చూపిస్తున్నది. అనుమానం జ్వాలా భేదాన్ని తెలుపుతున్నది. ఈ విధంగా ఒకే విషయంలో రెండు ప్రమాణాలు ఒకదానికి ఇంకొకటి విరుద్ధాలయిన అర్థాలను తెలియజేస్తున్నాయి. అయితే, వీటిలో ఏదో ఒకటే యథార్థంగా ఉండే అవకాశం ఉన్నది. ఈ రెండు ప్రమాణాలలో ఏది అన్యథాసిద్ధం, ఏది అనన్యథాసిద్ధం అనే విషయాన్ని తీర్మానించుకుని, దాని ప్రకారం అనన్యథా సిద్దంగా ఉండే ప్రమాణం చూపే అర్థాన్నే మనం గ్రహించాలి.

అందుకోసం మనం ఈ ప్రమాణాలు తెలియజేసే అర్థాలను గమనించి చూడాలి. ఈ ప్రమాణాలు చూపే విషయాలను మనం మార్చి చూడాలి. ఆ విధంగా మార్చేటప్పుడు, ఆ ప్రమాణం నిలిస్తే, అది అన్యథాసిద్ధం అవుతుంది. ఆ విధంగా విషయాలను మార్చినప్పుడు ఆ ప్రమాణం నిలువకపోతే, అది అనన్యథాసిద్ధం అవుతుంది. అనన్యథా సిద్ధమైన ప్రమాణమే ప్రబల ప్రమాణం అవుతుంది. అదే

గ్రహించదగినది అవుతుంది. ఇక్కడ అనుమాన ప్రమాణంతో తెలియపడే అర్థం జ్వాలాభేదం కంటే వేరు ఏదైనా ఉండే అవకాశం ఉన్నదా? అనే విషయాన్ని గమనించాలి. ఇక్కడ అనుమాన ప్రమాణం అనేది జ్వాలయొక్క స్వరూపాన్ని గాని, లేక, నేయి, వత్తి వంటిసామగ్రులగాని చూపుతున్నది అని భావిస్తే, ఈ ప్రమాణం నిలువదు. ఎందుకంటే, ఈ విషయాలను మనం తెలియడానికి మనకు అనుమానం అక్కరలేదు. జ్వాలాస్వరూపం, సామగ్రులు అన్నీ ప్రత్యక్షంతోనే తెలియబడుతున్నాయి. అందుచేత, ఇక్కడ అనుమానం అనన్యధాసిద్ధంగా ప్రకాశిస్తున్నది. జ్వాలా భేదాన్ని చూపకుండా, జ్వాలా స్వరూపాన్ని, లేక, సామగ్రులను బోధించడంతో మాత్రం ప్రత్యక్ష ప్రమాణం అనేది నిలువ గలదు. దానికి జ్వాలైక్యాన్ని మాత్రం చూపాలి అనే నిర్బంధం లేదు. అందుచేత, ఇక్కడ ప్రత్యక్షమనేది అన్యధాసిద్ధం. అందుచేత ఇక్కడ రెండు ప్రమాణాలు నిలువడానికి, ప్రత్యక్షానికి జ్వాలాస్వరూపాన్ని, సామగ్రులను విషయంగా గ్రహించి, అనుమానానికి జ్వాలాభేదాన్ని విషయంగా గ్రహించి నిర్వహించాలి. ఈ విధంగా ఇక్కడ ప్రత్యక్షం అన్యధాసిద్ధం అవుతున్నది. అందుచేత అది దుర్బలం అని, అనుమానం అనన్యధాసిద్ధం, అందుచేత అది ప్రబలం అని తెలుస్తున్నది.

ఈ విధంగానే, ఇక్కడ బ్రహ్మ శబ్ద ప్రయోగం అనేది ఏ అర్థంలో అనన్యధాసిద్ధంగాను, ఏ అర్థంలో అన్యధా సిద్దంగాను అవుతున్నది అనే విషయాన్ని గమనించాలి. బ్రహ్మశబ్ద ప్రయోగం అనేది శబ్దశక్తి చేత పురుషోత్తముని చూపితే తప్ప నిలువదు. ఇందుచేత, ఇదిపురుషోత్తముని విషయంలో ఆనన్యధా సిద్ధం. అయితే, బ్రహ్మ శబ్దప్రయోగం అనేది ప్రకృతి, ముక్త జీవుడు మొదలైన అర్థాంతరాలను చూపకుండాకూడా నిలువ గలదు. అందుచేత, వీరి విషయంలో బ్రహ్మశబ్దప్రయోగం అనన్యధాసిద్ధం.

ఈ విధంగా బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తం అనేది–స్వరూపంతోనూ, గుణంతోనూ ఉండే అనవధికాతిశయ బృహత్వం అని శ్రీ రామానుజులు అనుగ్రహించడానికి ఆధారంగా రెండు ప్రమాణ వచనాలను మన పెద్దలు ఉదాహరిస్తారు. "బృహతి బృంహయతి తస్మాత్ ఉచ్యతే పరబ్రహ్మ " అనేది శ్రుతివాక్యం. పెద్దదై ఉండేది(బృహత్వం), పెద్దదిగా చేసేది (బృంహణత్వం) కనుక బ్రహ్మ అని చెప్పబడుతున్నది–అని దీనికి అర్థం. "బృహత్వాత్ బృంహణత్వాచ్చ తద్బ్రహ్మేత్యభిధీయతే" అని స్మృతి అయిన శ్రీవిష్ణుపురాణ వచనం ఈ అర్థాన్నే తెలుపుతున్నది. ఈ ప్రమాణ వచనాలు రెండిటి వల్ల బృహత్వం, బృంహణత్వం అనే రెండు బ్రహ్మకు ప్రవృత్తి నిమిత్తాలని తెలుస్తున్నది.

అయితే, శ్రీరామానుజులుశ్రీసూక్తిలో బృంహణత్వం అనేది బ్రహ్మ యొక్క ప్రవృత్తి నిమిత్తంగా స్పష్టంగా చెప్పబడలేదుకదా అనే ప్రశ్న ఇక్కడ రావచ్చు. బృంహణత్వం అంటే ఏమి? అనే అర్థాన్ని వివరించి, ఈ బృంహణత్వం అనేది బ్రహ్మ యొక్కగుణ గుణబృహత్వంలో అంతర్భవిస్తుంది అనే వివరణను శ్రుతప్రకాశికాచార్య స్వామివారు అనుగ్రహించారు. సంసారి జీవుడు సకల సంకోచనివృత్తి పూర్వక ("స చానంత్యాయ కల్పతే) అనే రీతిలో నిరవధిక ధర్మభూతజ్ఞానవికాసరూపమైన ఆనందాన్ని పొందే విధంగా అనుగ్రహాన్ని చేసే భగవంతుని గుణ విశేషం (మోక్షప్రదత్వం, లేక, మోక్ష ప్రదత్వానికి ఉపయోగి అయిన అఖిల హేయ ప్రత్యనీకత్వం, క్షమ, కరుణ మొదలైన గుణాలు) బృంహణత్వం అనబడుతున్నాయి. ఈ గుణాలు భగవంతుడు మనకు మోక్షాన్ని ఇవ్వడానికి ఉపయోగమై ఉండే గుణాలు. అతడు హేయ ప్రత్యనీకుడై ఉంటేనే అతనిని మనం ఆశ్రయిస్తే, అతడు మన దోషాలను పోగొట్టడానికి వీలవుతుంది. ఈ విధంగా హేయప్రత్యనీకుడై అతడు ఉన్నప్పటికీ కూడా, దాని మూలంగా మనంఅతనిని ఆశ్రయించిన కూడా, అతడు మనకి మోక్షాన్ని అనుగ్రహించడానికి హేతువుగా అతని

దగ్గర మన దోషాలను సహించడం, కరుణ వంటి గుణాలు ఉండాలి. ఇటువంటి గుణాలను కలిగి ఉండే స్వభావమే బృంహణత్వం అనబడుతుంది.

ఇటువంటి గుణాల వల్ల ఏర్పడే బృహత్వమే బృంహణత్వంగా ఉన్నందున ఈ బృంహణత్వమనేది గుణ బృహత్వంలో అంతర్భవిస్తుంది. చేతననకు సంసారి దశలో జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు మొదలైన వాటిలో సంకోచం కలుగుతుంది. ఈ సంకోచానికి నివృత్తి ఏర్పడడమే సకల సంకోచనివృత్తి అనిచెప్పబడుతున్నది. లేక, "య ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకోஉవిజఘత్సో పిపాసః సత్యకామః సత్య సంకల్పః" అని, " అవస్థాసు ఆవిః స్యుః మమ సహజకైంకర్యవిధయః " అని చెప్పినట్లుగా జీవాత్మకు సంసారి దశలో సంకోచాన్ని పొందిన గుణాష్టకాల ఆవిర్భావమేఇక్కడ సకల సంకోచ నివృత్తి అని నిర్దేశింపబడిననట్లుగా గ్రహించాలి.

జీవుడు ముక్తదశలో కూడా అణుస్వరూపుడుగానే ఉన్నప్పటికీ, అతని ధర్మభూతజ్ఞానమనేది విభుత్వాన్ని పొందినందున, ఈ అర్థంలో చేతనునికూడా పెద్దవానినిగా చేయడం అనేది బృంహణత్వం అవుతున్నది.

ఇవే ఇక్కడ మనం సారంగా గ్రహించవలసిన అర్థ విశేషాలు.

ఇక, తరువాత, స్వరూప బృహత్వాన్ని మాత్రం ఎందుకు బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తంగా చెప్పకూడదు? అనే ప్రశ్న వస్తుంది. బ్రహ్మకు జ్ఞానం, శక్తి మొదలైన గుణాలుఉన్నాయి. జ్ఞానం అనేది ఒక ద్రవ్యం. ఇది స్వరూపంతో విభువై ఉన్నందున, దీనికి కూడా బృంహణత్వాన్ని చెప్పవలసి వస్తుంది. భగవంతుడు మాత్రం బ్రహ్మమై ఉండడం సాధ్యం తప్ప, జ్ఞానం బ్రహ్మగా కాలేదు. ముక్త జీవుని స్వరూపం అణువై ఉన్నప్పటికీ, అతని ధర్మభూత జ్ఞానం విభువై ఉన్నందున, దానికి కూడా బ్రహ్మశబ్దవాచ్యత్వం వస్తుంది. అందుచేత స్వరూప బృహత్వాన్ని మాత్రం బ్రహ్మకు

ప్రవృత్తి నిమిత్తంగా గ్రహిస్తే, భగవంతుని జ్ఞానాధి గుణాలు, ముక్తుల ధర్మభూత జ్ఞానం –అనే వీటికి కూడా బ్రహ్మత్వం చెప్పవలసి వస్తుంది. ఇక, గుణబృహత్వం మాత్రం బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తంగా ఉండనీ! అని అంటే, అది కూడా సాధ్యం కాదు. దీనికి ఎన్నో కారణాలు ఉన్నాయి. బ్రహ్మ అనే పదానికి ఉండే శబ్దశక్తికిసంకోచం లేకపోవడం అనేది సహజంగానే ఏర్పడిన స్వభావం. బ్రహ్మ అనే శబ్దాన్ని విన్నంత మాత్రంలోనే ఈ శబ్దశక్తికి సంకోచం లేని స్వభావం చేత, ఇది స్వరూప బృహత్వాన్ని చూపుతుంది. దీనిని మనంగా సంకోచింప చేసి, గుణబృహత్వాన్ని మాత్రం ఈ శబ్దం చూపుతుంది –అని గ్రహించడం సాధ్యం కాదు.

ఇంతే కాకుండా, ప్రమాణం వల్ల కూడా బ్రహ్మకు స్వరూపంతో బృహత్వం సిద్ధిస్తున్నందున ఈ కారణం చేత కూడా దానిని లేదు అని అనడం సాధ్యం కాదు. "సత్యం జ్ఞానంఅనంతం బ్రహ్మ* అని శ్రుతి వాక్యం. సత్యమై(నిర్వికారమై), జ్ఞానమై(అపరిచ్ఛిన్న జ్ఞానమై) అనంతమై (కాలవస్తు దేశపరిచ్ఛేద రహితమై) ఉండేది బ్రహ్మం అని దీనికి అర్థం. ఈ శ్రుతి వాక్యంలో ఉండే అనంతమనే పదం బ్రహ్మం యొక్క స్వరూప బృహత్వాన్ని ఉద్దేశించి చెప్పబడింది. అందుచేత బ్రహ్మకు స్వరూప బృహత్వం అనేది ప్రమాణాల వల్ల కూడా వ్యక్తమవుతున్నందున, దానిని మనం లేదు అని చెప్పడానికి వీలు కాదు. అందువల్ల స్వరూపంతో బృహత్వం, గుణంతో బృహత్వం అని ఈ రెండు స్వభావాలు చేరే బ్రహ్మ శబ్దానికి ప్రవృత్తి నిమిత్తాలు అవుతున్నాయి అని స్పష్టపడుతున్నది.

**సుధారసమంజరీ – 3 శ్రీ భాష్యసారం**

**సంపూర్ణమ్**

***